# కుమారసంభవము.

కవిరాజశిఖామణి టేంకణాదిత్యాది బిరుదాంకిత సూర్యవంశరాజశిఖామణి

## నన్నెచోడదేవ

(A. D. 940)

ప్రణీతము.

ఇది

కళింగసేనాదికృతికర్తయగు

## మా - రామకృష్ణకవిచే

సంస్కరింపఁబడి ప్రచురింపఁబడినది.

చెన్నపట్టణము - వేపేరి

ఎం. టి. వి. చెంగల్వరాయనాయకర్ ఆర్ఫనేజ్ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

1909.

**వావిళ్ల.** రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

**[illegible], తండియార్**పేట, 192, ఎస్ప్లనేడ్, మద్రాస్

# పీఠిక.

ఈమహాకావ్యమును రచించిన కవి నన్నెచోడదేవుఁడు. ఇతనికిఁ గవితాప్రౌఢిమను బట్టి కవిరాజశిఖామణియనియు దిగ్విజయమునుబట్టి టెంకణాదిత్యుఁడనియు బిరుదములు గలవు. ఇతఁడు సూర్యవంశపు క్షత్రియుఁడు. ఇతఁడు కావేరీతీరమున నొరయూరను పట్టణము రాజధానిగా గోదావరి సింహాళమధ్యదేశము నేలెను. వీనితండ్రి చోడపల్లి. తల్లి శ్రీసతి. ఇతఁడు క్రీ-శ. ౧౧౮౦లోఁ బాశ్చాత్యచాళుక్యులతో యుద్ధముచేసి రణరంగమున నిహతుఁడయ్యెను. తత్పూర్వము రాజ్యపదభ్రష్టుఁడై యజ్ఞాతవాసమునేసి మరల లబ్ధరాజ్యుఁడై కొంతకాలము రాజ్యమేలెను. ఇతనిగురువును గృతికర్తయునగు మల్లికార్జునఋషి ద్రవిడమండలమున శైవసమయాచార్యత్రయములో మేలిమిగన్న మాణిక్యవాచకునితో వాదించినట్లు తెలియుచున్నది. ఈకవిశిఖామణిని గుఱించి యెక్కుడుగా రెండవభాగము పీఠికలో విస్తారము వ్రాయఁదలంచియున్నాను. ఇతఁడు కళావిలాసమను మఱియొక్క కావ్యమును గూడరచించెను. అది నాకు లభింపకున్నను దానిలోని పద్యములు కవిసంజీవని, రత్నాకరము, అథర్వణచ్ఛందము, గణపవరపు వేంకటకవి లక్షణశిరోమణిలో నుదాహరింపఁబడినవి. ఆపద్యములలోఁ గొన్నిటి నిందుదాహరించినయెడల సుముఖులెవ్వరైనఁ దద్గ్రంథమును వెదకి దానినష్టమగు కారణమువలనఁ దప్పింతురను నాసగలుగుచున్నది.

సీ॥ పృథుల విశ్వంభరారథమున కెదురుగాఁ బూన్పించె నెవ్వాఁడు పువ్వుఁదేరు
కాంచనాచల కార్ముకమునకు సాటిగాఁ జేపట్టె నెవ్వాఁడు చెఱకు విల్లు
నసిరళపాశుపతాస్త్రమ్మునకు వాఁడి మిగిలించె నెవ్వాఁడు చిగురుఁదూపు
నతులితామర దానవాదిబలంబుల గెలిపించె నెవ్వాఁ డళ్యాళిబలంబు
నట్టిజగజెట్టిమన్మథుం డఖిలలోకములకు వెఱఁగొంగ జీవుల మూలకండ
యుతసియిలుఁ జొచ్చి వెడలనియతఁడు గలడె। యతనియమ్ముఁ బడనున్న యదియుఁ [గలదె.

క॥ తలపోయఁగ రుచులయును। గలుగును వాతంబుఁ గ్రిమియుఁ గఫమున్ జెడు నా
కలిపుట్టు దగయుఁ జెడుఁద। మ్ములము పదార్థంబు రాగమూలము ధరణిన్

చ॥ తొడపులు వెట్టు సంభ్రమముతోఁ దిలకించు మడుంగుగట్టు పైఁ
బడఁదడవోప దింపెఱిఁగి పట్టుదు నేర్పులు గట్టిపెట్టుఁ బ
ల్కెడు నెడఁ దొట్రుపాటొదవుఁ గింకకుఁ జేగిలుమన్ సమర్పఁగా సి
జిడుముడిఁ బొందుఁ గాంత పతిచేరిన గూరిమిగల్గినేని యున్

చ॥ లలనలు కొండదాత్మపతులం దగఁ గూడినచెయ్వులన్నియుం
దలఁచి సఖీజనంబులకుఁ దప్పక చెప్పెదు వారు పుణ్యజీ
వులు చెలి యామినీశుని కవుంగిలిడాయుకొ కాక తాన్నికే
లాలఁగిన లీలగిరు నటనోపవు నాదు రతిప్రయోగముల్.

క్షేమేంద్రుఁడను నొకానొక కశ్మీరమహాకవి కలావిలాస మని సంస్కృతము నొకగ్రంథము వ్రాసియున్నాఁడు. తెనుఁగుపద్యముల నన్నియుఁ గూర్చి పోల్చిచూడగా నద్దాని కిది తెనుఁగుగాదనియు నిందుఁ గథాభాగముకూడఁ గలదనియు సంస్కృ మున దానిలోఁ గథాంశములులేకుండుటయు జూడఁగా రెంటికిని నామమాత్రసాదశ్యము గలదని తేలినది.

ఈకుమారసంభవము కాళిదాసుకావ్యమునకుఁ దెనుఁగుగాదు. ఇందుఁ బేర్కొనబడిన సంస్కృతకవులలో నుద్భటుఁడనువాఁడు భావగర్భమునుగల కుమారసంభవ మను కృతివిరచించినట్లు కవి చెప్పుచున్నాఁడు. కాశ్మీరకవులలో జయాపీడ సంస్థానవిద్యాపతియగు నుద్భటుఁడొకఁడు క్రీ - శ. ౮౦౦ లో కావ్యాలంకారసారసంగ్రహము రచించి దానిలోఁ దన కుమారసంభవ కావ్యములోనుండి శ్లోకము లుదాహరించుకొనెను. కావున నాయుద్భటుని కుమారసంభవమే నన్నెచోడుఁడు చూచెనని యేర్పడచున్నది. ఆగ్రంథమిప్పుడు లభించునదికాదు. దానిలోని శ్లోకముల నుద్భటుఁడు తనయలంకారగ్రంథమునందును, ప్రతీహారేందు రాజనువ్యాఖ్యాతయు, కావ్యప్రకాశమున సంకేతమను వ్యాఖ్యానమునందు మాణిక్యచంద్రుఁడను కవియు, వల్లభదేవుఁడును, ఉదాహరించియున్నారు. అయ్యుదాహృత పద్యములన్నియుఁ బోల్చిచూడఁగాఁ దెనుఁగు కుమారసంభవ ముద్భటుని కావ్యమునకు దెనుఁగుగాదని యేర్పడుచున్నది. మఱియ నాశ్లోకములను బట్టి చూడఁగా నుద్భటుఁడు శబ్దచిత్రములయందును నప్రస్తుత శ్లేషలయందును బ్రీతి గలవాఁడని తోఁచుచున్నది. కొన్నిశ్లోకముల నుదాహరించినఁ జదువువారు రెండుకావ్యములలో భేదమును గుర్తెఱుంగుదు రని చూపుచున్నాను. "విరళాసగృహా లోకే శీలసౌందర్యసంపద: నిశా: కియత్యోవశ్లేషి యాస్విందు: పూర్ణమండల: "సాగౌరీశిఖరంగత్వా దదర్శోమాం తపఃకృశాం, రాహుపీత ప్రభస్యేందో ర్జయంతీం దూరత స్తనుం" "యా శైశవే శ్రీ స్తపసా మా సేనైకేన విశ్రుతా। తపసా తాం సుదీర్ఘేణ దూరాద్విదధతీ మన:", "దంతప్రభాసుమనసం పాణిపల్లవశోభినీం తన్వీంవనగతాం లీనాం జటాషట్పదకావలీం", "స్వయంచపల్లవాతామ్రభాస్వత్కరవిరాజినీ। ప్రభాతసంధ్యేవాస్వాప ఫలలుబ్ధేహితప్రదా, ఇందుకాంతముఖీ స్నిగ్ధమహానీలశిరోరుహా। ముక్తాశ్రీ స్త్రీజగద్రత్నం పద్మరాగాంఘ్రిపల్లవా। అపారిజాతవార్తాపి నందనశ్రీర్భువిస్థితా అబిందు సుందరీ నిత్యం గలల్లావణ్యబిందుకా" ఇత్యాదులు చూడఁగా, యాతా స్తైరససారసంగ్రహవిధిం నిష్పీడ్య నిష్పీడ్య యే। వాక్తత్త్వేక్షులతాం పురాకతిపయే తత్త్వస్పృశో స్పద్రిరే। జాయంతేద్య యథాయథం కవయ స్తే తత్ర సంతన్వతే। యే౽న్యప్రాసకతో ప్రియమకి శ్లేష [illegible]" అనుమంతికునిశ్లోకము స్మరణకు వచ్చుచున్నది

ఈకథనితఁడించుకమార్చియున్నాఁడు. సంస్కృతకుమారసంభవ కథలలో లేని గణపతి జననమును పార్వతీ దాక్షాయణులు కైలాసవనభూముల స్వేచ్ఛగా విహరించు గజయూథములఁ జూచి యపూర్వరతిదత్తచిత్తులై గజరూపములు దాల్చి క్రీడింపఁగా గణేశ్వరుఁ డుద్భవించెననియు, రెండవది, శరవణమను సరస్సున సప్తర్షులభార్యలు జలక్రీడసేయుచుండ నగ్నిహోత్రుఁడు మోహించి వారలసమీపింప వారిలో నరుంధతి తొలఁగినం దక్కినయార్గురును నగ్నిఁబురుషునిగా గ్రహింపక శీతాపనోదనార్థము నిరంబరలై సమీపింప నగ్ని వారిం గౌఁగిలించి తానుధరించియుండిన శంభువీర్యభారమును దొలంగించుకొనెను వారలు సద్యోగర్భంబువడసిజడిసి గర్భపిండముల వెలార్చి కమలపత్రంబున నిడి యిండ్లకు మగిడి పతిశాపతప్తలయ్యుఁ బరమేశ్వర వీర్యధారణ ప్రభావంబున జ్యోతిర్లోకము నొందినట్లును మార్పులు కల్పించియున్నాఁడు. ఈమార్పులీకవి చేసినవనియేయూహించెదను. ఎట్లైన నివి మనోరమములే. దీనిలో ౧౨ ఆశ్వాసములలో ౨౧౦౦ పద్యములుగలవు. ముద్రితగ్రంథములలో లేని యపూర్వపదము లీకావ్యములోఁ గుప్పలుగానున్నందున వానిసవరించి లేఖకదోషముల గుర్తెఱిఁగి సంస్కరించుటకు నవకాశము నాకుఁజాలమింజేసియు, నామిత్రులుపలువు రీకృతిలోఁ గొంతభాగమైన ప్రకటింప నన్నుఁబురికొల్పుట వలనను, ఇటీవల నాకు లభించిన కొన్ని పూర్వకావ్యములు చక్కగా శోధించి ప్రాచీన పదసంగ్రహముచేసికొని దీనిముద్రించిన స్ఖాలిత్యములు మెండుగా నుండవనియు, పరదేశమునందు గ్రంథసామగ్రి చాలక యానుకూల్యములేక యస్వతంత్రజీవనమున నక్కతావకాశత్వమునను దీనిఁబూర్వభాగముగా నేడాశ్వాసములు ౧౦౦౦ పద్యములు మాత్రమేయిందుఁ బ్రచురించుచున్నాఁడను. ఈకృతి నన్నయభట్టుకంటె నూఱేండ్లు పూర్వముదైనను ౧౦౦౦ సంవత్సరములుగా నెవ్వరును గుర్తెఱుఁగక యుండఁదటస్థింపదనియు దీనిని నేనో మఱి యెవ్వరో రచించి గ్రంథప్రాశస్త్యమునకై ప్రాచీనుల పేరవ్యవహరింపఁబడెననియు గ్రంథమును బ్రచురింపక మునుపే యొకవార్తపుట్టినది. ఇట్టివార్తను ఖండింపకున్న మహాపాపము. నాయట్టివాని కిట్టికావ్యమును వ్రాయసామర్థ్యములేదనుట తెల్లమనుట గాక నాచనసోమునికిఁ దరువాత నిట్టికవితగూర్చువాఁడే యాంధ్రదేశమునఁ బుట్టినవాఁడుకాఁడు. అధునాతన కవులలో నిట్టివాఁడు గల్గిన వాఁడు నిర్లజ్జుఁడై తననామగోపనము సేయు హేతువు గానరాదు. ఈకవి ప్రఖ్యాతుఁడు కాకపోవుటకుఁ గారణము:—

బహుళ్లో సామాన్య మతిత్వేన తేషాంపరిగ్రహో లోకే, కామంగతా ప్రసిద్ధిం సామాన్య కవయః అతఏవ" అనియూహింపవలయును. అయినను గుమారసంభవములోని పద్యము లథర్వణచ్ఛందము పెద్దన లక్షణసారసంగ్రహము, కవిసంజీవని, రత్నాకరము, లక్షణశిరోమణి, వీనిలో నుదాహరింపఁబడినవి. అథర్వణుఁడు:—

క ॥ మగణమ్ముఁగదియ రగణము । వగవక కృతిమొదటనిలుపువానికిమరణం
బగునిక్కమంద్రుఁడు మడియఁడె । యగునని యిడితొల్లి వేంకటాదిత్యుఁడనిః" యన
యును బూర్ణబిందుప్రాసముక్రింద పద్యమును నుదాహరించెను. కవిసంజీవనిలో నైక
పళులక్రింద, స్మరతత్త్వసారము, కాశీశతకము, ముద్రారాక్షసము, భారతానుశాసనికము
వీనిలోని పద్యములుదాహరించి, "నన్నెచోళునికుమారసంభవములోని" ఆయతవతిను
సప్తోపాయముల నెఱుంగవలయుఁ బ్రతిసామము భేదాయతి దానముదండము। మాయో
పేక్షేంద్రజాలమంత్రము లోలిః" అనియుమఱియు "పూనిరహస్యంబాడెడుఁ దాసి
నిగివానిరీక్ష్యవక్తవ్యంరాత్రౌ నైవచ నైవచ యను మానితహితభాషణంబు మతినిలుప
దగుః" అనియిచ్చియున్నాఁడు. వీనిలోఁ జై పద్యము ౧౦వ యాశ్వాసముననున్నది
క్రిందిపద్యము దీనిలోలేదు. ఎచ్చటిదో యెఱుంగుటకును నలవిలేదు. పెద్దనలక్షణ సా
సంగ్రహములో ౬వ ఆశ్వాసమునుండియు రత్నాకరకర్త ౮వ యాశ్వాసమునుండియు
బద్యము లుదాహరించియున్నారు. ఇందఱు చూచిన కృతినేటికెట్లు క్రొత్తదగును ? అ
యట్లుండ, నమరేశ్వరుని విక్రమసేనము, చిన్నకోట పెద్దనప్రద్యుమ్నచరిత, తిక్కనసో
యాజివిజయసేనము, కవి భల్లటుని విక్రమార్కచరిత, కెమ్మన యనిరుద్ధచరిత్రమును ఎవ
రెఱుంగుదురు. కవిలోకబ్రహ్మయను బిరుదుతో శతాధిక కావ్యకర్తయగు పెద్దపా
సోమనాథకవి నెవ్వరెఱుంగుదురు ? అతనియరుణాచలపురాణములోనుండి యొక్క పద
ము కవిసంజీవనిలోనుండి తీసి కూచిమంచితిమ్మకవి యుదాహరించెను అతనికృతులలో
జ్ఞానదీపిక, అరుణాచల పురాణము, కేదారఖండము ప్రౌఢములైనవి. మఱియును నన్నెచ
ళునిఁ బూర్వకవులెఱుంగుదురాయను నంశమునుసూచించుటకై పోలికపద్యములుదాహ
రించితిని. వానిలోముఖ్యముగాఁ జక్కనకవియుం బింగళిసూరన, పూర్వకవి సూరన, తెన
లి రామలింగఁడు వీనిమొదలుగా భావచౌర్యమును జేసియున్నారు. పింగళి సూరన వీనిపద
మును, రామలింగఁడు ౮౧౦వ పద్యమును జదివియే తమపద్యములు గూర్చిరి. జక్కన పద్య
యమును జూడుఁడు.

సీ ॥ "దుగ్ధాంబుధిఁబుట్టెఁదోఁచెనోయని శేషుఁ బాన్పుగా హరినీటఁ బవ్వళింపఁ
సుధపసుధారస మబ్బెంగెనోయని దేవతల్ తనివోవఁ ద్రావఁదలఁపఁ
గాలఁ కాయమిన్నేఱు వెలివిరిసెనో యని లీల సురాంగన లోలలాడఁ
బాపరసంబబ్బెఁ బరఁగెనోయని సిద్ధనికరంబు కలశముల్ నించికొనఁగఁ
బాండురాంగుండు విశ్వరూపంబుదాల్చి । యొలసెనోయనిసద్భక్తు లెలమిఁగొలువ
నఖిలజీవులకానంద మలరయిల్ల । నచ్చవెన్నెలవిమలమైయలరెఁ గాసె" కుమా ౯౦౧
సీ ॥ గంగాప్రవాహంబు కాఁబోలునని వశిష్ఠుఁడు లనుష్ఠాన మాచరింప
నమృతాంబు వెల్లువయని నిరంతరామరులు మునుకొని దోసిళ్ళ ముంచిగ్రోల

దుగ్ధాంబునిధి యని తోయజాక్షుఁడు శేషపర్యంక మిడుకొని పవ్వళింపఁ
బరమేశువిశ్వరూపం బని బ్రహ్మాదు లమర దండ ప్రణామములు సేయఁ
దలఁపభూనభోంతరముల కొలఁది తెలిసి। బెరసిమ్రొక్కిది దిక్కులఁబొరలిపొరలి
దట్టుముగనంతకంతకుఁ దనరితనరి। యిట్టిలంబుగవెన్నెలనిట్టవొడిచె" జక్కనవిక్ర
మార్కచరిత్రము.

వేయేల, యితని కావ్యమును తిక్కన, కేతన, మంచన, నాచనసోముఁడు, అమరేశ్వరుఁడు, పిన్నలోటపెద్దన, సూరనలు, రామలింగఁడు, కొందఱులాక్షణికులును చదివిన్లు తెలియుచున్నది. ‹‹తఏవనిదవిన్యాసా స్తాఏవార్థ విభూతయః। తథాపినవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్'' అనువాక్యము కేతన సోమనాథాదులయందుఁగూడ వ్యక్తమగుచున్నది.

నన్నెచోడుని కుమారసంభవము నానావిధాలంకారములకును, నపూర్వవ్యాకరణ లక్షణములకును, కొన్నిశబ్దచిత్రములకును, భావ, వ్యంగ్య, ధ్వనులకును లక్ష్యము లిచ్చుట యందుఁ బ్రథమగణ్యముగానున్నది. ఈకవికిఁ బూర్వగు సంస్కృతమున నెందఱో మహాకవులున్నను గ్రంథచౌర్య మగపడదు. ‹‹మదమునసత్కవి కావ్యము। నదరకవిలుకాని పట్టినమ్మును జరహృతి। దమై తలయూపింపని యదికావ్యమెవాని పట్టినదియుం గరమే'' యనునదిమాత్రమే ‹‹ కింకవే స్తస్యకావ్యేన కింకాండేన ధనుష్మతః పరస్యహృదయేలగ్నం న ఘూర్ణయతి యచ్ఛిరః' యనుశ్లోకార్థమునుండి గ్రహింపఁబడినది. దీనిలోఁ గొన్ని యత్యాశ్చర్యజనకములగు భావములుగలవు. అట్టిపద్యము లీముద్రితభాగములోనే కొన్ని గలవు. వానికిఁజూడఁగా ‹‹తత్త్వసమగ్ర బహుశాస్త్రవిమర్శనిష్ఠైర్దగ్ధ్వై దిగ్ధమతయో బహవః కవంతాం, యత్కించిదస్తితుమహాకవి వాగ్రహస్యం స్వప్నే z పి తస్యకిల. తేన దిశం స్పృశంతి'' యనియు, ‹‹ఆసంసారం (సృష్టి) కవిపుంగవైః ప్రతిదివసగృహీతసారో z పి। అద్యాప్యభిన్నముద్ర ఇవ జయతి వాక్పరస్పందః'' అని మంకుకవాక్పతికవులు సూచించినవాక్యములు నిక్కములని తోచుచున్నది. మఱియునీకవి, ‹‹ఓలిననకడచననణు వది।నాలుగువిద్యలను నేర్పునై సగ్గికమై।వారెననుకవులకుంగా కేలతరమెక్కృతులు చెప్ప నెవ్వరికైనన్'' అనిచెప్పుకొన్నట్లు సర్వజ్ఞుఁడని చెప్పుటకుఁదగిన సూచనలుకావ్యములో నగపడుచున్నవి. ఆంధ్రకవులలో నిట్టివారు తిక్కన, నాచనసోముఁడు, ఎఱ్ఱాప్రెగ్గడయు మాత్రమే.

ఇతనికాలములో దీర్ఘము మీఁది యర్ధబిందువు పూర్ణబిందువుగానే వాడుచున్నట్లును కృష్ణదేవరాయల కాలముననే యదియర్థబిందు వయ్యెననియు నీకృతివలనఁ దేలుచున్నది. దీర్ఘములమీఁద నెఱసున్నలు సోముఁడు కూడఁబ్రయోగించియున్నాఁడు. చూడుఁడు: ఉ. ఎంచినప్రేమనీపదకమిమ్మని రుక్మిణి మున్ను వేఁడుడుం। పూంచినపూఁపు దక్కఁ బలుపోకలఁ బోవుచునుండుదేవుఁడున్ డాంచినసొమ్ము చేరెనకటామదిఁగోరని సత్యభా

మకుటా। సొంచినవారెసొమ్ము లవి నోముని వారికి వచ్చునేయుటా" ఘంటాకర్ణుఁడు నేన
నాయనుజుండీ కాలాంతకుండేను—ముక్కంటికా...జంటకా...వేంటంబోయింతిమేన'
అని. ఇందు, ఏచుశబ్దమున నరసున్న యీయర్థమున లేదు; వేటయనుటకు వెంటయ
రూపాంతరము స్థానాంతరమున నెచటలేదు. భీమకవి నృసింహపురాణమున, ‹‹వాండిమిన్న
సిద్ధి జనవల్లభుఁడోర్చిన రాజుభీకుఁడై। యాంధ్రనుగాన కుండ వృషభాంకము పెట్టి కొన
గఁ జూచితో। నేండిదియేమి నీవనుచు నెచ్చెలు లెల్ల హసింప నంతలో। మూండవకంటి
తోడి దొరమూర్తి వహించిన ముక్కిరంగనల్" అని చెప్పియున్నది కావున నే శ్రీనాథుని
వఱకును నర్థబిందుప్రాసమును పడనీయక ప్రయోగించిరి. నన్నయాదులు నిర్బిందువు నర్థ
బిందువునుగలపిరని యప్పకవ్యాదులు చూపిన ప్రయోగములన్నియు వారియల్పజ్ఞానమ
సూచించుచున్నది. అప్పకవియు, కూచిమంచి తిమ్మకవియు నుదాహరించిన పద్యము
లన్నియు లక్షణసారసంగ్రహ, కవిసంజీవని, కవిచింతామణి లక్షణశిరోమణులు—వీని
లోనేయున్నవి. చీకటి, వీపు, శబ్దములలో నరసున్నలేదు. ఉన్నట్లు ప్రామాణిక కవులలో
ప్రయోగములులేవు. కవిత్రయ, నాచనసోమ, నన్నెచోళ, కవిభల్లట, విన్నకోటపెద్దన్న
శ్రీనాథ కేతనలు, ప్రాససంకరము సేసినవారు కారు. చీకటిశబ్దమునకు భారత దశకుమారచ
రిత్రలలోని ప్రయోగములు చూపితిని. వీపుశబ్దమునకు నాదిపర్వములోని ప్రయోగముగా
‹‹వీపునన్నధి నొక్కపృథివీధరముఁ దగఁగాల్చెనంచులక్ష్మీపతి" అనినృసింహ - ఆ - ౪
౧౮౦లోను, ‹‹వీపునమోపెఁగచ్ఛపము వెండిభుజంగమరాజు మస్తకస్థాపితఁజేసె నీశ
వసుధారమణిం బెదకోమటీంద్ర బాహాపరిరంభగుంభ సముదంచితఁ జేయుటయింత యొప్పు
నే మోపరులే పెంపొంగుదురు ముగ్ధలతోడవిహారధన్యనుల్" అనియు నెఱ్ఱాప్రెగ్గ
ప్రయోగించియున్నాఁడు. తీగ, శబ్దములో నరసున్నలేదు. ‹డాగు' అనుటకు నెగయు
నునర్థమున నరసున్నలేదు. మూగుశబ్దమునకు రెండురూపములు ద్రవిడ కర్ణాట భాష
లలోఁ గూడఁగలవు. దాగుశబ్దము ప్రాచీననవీనరూపములు రెండు. ప్రాచీనరూపములో న
సున్నగలదు. ‹‹యాంగువాఱ్ఱు యిర్కళు మవ్వాయిరిడంగిలుం। దాంగు అమణ్ణిటీర్ పణ్
బుఱవగుత్తు" అని మణిమేఖల - ఆ - ౬. ౧౯౯. ఇందు ‹దాఁగు' అనఁబ్రకాశము
కావునఁ బై పదములనుంచుకొని యప్పకవి, ముద్దరాజురామన, కస్తూరిరంగకవి, గణప
రపు వేంకటకవి, తిమ్మకవి—వీర లుదాహరించిన సంకరప్రాసములు శోధించినయెడల వీ
పాండిత్యమే సంకరమనితోచును. ఆఁగు– ఇత్యాది గకారములమున్న అర్థబిందువ
గలదాలేదా యనునంశమును, ‹గ' కారము, ‹వ' కారమైనచో లేదు. గాకున్న నున్నట్లూ
హింపవలయు. మూగుశబ్దము మూవు అనురూపమును జెందుచున్నది. చూడుఁడు కుమా
సంభవములో ౪౬౧వ పద్యములో శబ్దాలంకారము. మఱియుశాసనములలో ‹నాండు
అనియే యున్నది. కావునఁబూర్వకాలమున దీర్ఘముమీఁద నెలనున్నయే వాడినట్ల

తోచుచున్నది. నాఁడుశబ్దమున 'ఆనాఁడు, నేఁడు, ఎన్నఁడు' అనునర్థమున మాత్రమే యథానుస్వారముగలదు. 'నాఁడు' దిన మనునప్పుడు లేదు. 'రెండవనాఁడు' అనునప్పుడులేదు. ద్రవిడభాషలో అంఱ్ఱి ఇంఱ్ఱి, ఏంఱ్ఱు, అనినాఁడు, నేఁడు, ఎన్నఁడు అనియు, రెండు నాళ్ అనిరెండునాడులు అనియువేఱువేఱు పదములుగలవు. కావున నుద్యోగ పర్వము లోఁ దిక్కనసంకరము చేసినవాఁడుకాఁడు. "క్రౌంచపద, సరసిజ, గర్భబంధ కవితల లక్షణములలోఁ దప్పులుసెప్పిన యప్పకవ్యాదుల లక్షణసూత్రములు ప్రామాణికములుగా గ్రహించుట దోషము. ఇప్పుడు ప్రాచీననవీన కావ్యములు చేతిలోనున్నవి. సుముఖులు చూడఁదగును. నన్నెచోళుఁడు, ఏనియనుశబ్దమును నేనియని నకారాదిగాఁ గూడఁ బ్రయోగించెను. కాఁబట్టి యే నన్నయభట్టు – న్నేని...దిగ్ధరణీరవీందులు, ఆది - ఆ - ఉ. అను నకారాదిగాఁ బ్రయోగించె. ఇది తెలియక లాక్షణికులు దుస్సంధియు, యతికి వైకల్పిక భావమును నన్నయ భట్టున కారోపించిరి. చోళుని శబ్దప్రయోగములు పరమప్రామాణికములై కవిత్రయ పెద్దన సోమన కేతనమంచనాదుల ప్రయోగములకు సరిపోవుచున్నది.

## ఉత్తరకథాప్రశంస.

అష్టమాశ్వాసమున: పార్వతీ వర్ణనమును, శివుని ప్రస్థానమును, పౌరస్త్రీ దర్శనమును, బ్రహ్మాదుల వర్ణనమును, సాయంకాల వర్ణనమును తమోవిజృంభణమును, చంద్రోదయ వర్ణనంబును, విటాభిసారికావర్ణనంబు లంజికాప్రసాధనంబును పాంచాలాంది విటవర్ణనంబును సూర్యోదయంబును వివాహయత్నంబును, నవమాశ్వాసమున, శివపార్వతీ ప్రసాధనంబును, వివాహంబును, ఉద్యానవన విహారంబును, జలక్రీడయును, కైలాస నిర్గమంబును రతిక్రీడావిహారంబును, దశమాశ్వాసమున నగ్ని దేవతలప్రేరణంబున వచ్చి శంభువీర్యతప్తుఁడగుటయు గంగ కొసంగుటయు, గంగాదేవి వల దనుటయు, శరవణ సరోవరంబు దఱియుటయు, సప్తర్షి పత్నీ దర్శనంబును, నరుంధతి పతిధ్యానము ధరించుటయు, తక్కిన యాఱ్వురు నిరంబరలై యగ్నిచే నాలింగిత లగుటయు, సద్యోగర్భము దాల్చుటయు, గర్భవిచ్ఛేదము నేసి కమలపత్రంబులం దిడి గృహాభిముఖులగుచు జని శప్తలై జ్యోతిర్లోకంబు సెందుట, కమలపత్రంబునఁ గుమారుండుదయించుటయు నారదాగమనంబును, ఇంద్రసందేశమును, ఐరావత కుమారయుద్ధంబును, ఇంద్ర ధావనంబును శివదర్శనంబును పార్వతీ వాత్సల్యంబును కుమారుని సేనాపతిత్వంబును, ఏకాదశాశ్వాసమున తారకునకు దూతం బుచ్చుటయుఁ బ్రాతి మాత్యంబును, యుద్ధ సన్నాహంబును వీరపత్నీ ప్రవాస దుఃఖంబును, దివసద్వయ యుద్ధంబును ద్వాదశాశ్వాసమున తృతీయదివస యుద్ధమును తారక మరణంబును దివ్యాంగనా శేషాక్షతా వర్ణనంబును గ్రంథకర్తృ కథోద్దేశమును వర్ణింపఁ బడినవి.

దీనిలో నాశ్వాసాద్యంతపద్యములలోఁ గృతిపతియగు మల్లికార్జునకును శివునకు నభేదము సేయఁబడినది. ఈమర్యాద కర్ణాటభాషలో పంప భారతములోను గదాయుద్ధమునందును గూడఁగలదు. గ్రంథాంతమునను "సరసాహారము రాగహేతువను టజ్ఞానంబు పారావతమ్మో, త్కరముల్ చిక్కనిరాలు మ్రింగి నుసదాకామాంధ్యులై యుండరే, సరిసాంద్రామిషభుక్తియైనను సకృత్సంభోగ మందుణ్మనో, హరసుజ్ఞానము కాక రాగరసమం దాహారనిర్వృత్తియే.

సీ॥ బుద్ధీంద్రియంబుల పొలఁతుక నాఁజాలు కర్మేంద్రియంబుల గర్వమడచి । విషయాలి నడపాడువీథికలనఁజాలు బుద్ధీంద్రియంబుల పొంకమడఁచి । యంతఃకరణతతినాట పట్టనఁజాలు విషయసమూహంబు వీకుదఱిచి । యాజవంజవమున కనుచారియై పర్వునంతఃకరణతతి నలవుమడిచి । సురుచిరస్థూలముల్ బాహ్యకరణసమితి । సూక్ష్మమంతఃకరణతఁ జూచ్చిచూడు । నాత్మనాత్మైకదృష్టి సర్వాత్ముఁ బరము । పరమశివుఁ గాంచుట పరమపదవిసుమ్ము" అనిచెప్పి.

సీ॥ జ్ఞానదీపంబు హృత్సదనంబులోఁ దాన దీపియగా నెంత దివురువారు । వలచేతవసుమతీవలయంబు నవరత్నవలయంబుగా నిడవలచువారు । భారతీదిమమోముఁ బసిఁడి మాడుపులోన నిలువేల్పుగా నిల్పఁ దలఁచువారు । నణిమాదిగుణమణిహారమ్ము లురమున హారమ్ముగా నిడఁగోరువారు । వెలయ మత్కృతిఁ జదువుఁడు వినుఁడు వ్రాయుఁడీశ్వరాంబికాగుహ లిత్తురీప్సితములు । వారినే మెయిఁ గొనియాడువారుకోర్కు । లానర జంగమ మల్లికార్జునుఁడు నొసఁగు" అనియు వ్రాసియున్నాఁడు.

దీనికంటెను మనోహరమైన కావ్యము పెద్దనప్రద్యుమ్నచరిత్రము, చిమ్మపూఁడియమరేశ్వరుని విక్రమసేనము నాచనసోముని కవిత కీడుగాదు. పెమ్మనయనిరుద్ధచరిత్రము భావగాంభీర్యము పదపుష్టియుఁగలదై యతిరమ్యముగానున్నది. ఈమూఁటిలో భాగములు మాత్రమే లభించినందున నాంధ్రభాషాభిమానులెవ్వరేని నాకుఁదత్కావ్యములఁబంపిన వానినుద్ధరించి మాసిపోవుచున్న తత్కవుల కీర్తిచంద్రిక యుల్లసిల్లునట్లు చేసెదను.

ఈగ్రంథమును సంపాదించి ప్రచురించుటకై నాచేసిన దేహధనవ్యయములును మిక్కిలియయ్యె. కార్యాంతరప్రసక్తుఁడ నగు నాకు నవకాశము లేమిం జేసి గ్రంథశోధనము చక్కఁగాఁ జేయక కొన్ని ప్రమాదములు పడిచితిని. ప్రాచీనపదములలోఁ గూడ నెక్కువ జ్ఞానములేమిచేఁ గొన్నియెడలు సందిగ్ధములుగా నుంచితిని. పాండిత్యము చాలక యిట్టిపనికిఁ బూనినందునను నన్ను నిందింపక నాసదుద్దేశమును మాత్రమే గ్రహించి నాయందు మిత్రభావము ప్రకటింతురని యీకృతిఁ జదువు వారనెల్లరను మిక్కిలి విధేయతతోఁ బ్రార్థించుచున్నాఁడను.

వనపర్తి—
సంబరు ౨౦ తేది - ౧౯౦౮

మా - రామకృష్ణకవి.

శ్రీ ర స్తు

# కుమారసంభవము.

—————: (౦) :—————

## ప్రథమాశ్వాసము.

శ్రీవాణీంద్రామరేంద్రార్చితమకుటమణిశ్రేణిధామాంఘ్రిపద్మా
జీవోద్యత్కేసరుం డాశ్రితజనలసితాశేషవస్తుప్రభుం డా
దేవాధీశుండు నిత్యోదితుఁ డజుఁడు మహాదేవుఁ డాద్యుండు విశ్వా
కారాత్ముం డెప్పుడున్ మా కభిమతములు ప్రీతాత్ముఁడై యిచ్చుఁగాతన్.

సీ ॥ రమణీయశృంగారరజతపర్వతము నా శోభిల్లు సిద్ధవిస్ఫూర్తిమూర్తి
ఆపర్వతాగ్రహేమైకశృంగంబు నా నమరు జటామకుటాదిభాతి
ఆతుంగశృంగశిలాపూర్ణసరసి నాఁ బొంగారు జాహ్నవిభూరివారి
ఆనిమ్నసరసివిహారమరాళికాపఙ్క్తి నా నొప్పు కపాలలీల
యామహామరాళికాబద్ధాంభోజపుష్పనిభసముద్ధభోగభోగి
సమితిఁ దాల్చి పొల్చుశంకరుఁ డంబికాధవుఁ డిదు మా కభీష్టదాతగాత. ౨

చ ॥ హరివికచామలాంబుజసహస్రము పూన్చి మృగాంకుదండ వి
స్ఫురితమలాసితాబ్జ మని పుచ్చుఁగఁ జాఁచినచేయి చూచి చం
దురుఁ డది రాహుసావి నెఱద్రుప్పలఁదూలఁగఁ జారుచున్న న
య్యురువురఁ జూచి నవ్వుపరమేశ్వరుఁ డీవుత మా కభీష్టముల్.

ఉ ॥ వీఁగునపారసత్త్వగుణవిస్ఫురణం బరమేశ్వరోరువా
మాంగమునందు మున్నుదయమై నియమస్థితిఁ గొల్చి తద్దయుత్థిస
లోంగినపేర్మితో నఖిలలోకములుం దగఁ గాఁచుచున్న వే
దాంగు ననంతు విష్ణుఁ గమలాధిపు సంస్తుతిఁ జేల్మి సన్మతిన్.

---

3. సావి = అనెడుభ్రమతో, సావి, సవియొక్కరూపాంతరము. "శాటి కల్ సవితదావాసంబు జేర్పంగ రేవుల డిగ్గన్." ఆముక్తమాల్యద. ఆ - ౧. మే మిందుఁబ్రయోగములుచూపునపుడు ముద్రితగ్రంథములనుండి పద్యభాగములను, అము ద్రితగ్రంథములనుండి పూర్ణపద్యముల నుదాహరించెదము. ఆంధ్రభాషయందుముద్రి తాముద్రిత ప్రబంధములలో లేనిపదములకు ద్రవిళకర్ణాట భాషాకావ్యములలో మాకులభించినంతవట్టు గూర్చెదము. విజ్ఞులుక్షమింతురుగాక.

చ॥ అమితరజోగుణస్ఫురణ నావహమై పరమేశుదక్షిణాం
గమున జనించి భక్తిఁ జిరకాలము సద్విధిఁ గొల్చి తత్ప్రసా
దమున నజాండలోకజనితత్త్వనువేదకళాగమాదివి
శ్వము సృజియించి పొల్చునజు వాగ్విభు సంస్తుతిచేసి సన్మతిన్. ౫

చ॥ అనుపమదివ్యమూర్తి యనునంతియ కాదు భవాష్టమూర్తులం
దును వరమూర్తి దాన ప్రభతోడ జగజ్జనరాజి కెల్ల నిం
దనయము దానదృష్టి యనునంతియ కాదు త్రిలోచనాదిలో
చనములుదానయైనరవి చారునిజప్రభ మాకు నీవుతన్. ౬

చ॥ తను వసితాంబుదంబు సితదంతయుగం బచిరాంశులా త్తగ
ర్జన మురుభర్జనంబు గరసద్రుచి శక్రశరాసనంబునై
చన మదవారివృష్టి హితసస్యసమృద్ధిగ నభ్రవేల నాఁ
జనుగణనాథుఁ గొల్తు ననిశంబు నభీష్టఫలప్రదాతగాన్. ౭

క॥ తనజనకుఁ డూర్ధ్వస్థాణువు। జనని యపర్ణాఖ్య దా విశాఖుం డనఁగాఁ
దనరియు నభిమతఫలముల। జనులకు దయ నొసఁగుచుండు షణ్ముఖుఁ గొలుతున్

క॥ హరుఁ డాదిగ సకలచరా। చరమయజీవాళి నెల్ల సతతము గ్రామా
తురులుగ వలగతిఁ జేసిన। మరుఁ డీవుత మఖిలవశ్యమతి మత్కృతికిన్. ౯

చ॥ మునిమనుజాసురాహిసురముఖ్యులుమున్నగ సర్వజీవులం
దనవశ మద్ధిఁ జేసి మునుదర్పకు నోర్చినవీతరాగిఁ జి
ద్ఘనతను నీశు నాత్మశుభగస్థితి మైమెయి నర్ధనారిఁ జే
సిననగజాత మత్కృతిని జేకొని తత్సుభగత్వ మీవుతన్. ౧౦

క॥ వేదాగమరూపమున మ। హాదేవునపారగుణమహాస్తుతిసం
పాదిత యగుభారతి నేఁ। డాదిగ మత్కృతికి నెలయునది గాక దయన్. ౧౧

గీ॥ అన్యదైవతతి నర్చించుకొలుపు తా। డిది ఫలంబుగొనుట పడయఁగ నెడి
సద్వరిష్ఠఫలదు జంగమమల్లికా। ర్జునుని గొలుపు మొసరుమునుఁగఁగొనుట. ౧౨

---

౯. వల్గతి = ~~అనురాగపూరితితో~~

౧౨. మొసరుమునుఁగఁగొనుట = మకరందములోడ సంపూర్ణముగా నందుకొనుట యనితోఁచుచున్నది.

వ॥ అని సద్భక్తియుక్తి నిశ్చయించి. ౧౩

క॥ శ్రీపీఠంబున నిడుకొన। శ్రీపాదుకలందు వ్రాలి సేవించెద నేఁ
బాపహారిఁ జెప్పి పుణ్యుం। బ్రాపాదింపంగ మల్లికార్జునదేవున్ ౧౪

మ॥ అమలజ్ఞానసుదీపవర్తి గొని వృద్ధాచారుఁడై వేదశా
స్త్రియులం దున్న సదర్థ సొల్లఁగొని విద్వత్ప్రీతి గావించువా
ని మహాత్ముం డనఁ బొల్చుపుణ్యనిధి వాణీముఖ్యు సర్వజ్ఞు జం
గమలింగం బగుమల్లికార్జును సదాకల్యాణుఁ గీర్తించెదన్. ౧౫

వ॥ అని యిష్టదేవతానమస్కారమ్ముచేసి సమస్తదేవతాస్వరూపం బైనమదీయగురు
చరణారవిందంబు లభినందించి. ౧౬

క॥ కవితామృతోదయాంబుధి। కవిసజ్జనకునకు వస్తుకావ్యాబ్జరవిన్
గవితారంభంబుల స। త్కవు లభినందింతు రాదికవి వాల్మీకున్. ౧౭

క॥ వేదాంతభారతపురా। ణాదులు సేయుఁ డొకపేర్మి యనుచుం బొగడంగ
గా దగ్గ నజుఁడు నోపని। వేదము లేర్పఱిచె నంద్రు వేదవ్యాసున్. ౧౮

క॥ భాసురమతి వాల్మీకి। వ్యాసాదులు చనిన జగతి వరకవితాసిం
హాసన మెక్కి కవీంద్రుల। దాసులఁగా నేలెఁ గాళిదాసుఁడు పేర్మిన్. ౧౯

క॥ భారవియు వస్తుకవితను। భారవియును బరఁగి రుదయపర్వతశిఖరా
గ్రారోహణేంద్రకీలన। గారోహణవర్ణనల జనారాధితులై. ౨౦

క॥ క్రమమున నుద్భటుఁడు గవి। త్వము మెఱయఁ గుమారసంభవము సాలంకా
రము గూఢవస్తుమయకా। వ్యముగా హరులీల చెప్పి హరు మెచ్చించెన్. ౨౧

క॥ కరములు దునుమం బరముని। వరదుని గాఁ గొలిచి కవితవలననె మగుడం
గరములు వడసి జగంబునఁ। బరఁగె మహాకవియనంగ బాణుఁడు పేర్మిన్. ౨౨

---

౨౨. పరముని = శివుని. కరములు = చేతులు, కానుకలు. పరమశబ్దమునకు:—"పరముఁడు కంధరస్థలము పైనిడి వేడుక ముద్దులాడఁగాఁ। గరమున మాలిగంగ యుదకంబులు మెల్పనబీల్చియావిశ। కరములుభూషణేందునకు గౌరవతారకలీలఁజేయుత। త్కరివదనుండుమత్కృతికిఁదానుముఖస్థితితోడఁదోడగున్." అనియుమరేశ్వరుని విక్రమసేనము.

క॥ మును మార్గకవిత లోకం। బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమున। జన సత్యాశ్రయునితొట్టి చాళుక్యనృపుల్. ౨౩

చ॥ సురవరులం గ్రమంబున వచోమణిసంహతిఁ బూజచేసి మ
ద్గురుచరణారవిందములకుం దగ సన్నుతిఁ జేసి కొల్చి వి
స్తరమతులం బురాణకవిసంఘము నుత్తమమార్గసత్కవీ
శ్వరులను దేశిసత్కవుల సంస్తుతిఁ జేసి మనోముదంబునన్. ౨౪

వ॥ మఱియును. ౨౫

క॥ గుఱు తెఱిఁగి వస్తుచయమున। కొఱఁగెడునాదెసకు వర్తియనుబోలె నిజ
మ్మెఱిఁగి కృతవస్తుసమితికి। వఱలఁగ మది నెఱుఁగువిబుధవర్గము దలఁతున్. ౨౬

వ॥ మఱియు దోషగ్రాహు లగుకుకవివరాకులం బరిహరించితి నెట్లనిన. ౨౭

క॥ మార్గకు మార్గము దేశియు। మార్గము వదలంగఁ దమకు మదివదలక దు
ర్మార్గపదవర్తు లనఁ దగు। మార్గవులం దలచ నల్లఁతి మహీసుకవులకున్. [సేయ

గీ॥ ఘనసి గుణమైన దోషంబు సేయనేర్చు। కుకవి కృతులందు దోసంబు గుణము
నేరఁ డదియెట్లు దొంతులు నేతి నాయి। దోర్పనేర్చుగా కదియేమి సేర్పనేర్చు. ()

గీ॥ నెఱయ రసవంత మగుకతి కెఱఁగనేర। రల్పరసకృతి కెఱఁగుదు రలుల కెల్లఁ
చెఱకువిడిచిన రసమున కెఱఁగిరాక। పిప్పి కరిగెడునీఁగలపెల్లు వోలె. ౩౦

వ॥ కావున, ౩౧

గీ॥ తజ్ఞునం దేరనగుఁగవితావిశేష। మజ్ఞునం దేమి యెఱుఁగంగ నగు సమస్త
కనకవర్ణోత్కరమ్మును గానవచ్చు। వన్నె లెఱుఁగంగఁ బోలునే వట్టిరాత. ౩౨

వ॥ అది యెట్లనిన. ౩౩

గీ॥ అన్యతారకవితతుల నాదరించి। వెలయ సత్కవిబుధగురుబలము వడసి
యొనర దైవజ్ఞునట్ల శుభోదయమున। దివ్యసుకృతి ప్రతిష్ఠించుఁ దిరముగాఁగ.

---

౨౩. మార్గకవిత =
డాంధ్రకర్ణాటాదికవిత.

౨౯. నాయి = కుక్క

చ॥ సరళముగాఁగ భావములు జానుఁదెనుంగున నింపుసొంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వరసంబునఁ గందళింప న
తురములు సూక్తు లార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్. ౩౫

సీ॥ మృదురీతి సూక్తు లింపొదవింప మేలిమి భావమ్ము నెలమి క్రీడావహముగ
మెఱుఁగుల గన్నులు మిఱుమిట్లుపోవంగఁ గాంతి సుధాసూతికాంతి జెనయ
వర్ణన లెల్లచో వర్ణన కెక్కంగ రసములు దలుకొత్తి రాలువాఱ
దేశిమార్గంబుల దేశీయములుగా నలంకారములఁ దా నలంకరింప
నాదరించి విని సదర్థాతిశయముల। బుధులు నెమ్మనమున నిధులు నిలుప
వలవదే (రచింప) వరకవీశ్వరునకు। నూత్నరుచిరకావ్యరత్నవీథి. ౩౬

చ॥ పరఁగ సువర్ణబంధమృదుభావము గగ్గియు లోను చూడఁగాఁ
బొర పగుచిత్రరూపమును బోరె నసత్కవికావ్య మిమ్మహిన్
బరఁగు సువర్ణబంధమృదుభావవిశేషము లొప్పదెల్వులన్
సరియగు రత్నపుత్రికయు సత్కవికావ్యము నొక్కరూపమై. ౩౭

అక్కజమై మహార్థనివహంబు సదుక్తులు పెచ్చఁ జూచినం
గ్రుక్కిద మైనసత్కృతి యగుర్వగుఁగా కిలఁ జీకు లావుకం
ద్రొక్కినయట్లు నోర్దఁగాలఁదుల్ పురికొల్పఁగ నందులోన నొ
క్కొక్కఁడు సక్కనైనఁ గృతియుం గృతి యందురె హాని పెత్తురే. ౩౮

---

౩౫. ఒత్తగిల్ల = ఊఁదియుండఁగా.

౩౬. కృతులకునురత్నములకునుశ్లేష.

౩౭. పొరపు = బోఱయైన. తెల్వులన్ = నీరులచే, చవులచే.

౩౮. అగుర్వు=పరులకుభయముకలిగించుపెంపు. ఈపదము ద్రవిడభాషలో "అగుర్వు" అనియు, కన్నడమున 'అగుర్వు' అనియువాడఁబడును:

"ముగిలం ముట్టిదపెంపు పెంపనొళకొం డుద్యోగ ముద్యోగదొళ్
నెగళ్దాజ్ఞాబల మాజ్ఞెయొ ళ్తొడర్దగు ర్వ్వొందొం దగుర్వ్విం దగు
ర్వ్వగొ ళుత్తి ర్పరిమండలం." విక్రమార్జునవిజయము. అ ౧

క॥ చతురోక్తుల నుతపదయుగ। గతుల నలంకారభావకాంతిరసాఢ్యో
న్నతిఁ గృతి సతిరసికులు వర। సతిగతి సేవింపఁగలది సౌభాగ్యమునన్. 3౯

మ॥ పదబంధంబుల నగ్గలించి బుధశబ్దబ్రహ్మభావజ్ఞులై సద్గణా
స్పదమై దుష్కవిహృత్సరోజవనముల్ భంజింపుచున్ భూరిస
మ్మదలీలన్ విలసిల్లి సత్కృతి జగన్మాన్యప్రభావంబునన్
మదనాగంబునుఁబోలె ద్రాఘిమలవలదా మా కెందు లేకున్నతిన్. ౪౦

క॥ ముదమున సత్కవికావ్యము। నదనఁగ విలుకానిపట్టినమ్మును బరహృ
ద్భిదమై తలయూఁచింపని। యది కావ్యమె మలరిపట్టి నదియుం గరమే. ౪౧

క॥ ఓలిన కడచన నరువది। నాలుగువిద్యలను నేర్పు నైసర్గికమై
వాలినసుకవులతుం గా। కేలతరమె కృతులు చెప్ప నెవ్వరికైనన్. ౪౨

వ॥ అది యెట్లనిన. ౪3

క॥ వనజలకేళివిశాల। తనయోదయమంత్రకేళితత్త్వతిథిఋతు శాం
బునిధిమధురతుపురోద్వా। హానగవిరహాద్యుత్యవర్ణనాష్టాదశముల్. ౪౪

వ॥ పరిపూర్ణంబై దశప్రాణంబుల సప్రాణంబై నవరసభావభరితంబై షట్త్రింశదలం
కారాలంకృతంబై రమణీయంబై నదివ్యకథారంభంబున కభిముఖుండనై. ౪౫

ఉ॥ పూని మహోగ్రవీరపురపుత్రసమున్నతిదేవతాలయో
ద్యానతటాకసత్కృతినిధానము లాశశితారకంబు సు
స్థానములై మహిం బరఁగు జంగమమల్లయ పేర సత్తసం
తానము లొప్ప నల్పుదు ముదంబునఁ దత్ప్రభునాజ్ఞ పెంపునన్. ౪౬

వ॥ అందు నుత్కృష్టసంతానంబు కృతియకా నిశ్చయించి. ౪౭

ఉ॥ జంగమమల్లికార్జునుని సర్గకవి స్తవనీయసూక్తియు
క్తిం గొనియాడి సత్కవిత గేనము లే కనురక్తనైనభా
షాంగనదక్కనేలినమహత్త్వము లోకమునం బ్రసిద్ధిగా
భంగిగ విస్తరించెదఁ బ్రబంధము సద్రసబంధురంబుగాన్. ౪౮

3౯. కృతికిని సతికిని శ్లేష.
౪౦. కృతికిని మత్తగజమునకును శ్లేష.
౪౮. కేనము = పట్టి పెద్గాంభీర్యము. Cf. 415

# ప్రథమాశ్వాసము.

సీ॥ శరధినీరము పశ్చిమోర్వికిం గొనివచ్చి యవని నాదిత్యుండు చెలువుమీఱ
చేనఁ బండినవిత్తు చేసిన ఫలకాంతు లేత్రి యగ్రమ్ము వెదవెట్టినట్లు
రోహిణాచలపతి యూహించి వరరత్న సంచయంబున విభూషించినట్లు
తీర్థాళి కర్థిఁ దత్తీర్థోదకంబుల సెసకంబుగాన ర్ఘ్య మిచ్చినట్లు
నింగి ముట్టి యున్న జంగమమల్లయ। వరయునందుఁ గనినవస్త్రకవిత
దగిలి వారియంద సెగడింతు లవికి దీ। పవన వర్ప లిచ్చుపగిదివోలె. ౪౯

చ॥ గురువున కిష్టదైవమునకుం బతికిం గృతిచెప్పి పుణ్యముల్
వరమున దేజముం బడయవచ్చు జగంబుల నిశ్చయంబు మ
ద్గురువును నిష్టదైవమును సూర్యునిజేశుఁడు దాన నాకుఁగా
కొరుసకు నిట్లు సేకులుచె యొక్కట లాభము లెన్ని యున్నియున్. ౫౦

వ॥ అని యిట్లు మహోత్సాహంబున దివ్యకల్పంబు కల్పించు మహాకవి
ముఖ్యుండు. ౫౧

సీ॥ కుతలంబు నడుఁకొనఁ గొలకొండగా నిల్పి శరనిధి గ్రొచ్చిరి సగరసుతులు
మిన్నులపైఁ బాఱు చున్నయే ఱుఁ దెచ్చి వారాశి నించె భగీరథుండు
గోత్రాచలము లెత్తికొనివచ్చి కడచన్న రత్నాకరము గట్టె రాఘవుండు
జలధిమహీసతి మొలనూలుగాఁ జుట్టి పాలించెఁ గరికరికాలచోడు
వరుస నిట్లు సూర్యవంశాధిపతు లంబు। నిధియ మేరగాఁగ నిఖిలజగము
నేలి చనినవారి కెనవచ్చు సుశ్లాఘ్యు। ధన్యుఁడ నన్నెచోడజనవిభుండు. ౫౨

ఉ॥ అరినరపాలమౌళిదళితాంఘ్రియుగుం డుగ్రు పాకనాటి కుం
దిరువదియొక్క వేయిటి కధీశుఁడు నాఁ జనుచోడబల్లికిం
జిరతరకీర్తి కగ్రమహిషీతిలకం బన హైహయాన్వయాం
బరశశిరేఖ యైనగుణభాసిని శ్రీసతికిం దనూజుఁడన్. ౫౩

క॥ కలుపొన్న విరులఁ బెరుగం। గలుకోడిరవంబు దిశలఁ గలయఁగఁ జెలఁగన్
బొలుచు నురయూరి కధిపతి। నలఘువరాక్రముఁడఁ దెంకణాదిత్యుండన్. ౫౪

క॥ పాత్రుఁడ నసదృశకాశ్యప। గోత్రుఁడ సచ్చరిత నుభయకులశుద్ధుండన్
మిత్రాన్వయశేఖరుఁడఁ బ। విత్రీకృతదేహుఁడను వివిధయజ్ఞములన్. ౫౫

---

౫౨. కొలకొండ = మానపర్వతము.

వ॥ బిల్లువిశిష్టగుణగణాలంకృతుండనై. నెగడున పండితారాధ్య మాన ప్రతిభా ర్థకో దీర్ఘ చిరవస్తువిస్తారితో త్తమ కావ్యరత్నవిభూషణుండ నిర్మితాంశుభాగ్యావతారంబై విలసిల్లుజంగమమల్లికార్జునదేవునిఖిలజనశిరోవిభూషణామలదివ్యశ్రీపాదంబు లాకల్పాంతస్థాయిగా విభూషించు టశేషజగజ్జనజేగీయమానంబు.

చ॥ రవికులశేఖరుండనుకవిరాజశిఖామణి గావ్యకర్త స
త్కవి భువి నన్నెచోడుఁ డనఁగా కావ్యము దివ్యకథం గుమారసం
భవ మటె సత్కథాధిపతి భవ్యుఁడు జంగమమల్లికార్జునుం
డవిచలితార్థయోగధరుఁ డట్టె వినం గొనియాడఁజాలదే.

వ॥ కావునం బరమశైవశిఖాగ్రోత్తుంగమణిశ్రీజంగమమల్లికార్జునదేవతాకంబై జగంబులం బ్రత్యక్షంబై ప్రవర్తిల్లుట జంగమమల్లికార్జునదేవుండై ప్రాణాయామాదిషడంగోపాంగసకలయోగిజనారాధితుం డగుటం బరమయోగీంద్రుఁడనై న్యాయవైశేషికాదిషట్తర్కకర్కశుండగుటం బరవాదిభయంకరుండై జన్మమరణాదిదు:ఖార్ణవోత్తీర్ణన్యాయమానమానసుం డగుటనుం బరమానందహృదయుండై ఘోరసంసారపారావారోత్తరణ కారణానూనవైరాగ్యనిరతుం డగుట సమ్యగ్జ్ఞానస్వరూపుండై వేదషడంగశాస్త్రపురాణేతిహాసాగమాదిసకలకళాస్వరూపాపారవాణీధరుం డగుట నిఖిలవిద్యాగురుండై సకలజనాభీష్టవిమలజ్ఞానానూనఫలప్రదాయకుం డగుటం బరమస్వరూపుండై సమస్తవిద్వజ్జనమనోమానసకేళీలాలసుం డగుటం బరమహంసస్వరూపుండై యత్యుత్తమపురుషార్థప్రవర్తితుం డగుటం బురుషోత్తముండై నిఖిలముముక్షుజనైకధ్యేయాత్తకుం డగుటం బరమబ్రహ్మస్వరూపుండై నిస్త్రైగుణ్యపదార్థప్రవర్తితుం డగుట గుణగణాతీతుండై సద్భక్తజనాత్మాలోకనైకహేతుభూతుం డగుట మునిజనముఖమణిముకురుండై నెగడుసద్గురుండైనజంగమమల్లికార్జునదేవునకున్ ౫౮

క॥ శ్రీకంఠమూర్తి కమల। శ్లోకున కనఘునకు మితవచోనిధికి సుధీ
లోకస్తుతునకు విజ్ఞా। నాకారున కమితమతికి నచలాత్మునకున్. ౫౯

క॥ సద్గురుఁ డనఁ జనునఖిలజ। గద్గురునకు సంతతోపకారికి మునివి
ద్వద్గురునకుఁ గవిబుధహిత। మద్గురున కపారధర్మమతికిన్ రతికిన్. ౬౦

క॥ సంగాసంగవిదూరున। కంగజహరమూర్తి కఖిజనాభరణునకున్
గంగాజలనిభకీర్తికి। జంగమమల్లయకు విబుధసంస్తుత్యునకున్. ౬౧

క॥ ఆత్మయమూర్తికి సాత్రిత । రక్షణదక్షునకు ధర్మరతిమతికిఁ గళా
దక్షునకు నమితునకు శుభ । లక్షణలక్షితున కిహాలహాశ్రితునకుఁ. ౬౨

క॥ కుందదరహాసస్ఫురకరి । చందననీహారహారశరదంబుదశ్రీ
శైలేందునిభకీర్తిపరున క । నిందితగుణనిధికి నధికనిర్మలమతికిన్. ౬౩

క॥ సత్త్వాదిగుణవిభూతికి । సత్త్వదయాళునకు నధికసంతుష్టునకున్
దత్త్వప్రకాశమతికి జి । తత్త్వఫలప్రదున కాత్మతత్త్వజ్ఞునకున్. ౬౪

క॥ శుంభద్గుణనిలయున । కంభోధిగభీరునకు మితాలాపునకున్
జంభారిభోగభాగికి । నంభోజాక్షునకు సజ్జనాభరణునకున్. ౬౫

క॥ వినుతబ్రహ్మర్షికి న । త్యనుపమసంయమికి సజ్జనాభరణునకున్
మనుజాకారమహేశున । కనుపమచరితునకు మల్లికార్జునమునికిన్. ౬౬

వ॥ పరమభక్తియుక్తి నావర్జితహృదయుండనై సకలభువనభవనావతారకారణుం డైన పరమేశ్వరునవతారం బగుటయుం దదంశావతారంబుగా వ్యావర్ణించి నాచెప్పంబూనిన దివ్యకథాసూత్రం బెట్టిదనిన. ౬౭

స్ర॥ సతిజన్మంబున్ గణాధీశ్వరుజననము దక్షక్రతుధ్వంసముం బా
ర్వతిజన్మంబున్ భవోగ్రవ్రతచరితయు దేవద్విషత్క్షోభముం శ్రీ
సుతసంహారగ్ను భూభృత్సుతతపము నుమాసుందరోద్వాహముల్ ద
ద్రతిభోగంబుం గుమారోదయము నతఁ డనిం దారకుం బోరఁ గెల్వన్. ( )

ఎ॥ అనం బరఁగు సకలావయవంబులం బరిపూర్ణం బైన దివ్యకావ్యాంగనాసృష్టికర్త యైన. ౬౯

సీ॥ విధి నియమంబున విశ్వంబు సృజియింప దక్షప్రజాపతిఁ దలఁచి మఱియుఁ
బ్రకృతిస్వరూపమై శైలగుమహామాయఁ డైలోక్యమాత నాధారశక్తి
భావించి సద్విధి నావహించుడు రూపలావణ్యగుణహావభావకాంతి
సుందరాకారవిస్ఫురణతోఁ బ్రత్యక్షమై యేమి వలతు నీ వడుగుమనిన
నాకుఁ బుత్రివై పినాకికిఁ బత్నివై । మిథునచరితఁ దగిలి మీరు లోక
జననములకు బీజశక్తులై యుండంగ । వరము గరుణ నొసఁగవలయు దేవి. ౭౦

---

౬౮. గెల్వఁగ = జయము, గెలుపు.

వ॥ అని యమ్మహాదేవివలన నద్భుతప్రసాదుండై యనేకవిధజపధ్యానసంస్తోత్రాదులం బరమేశ్వరుఁ బ్రత్యక్షుంబు జేసి. ౨౧

శా॥ దేవాధీశ సమస్తముం బడయు నుద్దేశించి ముక్తిభుక్తి నీ
దేవిన్ సర్వపదార్థమూర్తి నిఖిలస్త్రీరత్నమున్ నీకు నే
నావాహించితి మీరు సన్నిధునచర్యాసక్తి మైకొన్న నా
కీవిశ్వోదయకార్యసిద్ధి యగు వాణీంద్రామరేంద్రార్చితా. ౨౨

వ॥ అనినం బరమేశ్వరుండు సద్భక్తియుక్తి కనురక్తుండై సతీరత్నం బగుసతిం బరిగ్రహించి తనకుం జతుర్విధభూతగ్రామసృష్టికర్తగా వరం బిచ్చిన మహాప్రసాదం బని. ౨౩

సీ॥ దక్షుండు దత్క్రియాదక్షత జగములఁ బ్రకటింపఁ దలఁచి యేఁబండ్రసుతలఁ
బడసి వారలలోనఁ బదుమువ్వు రువిదల గారవంబున నిచ్చెఁ గశ్యపునకు
జీవితేశ్వరునకు జీవితైశ్వర్యుల నాఁ బదుండ్రఁ బరిణయము సేసె
వెలమితో మఱి యిర్వదేడ్వుర సుదతుల సురుచిరంబుగ సుధాసూతి కిచ్చె
వరుస నిల్లు దగినవరులకుఁ గూఁతుల । నిచ్చి సతియుఁ దాను నిచ్చ మెచ్చి
తన్నుఁ గన్నయావిధాతకంటెను దాన । శేషగాంచె నఖిలసృష్టిలోన. ౨౪

వ॥ అంతట నప్పరమేశ్వరుండు దాక్షాయణిమనోహరాకారనవయౌవనభావహావవిలాసవిభ్రమసౌందర్యగుణంబుల కంతకంత కనురక్తుండై. ౨౫

క॥ మాటలఁ జెయ్యుల బేటం । బేటముగా నలవరించె నెసఁగఁగ సతిలా
లాటతటనయనుఁ డింపుగ । కూటముల కపూర్వసురతగుణకోవిదుఁడై. ౨౬

వ॥ ఇట్లియ్యిరువురు నన్యోన్యరాగాతిరేకంబునం గ్రామకేళీలాలసు లగుచు. ()

---

౨౬. బేటంబేటముగా = అనురాగప్రత్యనురాగములలో, "కనుబేటంబున నేటమైనహృదయగ్లానింబయోజాస్యకున్" దశకుమారచరిత్ర-ఆ-౪, మేము తాళపత్రగ్రంథములనుండియే యుదాహరించుచున్నందున ముద్రితగ్రంథములలోని వానికిఁ బాఠభేదములగపడును. పండితకవులు మేలేర్చికొందురుగాక.

ప్రథమాశ్వాసము.

సీ॥ కలహంసకలరవాకలితనిర్ఘరముల సారసనరసాబ్జషండములను
రోలంబరుతిలతాందోలంబులను శుకమంజులస్వనప్రసూనప్రపములఁ
గలకంఠరణితమాకందవనములఁ బారావతధ్వనిమందిరస్థలములఁ
గేకికలధ్వానగిరికంధరంబుల లావుకనినదలీలాతలముల
నప్పటప్పటి కనురాగ మగ్గలింపఁ గామరస మంతకంతకుఁ గడలుకొనఁగ
నలి రమించిరి కైలాసనగముమీఁదఁ బరమసుఖలీల నాజగత్పతియు సతియు.

క॥ ఈవిధమున శివశక్తులు భావజకేళీవిలోలభావంబుల నా
పోవక విహరించిరి నా నావిధములఁ ద్రిగిరి రజతనగపార్శ్వములన్. ౭౯

వ॥ తదనంతరంబ. ౮౦

సీ॥ అనుర క్తిఁ గడిగొమ్మ గొన మేయసల్లకీకబళనకాపాయగండములను
సల్లకీపల్లవసౌరభ్యమున కనుబల మైనమదగంధపరిమళంబు
మదగంధమునకుఁ దుమ్మెదపిండు సూటి లీ బలసి ఘూర్ణిల్లుచే రుతివిపల్లి
నలిగీతి సెకిపట్టి యాలించి విని సోలి పరవశు లై యుండుభద్రకరులు
భద్రకరు లై నయూథాధిపతులు గాఁగఁ గలస్త్రీసుఖలీల విహరించుకలభకరిణి
గజగణంబులఁ బొలుపొందుగజవనప్రభాతి గని మెచ్చుతో జగత్పతియు సతియు.

వ॥ తద్విశేషంబు లాలోకించుచున్నంత.

క॥ జంగమకుల్యాలంబుల నంగ మహీతలఘునాఘనంబుల నా ను
త్తుంగతరనీలరుచి మా తంగము లభిరామ మయ్యెఁ దద్వనభూమిన్.

గీ॥ ఉగ్రభానుకరాహతి కోర్చిపాఱి వచ్చి తరువనదుర్గంబు సొచ్చియున్న
తిమిరపటలంబు నాఁ గాననమునఁ గలయ నిండి ఘూర్ణిల్లుచుండె వేదండఘటలు.

వ॥ అం దమందమృగభద్రజాతిగిరిచరనదీచరోభయచరదేవాసురాంశకలభకరేణు
ధేనుకమనభిక్షుపోతికాదివన్యగజయూథంబులందు.

శా॥ గండారణ్మదసౌరభంబునకు బింకం బెక్కఁ గ్రోధాగ్నికిం
గొండాటంబుగ దానసంపదకు నాఘోషంబు గాఁ దీయ మా
చండాలివ్రజగీతరావములు కుత్సాహంబుతో నుక్కవే
దండస్వామి మదంబు సేసెఁ గరిణీధామంబు లద్దాడఁగాన్.

వ॥ మఱియు నొక్కెడ. ౮౭

క॥ కరిమదగంధము నెఱుఁగుచుఁ । గరములు వెంచుకొని ముసరి కటితటముల భా
సురమయ్యె నగతటంబులఁ । బరువడి నెలుఁగు లెత్తి వేఁచబడిన విధమునన్

మ॥ కరిణీబృందముఁ బాసి యొక్కమదనాగం బద్రితటోన్నతకం
దరసంక్రాంతనిజప్రభాళిఁ బ్రతివేదండంబుగాఁ జూచి దు
ర్ధరరోషంబునఁ బోరుచుండె నతిమాత్సర్యంబునం దా మహే
శ్వరుకైలేంద్రముతోడ నీలగిరి వేల్పుం బోరునట్లున్నతిన్. ౮౯

మ॥ కటితాలుస్థవరోమహూపకటిసత్కర్ణోష్ఠకోశాలిశీ
కరమేఘాపతచిక్కఘర్మజలరంగద్దానసంపూర్ణసా
గరనీదోన్మదసన్నుతాష్టమదముల్ గ్రమ్మం దదష్టాంగబం
ధురమై సింధుర మొప్పుచుండె నలిగీతుల్ వించు సోలంబునన్. ౯౦

వ॥ తదవసరంబున ఘర్మాంశుకరాహతి కులికి తదీయాప్తబంధువైన యరవిందంబుల
కలిగి దడింపం జొచ్చునట్లు వేదండంబులు కమలషండంబుల కరుగుదెంచె
మహోత్సాహంబున. ౯౧

గీ॥ కొలను వన్యేభములు చొచ్చి కలఁచఁ గలఁచ । బులుఁగు లుండక వెలువడిపోయెఁ
దగదె మాతంగదూషితం బగు సరోవ । రంబు సద్విజవర్జనీయంబు గాదె. [శ్లోక

వ॥ తదవసరంబున.

క॥ పుష్కరషండములోఁ గల । పుష్కరమూలములు గబళములఁ గొనుచుం స
త్పుష్కరతలముల మునిమిడి । పుష్కరములఁ జెలికి వైచుఁ బుష్కరమునకున్.

క॥ తననీడ నీరిలోపలఁ । గని యది ప్రతిగజము సావి కడుకొని కోపం
బునఁ దాఁకి పోరఁ జొచ్చెనొ । యన నొకకరి నీరిలో రయంబునఁ గ్రుంకెన్.

గీ॥ కరులదానంబులకు మధుకరము లెఱఁగి । కుంజరమ్ములు నీరిలోఁ గ్రుంకియున్న
మీఁద సుడియుచు నుండెఁ దుమ్మెదలు వాయ । కుదధి కెఱఁగిననీలనీరదము
[లనఁగ. ౯౬

వ॥ తత్ప్రస్తవంబున. ౯౭

సీ॥ కడిదోవ సుడిదుఖలు గళిని నవాశ్వత్థవల్కలరసములు వఱలఁ బూసి
భాతిల్లో నలిమ్మృదుభూతురాగంబులు గోపురాగ గుంభస్థలములఁ బూసి
సల్లలితాశోకపల్లవనివహంబు కర్ణావతంసంబుగా రచించి
మానితం బగునవమాలికా స్తబకముల్ మురజిలుగాఁ గంఠముల నమర్చి
కరము వెరవుమెఱసి కరిణులఁ దారును। నభినవంబుగా మదాంధగంధ
సింధురములు మెఱయ శృంగారములు చేసి। కామకేళి సలుపఁ గాతరిల్లె. ౯౮

వ॥ ఇట్లనేకప్రకారంబుల శృంగారంబు సేసి కామకేళీలాలసులై కరికరేణువు
లత్యంతానురక్తిఁ గొండొండ నడరందొడంగె నంత నందు. ౯౯

శా॥ జేట్టం బేటముగా నిభంబు కరిణిం బ్రేమంబుతోఁ జేరి లా
లాటం బొత్తు లలాటపట్టమునఁ గేలం గేలు వేష్టించు గ్రీ
గోటన్ మేయొరయున్ వరాంగములు పోఁకుం బుష్కరాగ్రంబునన్
దాటోపం బానరించుఁ గూడఁ బ్రియఁ గామాసక్తి నాసక్తమై. ౧౦౦

మ॥ హృదయాహ్లాదముతోడఁ బాయక సదానేకప్రకారంబులన్
మదనాసక్తిఁ బెనంగు చున్నవిలసన్మత్తేభవిక్రీడితం
బది దాక్షాయణి సూచి కౌతుకరతైకాలీనభావాభిలా
షదృగత్యుజ్జ్వలదీధితుల్ పఱపె నీశాననాబ్జంబుపైన్. ౧౦౧

వ॥ తదవసరంబునం బరమేశ్వరుండు నిజజీవితేశ్వరికన్నెలింగి దానికి సమ్మతించినం
గని సంతోషించి. ౧౦౨

క॥ సతి కరిణి యగుడుఁ ద్రిజగ। త్పతి కరియై కూడె సతులు భావించినయా
కృతిఁ గూడ నేర్పగాదే। యతిశయముగ నింగితజ్ఞు లగుపతు లెందున్. ౧౦౩

గీ॥ ఆదిమూర్తులు శివశక్తు లచలమతులు। హరుఁడు సతియును మరతాగ్రులై విహీన
తరము లగుమృగరూపముల్ దాల్చి రనినఁ గాముమాయల నెవ్వారు నేమిగారు.

క॥ హరుఁడును సతి రతిఁ దనుపఁగ। భరమై గజకేళిఁ గూడి పడసెను సుఖ మిం
కొరు లెట్లు నేర్తు రౌకమెయిఁ। గరణంబులు పెక్కులేక కాంతలఁ దనుపన్.

వ॥ ఇట్లు పరమేశ్వరుండును సతీదేవియు సామజకేళీలాలసులై విహరించి రంత
సద్యోగర్భంబున. ౧౦౬

క ॥ పురుషాకారముఁ [illegible] । కరివదనము [illegible] కరముత్రి లంబో
దరము హరినీలవర్ణముఁ । గరమొప్పఁగఁ దాల్చి విఘ్నకరుఁ డుదయించెన్. ౧౦౭

వ ॥ ఇట్లు దాక్షాయణికిని సకలభువనభక్షనాధీశ్వరుం శైవపరమేశ్వరునకును గణాధీశ్వరుం డుదయించిన మహోత్సాహంబున. ౧౦౮

మ ॥ సురవాద్యంబులు మ్రోసె దిగ్వదనముల్ శోభిల్లె గంధర్వకి
న్నరగేయంబులు మించె దేవగణికల్ నర్తించి రింపారఁగాఁ
గురిసెం బువ్వులవాన దేవరవముల్ ఘూర్ణిల్లె నాదివ్యసిం
ధురయూథంబు మదంబుసేసె గణనాథుం డుర్విఁ జన్మించినన్. ౧౦౯

వ ॥ తదవసరంబున హరిపరమేష్ఠిపురందరాద్యఖిలదేవర్షి రాజర్షి ప్రముఖాఖిలజగజ్జనంబులు రజతాచలంబున కరుగుదెంచి మహోత్సవము సేయుచుండి రంతఁ దదీయప్రార్థితుండై పరమేశ్వరుండు శివగణసురగణాదిసమస్తగణాధిపత్యాఖిలక్రియారంభాదిపత్యంబులతో యువరాజపట్టంబు గట్టి పరమానందరసాబ్ధి నోలలాడుచుండి రంత నక్కడ దక్షప్రజాపతిసకలజగజ్జనంబుల నిర్మించి సంతోషితహృదయుండై యొక్కనాఁడు. ౧౧౦

క ॥ జలజాత్యంతకకశ్యప । కులభామిను లై నెగడ్తకుం జని బహుపు
త్రులఁ బడసి పేరుకొనుచుఁ । తులఁ జూడఁగ నరిగె నతికుతూహలబుద్ధిన్.

వ ॥ చని నిజాగమనప్రయోజనంబు కశ్యపున కెఱింగించి పుచ్చిన. ౧౧౨

మ ॥ విని సంతోషముతోడ సంభ్రమముతో వేగంబునం బ్రీతితో
మునిసందోహముతోడ శిష్యతతితో మూర్తంబు లై కొల్చు వే
దనినాదంబులతోడ సంతతమహోత్సాహంబుతో వచ్చె ము
న్కొని తాత్పర్యముతోడ గశ్యపుఁడు దక్షుం గాన సద్భక్తితోన్. ౧౧౩

వ ॥ ఇట్లు సకళత్రంబుగాఁ జనుదెంచి సర్వాంగీణప్రణాముండై నిజమందిరంబునకుం దోడ్కొని చని యర్ఘ్యపాద్యాదివిశేషార్చన లర్పించి మణికనకాదివస్తునిచయంబునం బూజించినకశ్యప్రజాపతిభక్తియుక్తి కావర్జితహృదయుండై దక్షుం డాతని వీడ్కొని ధర్మరాజావలోకనకుతూహలపరుం డై చని ముందట.

స్ర ॥ ఘనబృందానేకదేశాగతపథికజనాఘప్రవాహాంగసంగా
శనిభీతార్తోరుశైలాశ్రయము నిఖిలనదీస్వామిఁ జంద్రావ్యర్శి
జనకుం గల్లోలమాలాచలితనిజతటత్స్మాజరాజీవిలాసుం
గనియెం దత్పుండు రత్నాకరు నిఖిలమహీకామినీమేఖలాభున్. ౧౧౫

వ ॥ కని యమ్మహాబుుషి మహాపరుషవజ్రవజ్రపాతభీతాయాతక్షోణిధరపక్షవిక్షేపక్షు
భితానేకనక్రచక్రతిమితిమింగిలశద్గళకుంభీరకుంభీనసాద్యనేకజలచరకులాకులితలు
లితాలోలకల్లోలానూనఫేనాయమానశుక్తిముక్తాఫలాభిరామం బైనయుదధియని
మెచ్చి మఱియును విశేషించుచు. ౧౧౬

క ॥ శరనిధిరత్నంబులు దివి। కరగస్తు యని తారకముల నతులోర్మికరో
త్కరములు దెమల్చి తెల్చిన। పరుసున నవవిపులఫేనపంక్తులు వెలుఁగన్

క ॥ వనధిఁ గలనగము లన్నియు। ననిమిషపతిమీఁద నడువ నని యొగసెనొకో
యన నాకాశముఁ దాఁకఁగ దనరఁగ నత్యున్నతోర్మితతి విలసిల్లెన్. ౧౧౮

చ ॥ ఉడుగనినీరిలోనఁ బడియుండఁగ నోపక బాడబాగ్ని వె
ల్వడి వరతీరభూరుహకులంబులపై మొగిఁ గప్పునట్లు దం
దడి నరుణప్రవాళకలతల్ దరుసంహతిమీఁదఁ బర్వె చె
ల్వడరి తటాటవుల్ దనరు నబ్ధిబహిర్గతరత్నదీప్తులన్. ౧౧౯

గీ ॥ వనధినీ రెల్లఁ గొనిపోవఁ గని సహింప। కబ్దతతి గిట్టపట్టిన నరుగ నోప
కొలి దొంతులు గొని పడియన్నకారు। మొగుళు లనఁజూచి తటభూమిమొగళు
[లమరె. ౧౨౦

క ॥ సురగిరికర్ణికగా వి। స్తరతము లగుమండలములు దళములుగా న
వ్విరిదమ్మిఁ బోలి క్రాలుచు। శరనిధిలో నిఖిలధరణిచక్రము వొలుచున్. ౧౨౧

క ॥ హరిఁ దనగర్భమునఁ జరా। చరమయవిశ్వంబు దాల్చినసువాని నీతే
తరమణివోలె ధరించిన। శరనిధిపెం పేరి కైనఁ జనునే పొగడన్. ౧౨౨

వ ॥ అని యనేకవిధరత్నశీకరాకరం బైనరత్నాకరాశేషవిశేషంబులు బహుప్రకారం
బుల విశేషించుచు ధర్మాకర్మఫలభోగాస్పదం బైనధర్మరాజపురంబున కరిగె
నంత. ౧౨౩

ఉ॥ అత్రియితో వసిష్ఠప్రముఖాదులగు దివ్యమునీంద్రముఖుల్ మునుల్
ధర్మసమేతులై పితృపితామహవర్గము చేర్చి యాదరముం
గర్మములం జరాయుజాలుం గాలములుం దనరం గొల్వ
ధర్ముఁడు వచ్చె లోకగురు దక్షుఁ గనుంగొనుచుం గనుంగొనన్. ౧౨౪

వ॥ ఇట్లేదురవచ్చి భార్యాసమేతంబుగా వినయవినమితోత్తమాంగుఁడై కశ్యపు కంటె విశేషార్చనలం బరితోషితుం జేసిన ధర్మరాజు వీడ్కొని చంద్రమండలంబున కరిగిన. ౧౨౫

చ॥ కువలయబాంధవుండు హిమగోనికరావృతుఁ జేసి మామ క
శ్యప మొనరంగ నుండటఁ బథశ్రమ మూర్చుచ వచ్చెఁ దారకా
నివహానిజౌషధీకుముదినీపరివేష్టితుఁడై సుధాసము
ద్భవుఁ డమలాంగుఁ డెంతయు ముదంబున దక్షునిఁ గాన నెమ్మితోన్. ౧౨౬

వ॥ ఇట్లెదురువచ్చి కశ్యపధర్మజాలకంటె విశేషార్చనలు గావించిన సుధాకరు వీడ్కొని సతీపరమేశ్వరావలోకనార్థుఁడై యనేకదివ్యఋషిపరివేష్టితుండై చనుదెంచి. ౧౨౭

క॥ ధరణిధరుఁ బార్థివశే। ఖరసంయుతు రాజవంశకమలార్కుఁ రథ
ద్విరదభటవాజిపరివృతు। నరపతిగతిఁ బోలుచు రజతనగపతిఁ గనియెన్. ౧౨౮

వ॥ కని తదీయమాహాత్మ్యంబునకాశ్చర్యహృదయుం డగుచుం దగ్గిరిపాలకానుజ్ఞాతుండై పరమేశ్వరాస్థానంబున కరిగి. ౧౨౯

ఉ॥ మారమదప్రహరు గుణమండనమండితు సుందరాంగు దు
ర్వారభవాబ్ధిపారగు సువర్ణ సవర్ణశరీరు సజ్జనా
ధారుఁ గవీంద్రగాయకబుధ స్తుతుఁ గాశవికాసహాసది
క్పూరితచారుకీర్తి మునిపుంగవు జంగమమల్లికార్జునున్. ౧౩౦

క॥ భవమరణాంధః పూరిత। భవసాగరతరణసేతుపద్ధతిఁ జేతో
భవనిశితకుసుమబాణో। ద్భవరాగవిముక్తుఁ గమలభవకులతిలకున్. ౧౩౧

చ॥ గతమదమత్సరేంద్రియవికారమహావ్యసనాస్తసంగతా
గతవసులోభమోహభయకల్మషదుర్వ్యసనాదులేరుగా
ప్రతియమనోజమార్గణుఁ బ్రదీపితు నిర్మలినాంతరంగు సా
వతమునినాథమానుసుజనస్తుతు జంగమమల్లికార్జునున్.

క॥ ఆత్మయునిఖిలకళాగము। బత్తుమహోదారు ధీరుఁ దత్వజ్ఞు అలా
టాక్షజనితోగ్రశిఖిముఖు। భక్తితపంచేషుదేహుఁ బరమోత్సాహున్. ౧౩౩

మా॥ విగతసకలరాగద్వేషు నిర్ముక్తదోషున్
త్రిగుణపదచరిత్రాతీతు ప్రజ్ఞాసమేతున్
సగుణు నచలమోక్షాసక్తు సంసారముక్తున్
బొగడఁదగు దురాషాడ్భోగి నిర్వాణయోగిన్. ౧౩౪

గద్య॥ ఇది శ్రీమజ్జంగమమల్లికార్జునదేవదివ్యశ్రీపాదపంకజభ్రమరాయమాణకవిరాజ
శిఖామణినన్నెచోడదేవప్రణీతంబైనకుమారసంభవం బనుకథయందుఁ బ్రథమా
శ్వాసము. ౧౩౫



# ద్వితీయాశ్వాసము.

శ్రీకంఠమూర్తిఁ బుణ్య। శ్లోకు మహాభాగు నిఖిలలోకారాధ్యున్
నాకేశభోగిపత్యగు। ణాకరు నచలాత్మ మల్లికార్జునదేవున్. ౧౩౬

మ॥ అతినీలాభ్రవిలంబిస్మై పాలుచునీహార్ద్రాదియుం బోలె స
త్పుతు సామోద్భవవక్త్రి నెత్తికొని సంతోషంబుతోఁ జూచుచున్
సతి నవ్వించుచు నవ్వు చున్నపరమున్ సర్వేశు దక్షప్రజా
పతి గాంచెన్ సితహాసప్రభావిచలితబ్రహ్మాండభాండోదరున్. ౧౩౭

వ॥ కని సర్వాంగాలింగితమహీతలపునఃపునఃప్రణామసంస్తోత్రాదిసత్కారంబులు సేయక దురభిమానంబున నహంకరించి యున్నదక్షునిం గని విరూపాక్షుం డాక్షేపించి విముఖుం డైనం గని దక్షుండు దనయల్లురందఱు చేసినసత్కారంబులును మొదలియల్లుం డైనపరమేశ్వరుండు సేయమికి మనఃక్షుభితుండై క్రమ్మఱ నిజనివాసంబున కరిగి తద్వృత్తాంతం బాత్మేశ్వరి కెఱింగించి మనఃఖేదంబున నున్నదక్షప్రజాపతికి దగ్ధధర్మపత్ని యి ట్లనియె. ౧౩౮

గీ॥ తల్లిదండ్రులఁ బూజించి తగ వెఱింగి। మన్నపాడ నైననేయుత్తమాము లనిరె।
ప్రియము మెఱుంగు నాఁడిచ్చినబిడ్డమనసుఁ। బాసె నని యుండుఁ డింక నాపల్కు
లేల. ౧౩౯

వ॥ అనిన వెండియు నవమానానలోద్దీపితమనస్తాపంబు సహింప నోపక తదపకారం బునకుం బ్రత్యపకారంబు సేయ నుద్యుక్తుం డై యి ట్లనియె. ౧౪౦

తరు॥ భువనంబు లన్నియుఁ బుట్టించి కశ్యపుఁడు వానిఁ గైకొని ప్రోచుచంద్రుండు
నవయువంబుల వాని నడఁచు ధర్ముండు నతిభక్తి నా కిచ్చె నర్చన లర్థి
నివి వారిలోనఁ దానే నెద్దపొంది యీశానుఁ డేఁ దనయింటికిఁ జన్న
నవమాన్యుఁ జేసె నాయల్లురు నేను నై తన్నుఁ జేయుదు నాగమబాహ్యు.

వ॥ అని విచారించి కృతనిశ్చయుండై మహాధ్వరప్రారంభాభిముఖుండై చతుర్దశ భువనాంతరానేకజనంబుల రావించినం దదీయాజ్ఞాప్రేరితులై.

సీ ॥ హరిపితామహపురందరలోకపాలార్కశశిరుద్రసురదైత్యవరమునీంద్ర
చారణగరుడప్రజాపతికిన్నరగంధర్వరాక్షసఖచరసిద్ధ
సాధ్యసురాహిపిశాచయక్షగ్రహవిద్యాధరాప్సరోవిప్రమనుజ
దిక్కులశైలనదీసాగరాగమధర్మవేదపురాణతర్కశాస్త్ర
నిచయమాదిగాఁగ సచరాచరాత్మకం బగుపదార్థ మెల్ల సాక్షిగంబ
తగువిభూతి మెఱసి దక్షప్రజాపతి యజ్ఞమునకు వచ్చె నతిముదమున. ౧౪౩

వ ॥ తదనంతరంబ నిజకులపాలికాసమన్వితులై కశ్యపాదిమునిచంద్రులు దమతమ విభవంబులు మెఱసి మహోత్సాహంబునం జనుదెంచి రంత నఖిలభువనాధీశ్వరాకీర్ణంబై కలకలస్వాద్యాదిసమస్తవస్తుసంపూర్ణంబై యతిరమణీయం బగునిజపురోత్సవంబు గని పరమానందహృదయుండై దక్షప్రజాపతి బృహస్పతిదత్తసుముహూర్తంబునం గ్రతుదీక్షితుండై పటుపటహపణవభంభధుర్దుంభమృదంగశంఖకాహళకాంస్యవేణువీణాత్రిపిటితవిపంచికాఘనసుషిరాద్యాతోద్యధ్వానంబుల నధఃకరించి మంగళపాఠకపఠనానూనగానవేదాశీర్వాదినాదంబులు నిర్మథ్యమానసముద్రఘోషంబు నధఃకరించి ప్రళయఘనగర్జనరవంబులుం బోలె రోదసీకుహరాపూరితంబులై మహాధ్వని సెలంగుచుండ. ౧౪౪

క ॥ బ్రహ్మరథ మెక్కి విష్ణు। బ్రహ్మాదికసకలదేవపరివృతుఁడై యా
బ్రహ్మఋషిసుతుఁడు దక్షు। బ్రహ్మలసద్యాగమంటపంబున కరిగెన్. ౧౪౫

వ ॥ ఇట్లధికతరవిభూతితో ధర్మపత్నీసమేతుండై యజ్ఞోపకరణద్రవ్యాద్యనేకద్రవ్యపరిపూర్ణంబై నానావిధాలంకారాలంకారాలంకృతంబై యతిరమణీయం బైన యజ్ఞశాల ప్రవేశించి యజమానస్థానంబు నలంకరించుచుండె నంత విధివిహితవిధానంబుగ ఋత్విగ్గణంబులు త్రికుండంబుల జాతవేదాహ్వానంబు సేసి యథాక్రమంబున హోమంబు సేయం దొడంగి రంతి నక్కడ. ౧౪౬

క ॥ తనవిభవము దక్షుఁడు దిన। యునుదేవికిఁ జూపి మెఱయ నని ముందఱ వం
చినవిలిబు నైగ్రంసం। బునకు నరిగి కనిరి సకలభువనాధీశున్. ౧౪౭

వ ॥ కని సర్వాంగీణప్రణాములై నిజగమనప్రయోజనం బెఱింగించి పరమేశ్వరానుజ్ఞాతులై సతీదేవిం దోడ్కొని దివ్యవిమానారూఢులై మనోజవంబునం జనుదెంచి రంత. ౧౪౮

క ॥ ఆతతమణిరుచిరనభ ము। ద్యోతింపఁగ నతులగతి రతహోగ్రతరుచి సు
ర్వీతల మద్రువఁగ నుల్కా। పాతం బనుకర్జెఁ దత్సభా సదు లులుకన్. ౧౪౯

క ॥ జా నత్రి పశుపతి నుత్రిక వి। ధానమహరంభుఁ డై నదక్షుం డనున
జ్ఞానికి మునుకొని వచ్చున। మానం బన నమర సతివిమానము వచ్చెన్. ౧౫౦

వ ॥ వచ్చి మఖమంటపోపకంఠంబున విమానావతరణంబు సేసినదాక్షాయణికిం జంద్ర
రేఖానేకవిద్యుల్లేఖానికరంబునుం బోలె శివగణికాసహస్రంబు పరివేష్టించి.

సీ ॥ కనదపాంగావలోకనదీప్తు లుత్ఫుల్లకమలపుష్పోపహారములుఁగాఁగ
నలసదోదూయమానామోదనిశ్వాసపవనంబు లగరుధూపములు గాఁగ
మహనీయజాజ్వల్యమానభూషామలరత్నప్రభాతు లారతులుఁగాఁగ
మణిమయమంజీరఝుణఝుణత్కారాదిరుతము లింపారుసంస్తుతులుఁగాఁగ
నభవమూర్తి నైనయాగాధి కర్చ। లిచ్చుకరణి వినుతు లెసక మెసఁగ
నెలమి జన్నసాల కేతెంచిరా సభా। సదులు కౌతుకమున సంభ్రమించి. ౧౫౨

వ ॥ ఇట్లు సనుదెంచుపరమేశ్వరమహాదేవిం గని హరిపరమేష్ఠిపురందరాద్యఖిలసభా
సదు లాలోకనమాత్రఁ బ్రస్తుతించుచు మస్తకన్యస్తకరకమలముకుళు లగుచుండ
వచ్చి వినయంబున దత్తప్రదత్తమహాసనాసీనయై జగజ్జనకుం డైననిజజనకు
మహత్త్వవిభుత్వంబునకు మెచ్చుచు సురవరుల నెల్లను రావించి పరమేశ్వరు
రావింప భయస్థుండై నిజపుత్రి స్నేహంబున రావించె నని సంతోషించి సతీ
దేవి దక్షునకుఁ బ్రియసంభాషణభావంబున నిట్లనియె ౧౫౩

గీ ॥ హరిపితామహదివిజేశ్వరాదిదిగధి। పతుల సురమునిద్విజుల రాఁ బనిచి వరదు।
నభవుఁ బరమేశు రావింప వైతి నీవు। దలఁచి పిలిచిన భక్తవత్సలుఁడుగాఁడె.

వ ॥ అనినం బరమేశ్వరుం డనుపలుకు సహింపక దక్షుం డాక్షేపించి. ౧౫౫

శా ॥ ఈలక్ష్మీశ్వరుం డీజగజ్జనకుఁ డీయింద్రాదిదిక్పాలు రిం
దీవీ…వతి యిమ్మునీశ్వరగణం బీవిప్రసంఘంబు వే
దాలంకారులు వీరిలోనికి విరుద్ధాచారకంకాలకా
పాలోగ్రాహిజటాజినాస్థిధరుఁ డాభస్మాంగి రా నర్హుఁడే. ౧౫౬

వ ॥ అనిన విని నవఘనాఘనధ్వని వినినకమలలక్ష్మియుం బోలె నుదరిపడి, లగ్గనోని దాక్షాయణి దక్షున కిట్లనియె. ౧౫౭

మ ॥ త్రిజగన్నాథుఁ బవిత్రగాత్రుఁ గ్రతుమూర్తిం బుత్త్ర సత్పూజ్యుఁ డే
యజనాభీలకపాలశల్యధరుఁ డీయజ్ఞాదులం దంది యీ
ద్విజదేవాదులకుం గపాలకవచాస్థివ్రాతముల్ మేనులన్
నిజమై యున్నవి రుద్రచిహ్నలివె వీనిం బుచ్చి రా నేర్చిరే ౧౫౮

సీ ॥ వీరి కెల్లను దేవతావిభవ మొసఁగు । చున్న పరమేశు రావింప నొల్ల ననియె
దింక నీయజ్ఞఫలము నీ కిచ్చునట్టి । పెద్ద లెవ్వ రీవచ్చినవేళ్ళయందు. ౧౫౯

సీ ॥ ధరణితలం బెల్ల నరదంబు చంద్రార్కబింబముల్ చక్రముల్ పృథుజవాశ్వ
ములు వేదములు పగ్గములు చతుస్స్వరములు ప్రణవంబు గసగోల బ్రహ్మసూతుఁ
డగపతి విల్లు పన్నగపతి గొనయంబు హరి గోల గరి గరుం డనల మమ్ము
పవనుండు వేగంబు దివిజగణంబులు నెరపులై యీశుండు పురము లేయఁ
దలఁచినంతన భోరనఁ దమకుఁ దార । వచ్చి కెలసంబు సేసినవారె కారె
వీరిఁ బట్టి పరమేశుని విడుతు ననఁగ । వలదు నీ కీశుఁ డేలినవాఁడు కాఁడె. ౧౬౦

క ॥ నెఱయఁగ నీ కిది కాదని । యెఱుఁగమి యీదేవగణము నేలినవానిం
గొఱగాఁడని కైకొన కిం । దఱఁ దెచ్చితి వీర లీశుదాసులు గారే. ౧౬౧

వ ॥ అని పరమేశ్వరు సమస్తసురాధీశ్వరుల కధీశ్వరుండుగాఁ బలికిన విని దక్షుండు సహింపక. ౧౬౨

ఉ ॥ అన్నినయట్ల యిమ్మునిసురాధిపులం జెడనాడు చున్న నీ
యున్నతికంటె నాకు మొగమోడి సహించిరి గాక వీరిలో
నెన్నిననిన్ను రుద్రుని సహింతురె దేవత లన్న నల్కతోఁ
గన్నుల నిప్పు లొల్కఁ హరుకాదిలి దక్షునిఁ జూచి యిట్లనున్. ౧౬౩

సీ ॥ నీకంటె హరి బుద్ధిలేకయె నిజనేత్రకమలంబు పూన్చి చక్రంబు వడసెఁ
బరమేష్ఠి నీకంటెఁ బరవిడియే శిర మొప్పించి నిత్యుఁడై యున్నవాఁడు

---

౧౬౩. హరుకాదిలి = పార్వతి. (కాదిలి = ప్రియుఁడు, ప్రియురాలు
భారతికిఁగాదిలిముప్వురఁదొత్తపేరు." ఎ - హరి. ౨౧.)

మఘవుండు నీకంటె మహనీయుఁడై క్రతుశతంబొనర్చి దేవేంద్రుఁడై వెలిఁగె
నిఖిలదేవాళియు నీకంటె నవివేకులయ్యు సేవించి భోగాత్ములైరె
వీర లిందఱికంటెను వెఱ్ఱిపుమిగుల। నెఱుక నీకిప్పుడెందుండి దొఱకెపడిమె
నగణితైశ్వర్యు శివుఁ బరమాత్ము నెఱిఁగియెఱిఁగి దూషింప నీకు నోరెట్లు గాడె

క॥ వాదున నీహరి వేధయు। గాదే యురులింగమూర్తి కడగానక నేఁ
డాదిగ వెదకెద రట్టిమ। హాదేవుఁ డపూజ్యుఁడనఁగ నగునే నీకున్. ౧౬౫

చ॥ హరుఁ జెడనాడి వీరిఁ గొనియాడెదు పెద్దయు నీవు చూడఁగా
గరళము మ్రింగి త్రైభువనకంటకులైన గజాసురాదులం
బరువడి నోర్చి విశ్వము శుభస్థితి నిల్పినవాఁడు దొల్లి నీ
హరియొ పితామహుండె దివిజాధిపుఁడే సురలే మునీంద్రులే. ౧౬౬

మ॥ హరునిర్మించిన వేదమార్గములు గా కాయాగముల్ సేయఁగా
వెర వొందెన్యోది సద్విధిం గ్రతుసమాప్తిం బొందినన్ మిట్టినా
వరదుం డొక్కఁడు దక్కఁ దత్ఫలము లెవ్వం డీ సమర్థుండు నీ
సురసంఘంబులలోన నంచు సతి దక్షుం దూలఁబోఁ బల్కుచున్. ౧౬౭

వ॥ ఇట్లు పరమేశ్వరు వేదకర్తయు సకలకర్మఫలదాతయుఁగాఁ బల్కిన దక్షుండు దుర్మదంబున సహింపక వెండియు నిట్లనియె. ౧౬౮

ఉ॥ ఎన్నఁడుఁ దొల్లి చర్మములు నెమ్ములు భూతియుఁ దాల్చి తాపసుల్
జన్నములందుఁ బాత్రుఁ డవిచారము లేక సురేశ్వరాదులం
బన్నముగాఁడి నీమగనిపక్షము వల్కెదు గాక చేల నీ
కొన్నమరుల్ జగజ్జనులు గొందురె వ్రాత్యులఁ బూజ్యులందురే. ౧౬౯

వ॥ అనిన విని సతీదేవి కోపోద్దీపితచిత్తయై. ౧౭౦

చ॥ అతిమున్ రుద్రు నెంతచెడనాడెదు సోమము ద్రాగియున్కియై
యెఱుఁగక బిట్టెదో కలయ నిమ్మఖధూమము గప్పికొన్న దు
ర్మతిఁ గొని ప్రేలెదో ముదిసి దుర్మతివై కడు విభ్రమించి పై
మఱచితొ కాలకాలు నజమస్తకసంహరు నిట్లు పల్కుటే. ౧౭౧

మ॥ అమృతాంభోధి మథింప మందర మనంతాహీశు గ్రేంచె శై
లము ధాల్పన్ హరి గాంచె మీఁద నజు నిల్పంబంచె వానుక్యఁగ
వ్యము ద్రాశైగిరి నుట్టంబంచె వడిఁ దివ్వంజంచె దేవానురా
ఘము సర్వేశుఁడు రాజుగాఁడె యెఱుఁగంగా రాదె నీకెమ్మెయిన్.

సీ॥ విశ్వంబు గావింప విశ్వాత్ముఁడై యష్టతనువులు నేకొని తనరువాని।
నురులింగరూపస్థు హరివేధలకుఁ దనకడగానరా కున్నపాదవువాని।
శరణాగతులకు దయావరములు నైశ్వర్యమూర్తి నేకొని యున్నకీర్తివాని।
వారక నేకావతారముల్ హరి కురుకల్పంబు లజునకుఁ గల్గవానిఁ
దా నచింత్యుఁ డనంతుఁ డనూనదాన। నిరతుఁ డక్షయుఁ డన నున్నపరముఁ
బరమయోగినిశ్చలనిర్మలయోగబుద్ధి। నెఱుఁగ గా కీశుమహిమ నీ కెఱుఁగరాదె.

వ॥ అనిన విని దక్షప్రజాపతి పశుపతి వేదబాహ్యుం డని తనపట్టినప్రతినయ పట్టి
క్రాలుచు వెండియు ననేకప్రకారంబుల దూషించుచున్న విని సతీదేవి హరిపర
మేష్ఠిపురందరబృందారకమునిబృందంబుల వేదంబుల నఖిలంబులం జూచి పర
మేశ్వరుండు మఖంబులం దపూజ్యుండే యనిన విని భయంబున నడనడ నడుం
గుచు దక్షు నిరాకరించి సమస్తలోకాగమంబులకుం గర్తయుం గర్మఫలప్రదా
తయు మఖప్రయోగాద్యఖిలపూజాస్థానంబులయందు నీశ్వరుండు పూజ్యుండు
గాఁ బ్రతిష్ఠించి బ్రహ్మవిష్ణువు లిట్లనిరి. ౧౭౪

క॥ ఏ మాదిమూర్తిదక్షిణ। వామాంగమునందుఁ బుట్టి వారక జగ
ద్ధామపరిపాలనాదిమ। హామహిమలు వొందఁ గంటి మాశివుకరుణన్. ౧౭౫

వ॥ అని యందఱుం బ్రత్యేకంబ యివ్విధంబునం బలికిన విని దక్షుం డందఱ నా
క్షేపించి మీరు భిక్షువలనిభయంబున దాక్షాయణిపక్షంబునం బలికినం గర్మ
బాహ్యుం డైనపాషండుండు పూజ్యుం డగునె యని యెవ్వరిం గైకొనక
మీఁదులేక పలికిన విని సతీదేవి కోపోద్దీపితహృదయయై దక్షు నాహుతిగొన
నెగయునట్లు సడరిమేనిలోఁ దనరుకోపాగ్నిధూమసమితి ముడివడి వడిన రం
ధ్రముల వెడలె. ౧౭౬

ఆ॥ అధిపుఁ బలుకఁబలుక నడరి యాకాశంబు దాఁకి సతిమనమున దరతరంబ
మాన కగ్నిలోన మలఁగ నేవోసినమాడ్కిఁ గోపవహ్ని మండి యెగసె. ౧౭౭

క ॥ తనపతిఁ జెట్టలు ప్రలికిన । జనకుం గని కోపవహ్ని సతిదేహము భో
రన మండెఁ భానుఁ గని కెం । పున మండెడుసూర్యకాంతపుత్రికవోలెన్.

గీ ॥ అధిపుఁ జెట్టలాడె నని దక్షుఁ గని సతి కదరుకోపవహ్ని నొడలు గాలెఁ
వగవ నల్లె యెట్టి వారికి బ్రియనిరాకరులఁ గాంచి యొడలు గాలకున్నె. ౧౪౯

చ ॥ పొలయుచునశోకవల్లి విరిపువ్వులగుత్తులమీఁదఁ గ్రాలు కెం
దలిరులొ నాఁగ మై నడరి దందడి వహ్నిశిఖాకలాపముల్
గ్రలకొనఁ బ్రేలి దూలికొని కాలె రయంబున లక్కబొమ్మ న
గ్గల మగువహ్ని చుట్టుకొని కాలురయంబున నిస్తుషంబుగాన్. ౧౫౦

వ ॥ తదవసరంబున. ౧౫౧

క ॥ భోరన నుడుగక చెలఁగుత్రి । యూరవములు పెల్లు సెడి మహీసురమునిబృం
దారకతతి దెస నురుహా । హారవములు సెలఁగె దన్మఖాగారములన్. ౧౫౨

వ ॥ అంతక మున్న కృతాంతకుండు తద్వృత్తాంతం బంతయు నారదువలన విని సకల భువనసంహారకారణాభీలకాలాగ్నిరుద్రోద్రేకంబున నభినయించువాఁడునుంబో లె/గోపానలోద్దీపితావేష్టితాతిభయంకరాకారంబు దాల్చిన. ౧౫౩

మ. స్ర ॥ వివిధాస్త్రానేకజాతావికలబహులసద్విస్ఫులింగాగ్నియుం ద
త్పవమానాహారవక్త్రప్రకటితవిషవిభ్రాజితోగ్రానలంబున్
సవికారాత్మాతికోపోజ్జ్వలతరవిపులజ్వాలియుం గూడి పర్వన్
భవభాలాభీలనేత్రోద్భవశిఖిశిఖలన్ బద్మజాండంబు దాఁకన్. ౧౫౪

వ ॥ తదవసరంబున. ౧౫౫

చ ॥ ఖురపదఘట్టనం ధరణి గ్రుంగ ఫణీంద్రుఁడు సుగ్గుసుగ్గుగాఁ
బరువడి నూర్పులం దెరలిపాఱఁ బయోనిధులుం గులాద్రులుం
బారిఁబారిఁ గ్రుంగ శృంగహతిఁ బొంద దివంబు నజాండమున్ మహే
శ్వరువృషభంబు నాక్షణమ వచ్చెఁ ద్రిలోకభయంకరాకృతిన్. ౧౫౬

---

౧౪౯. "నూఱుచెట్టలుసైరించిశిశుపాలుఁజంపె." ఉ.హరి. ఆ౪.

వ॥ అంత పుష్పదంతభృంగిరిటిఘంటాకర్ణమహాకర్ణవిభాగవీరశంకరవీరభద్రరుద్రగణా
ధినాథు లాండోళులం గదవ నుద్రేకించి. ౧౮౭

మ॥ హరి మర్దింతుమొ బ్రహ్మఁ బట్టుదుమొ యింద్రాద్యష్టదిక్పాలురం
బరిమార్చన్ వధియింతుమో త్రిదశులన్ భంజింతుమో లోకసం
హరణం బిప్పుడ చేయనెత్తుదుమొ విశ్వాధీశ్వరుం డీశుఁ డె
వ్వరిపై నగ్గెను చూడుఁ డంచుఁ బ్రమథవ్రాతంబు రౌద్రాకృతిన్. ౧౮౮

వ॥ సంక్షోభించి విరూపాక్షుండు దక్షునాక్షేపించు టెఱింగి పొంగుచు నతిరభసం
బునం బరమేశ్వరుముందటికి వచ్చి మహాబ్రహ్మప్రళయవ్యవసాయంబునకు సురుత
రాఘాతసంప్లవోపక్రమంబునకు ననేకబ్రహ్మాండఖండవిఖండనవ్యాపారంబునకు
నే మేమ చాలుదు మను చున్నగణంబులందు గణముఖ్యులు దలతల మని వెడలి
విగుర్వించి. ౧౮౯

చ॥ జలజభవాండ మంతయును జర్ఝరితం బగుచుండ వ్రచ్చి ముక్
కులగిరు లుర్విమీఁద వడిఁ గూలఁగఁ ద్రోచి జగంబు లబ్ధులం
గలిపి మహాబ్ధు లన్నియును గంజభవాండము నేర కక్కడన్
వెలువడఁ జల్లి రౌద్రగతి విశ్వము నిప్పుడ సంహరించెదన్. ౧౯౦

క॥ పంకజనాభాద్యమరులఁ । బొంకం బఱఁ బట్టి తెత్తు భూరిబలమునం
గింక జగంబుల మ్రింగుదు । శంకర యేఁ గలుగ నీకుఁ జను నే యలుగన్.

గీ॥ ఎలుక మీఁది కోపమున ని ల్లేర్చునట్లు । దక్షుపై నగ్గి జగ మెల్ల నీక్షణంబ
సంహరింపంగఁ దలఁచుట సన్నె వానిఁ । బట్టి తెచ్చెద వడి నన్నుఁ బనుపు దేవ.

వ॥ అని యనేకప్రకారంబులం బ్రత్యేకంబ పలుకు చున్నగణాధిపతుల వారించి
గణాధీశ్వరుండు పరమేశ్వరున కభిముఖుండై ప్రళయకాలనీలఘనాఘనంబునుం
బోలె మహాధ్వని గర్జిల్లుచు. ౧౯౩

ఉత్సా॥ బలిమిఁ బట్టి కలిగి పాశుపతము దొడుగ నేఁటి క
గ్గలిక ములుక కాయ కెత్తుగల్లు గొనఁగ నేల ము
న్నెలుక వేఁట కుఱుమతిండి యేల నీకు నలుగఁగాఁ
దలము గలదె నన్నుఁ బనుపు దక్షుఁ బట్టి తెచ్చెదన్. ౧౯౪

వ॥ అస్మదీయజననీపరాభవం బింతయుం గావున నవశ్యంబుగ నిప్పని నాకు దయ సేయవలయు నని పన్నుపడం బలుకు చున్నగణాధీశ్వరు నైగువ మొఱంగి దక్షాధ్వరధ్వంసంబు చేసి దక్షుం బట్టి తెమ్మని పరమేశ్వరుండు నియమించిన మహాప్రసాదం బని వీడుకొనియె నంత నాక్షణంబ. ౧౯౪

ఉ॥ స్థూలసమున్నతాంగులు చతుర్భుజఫాలతటాక్షశూలకా
పాలకఠోరకార్ముకకృపాణధరుల్ ప్రమథాధినాథు లా
భీలపరాక్రముల్ నిఖిలభీకరమూర్తులు వచ్చి రోలిఁ గం
కాలసమేతులై భువనకంపముగా గణనాథుపాలికిన్. ౧౯౫

వ॥ తదవసరంబున దేవగణాధీశ్వరి నిఖిలశాకినీడాకినీకూశ్మాండయోగినీగణపరివృతయై.

క॥ లోకాలోకములోఁ గల। చీకటియెల్ల నొకపొడవు సేకొనియెనొ నా
నాకాశ మడరివచ్చె మ। హాకాళి మహాభయంకరాకారములోన్. ౧౯౬

వ॥ ఇట్లఖిలగణపరివృతుండై గణాధీశ్వరుం డతిరయంబున దక్షప్రజాపతిపైఁ బరిగొని దక్షాధ్వరావాసంబు గని కోపించి నిజగణంబులకుం జేయివీచిన నాక్షణంబ. ౧౯౭

సీ॥ క్రతురక్షకులఁ దాఁకి తునుకనిఁ బోఁదోలి చూపఱ విదిశలు సొరఁగ ద్రోలి।
వడి జన్నసాల వినాసంబుగొని వేదికలు గ్రొచ్చి గుండముల్ గవియఁ ద్రోఁచి।
ఋత్విగ్గణంబులఁ జత్వాలమున బాఁతి బలిమి సదస్యుల నలియమోఁది
యుపదక్షిమెడ నుల్పి యూపంబుతోఁ గట్టి పరిచారకులఁ బట్టి బారిసమరి
వహ్నిజిహ్వ కాండ్రవయ్యలుగాఁ గోసి పరిజనముల నేలపాలుచేసి
యాక్షణంబ ముట్టి దక్షాధ్వరం బశ్రమమునఁ జెఱిచి యార్చెఁ బ్రమథగణము.

ఉ॥ ఆయవసరసురాసురచయుం బురుసత్త్వుల నుగ్రులన్ మహా
కాయులఁ దగ్గణాధిపులఁ గాంచుచు మీఁదికిమీఁద జీవముల్

---

౧౯౬. చీకటి శబ్దమున నఱనున్నలేకున్నను లక్షణవేత్తలు పొరపడిరి. దశకుమారచరిత్రమున “మీకృష్ణగోరి భూరుహాసమీపము చేరితి......చీకటి రాత్రినాగహరిసింధురసూకరపుండరీకభ। ల్లూకపరీతకాననములో మిముసూఁటడి నిద్రసేసెదన్” దశ. ఆ. ౭. “ఏక సితాతపత్రముగ నేలును వీరనృపాలుఁడుత్తమ శ్లోకుడు.........చీకటియుంగలింగమును జిల్కసముద్రము.” శ్రీనాథుఁడు. “చీకటిగవిసినవిబుధానీకంబోడి.” నిర్వ. ఆ-౬. అఱనున్నయున్నట్లు ధూర్జటి, రామభద్రుఁడును బ్రాసములయందుఁ బ్రయోగించిరి. అదిప్రాచీనకవి సమ్మతముగాదు.

వోయిరి కొంద ఱోడిచెడిపోయిరి కొందఱు చుట్టుముట్టినం
గూయిడఁ జొచ్చి రుక్కుడఁగి కొంద ఱలందురి భీతచిత్తులై. ౨౦౧

వ॥ ఇట్లతిభీషణశాసను లైనగణాధీశ్వరులకవిదల కప్పగింపక సురవరు లతిసంభ్ర
మంబునం బరిమొగంబు దప్పం గనుకనిం జనునవసరంబున.  ౨౦౨

ఉ॥ వాహనంబు నెక్కి వచ్చి భయంబున వడ్డకై నేలఁ బడ్డవనజగర్భుఁ
గమిచికొని మరాళకము వాకైఁ జెందమ్మి గఱచికొని రయమునఁ బఱచినట్లు.

ఆ॥ గరుడినడుము మెదయుఁ గాలును గేలును। నిఱికికొనుచుఁ జక్రి వెఱచిపఱచె
ఘనగ్రజలను లోడలఁ గ్రమ్మంగ వర్షేంద్ర। చాపజలదభాతిఁ జదఁ బాదల. ()

ఆ॥ వేఁటకాఁడు ముట్టి వెనుకొనఁగా శ్వేతనగముచఱికిఁ దారునమిలివోలె
నభ్రగజముమీఁది కాసహస్రాక్షుండు ప్రాఁకెఁ పాకెఁ బ్రమథరాజి యార్వ. ౨౦౪

ఆ॥ ఇనుఁడుముట్టి చక్కి నెక్కంగమఱచి సంభ్రమముఁ బొంది పిఱుఁదఁ బ్రమథగణము
లార్వఁ బోలుమీఁద నడ్డంబుపడి యుప్పుపిట్టికపోలె వెఱచి పఱచె జముఁడు.

గీ॥ ఉరుతరార్భటుఁ డయ్యును నోడిపాఱె। వరుణుఁ డలుగు మనుడికై దేవాంగునోలె।
గలుము లెడనైన నేమియు నిలువ వనుట। దగుభయాతురుఁడై నోరఁ దడియులేక.

క॥ తనయెక్కినమానిసిఁ దా। ననయము నెక్కంగ మఱచి యాతనిఁ దనమూ
పున నిడికొని పఱచె భయం। బున ధనపతి తన్నుఁ బిఱుద భూతము లార్వన్.

వ॥ తదవసరంబునం బ్రజాపతినికరంబు దక్షప్రజాపతిం బరిమొగంబు దప్పించుకొని
బ్రహ్మాండఖండంబున కరిగిన గణాధీశ్వరు లెల్లకడలను శోధించి దక్షుం డున్నప
ట్టెప్పట్లను గానక కాందిశీకులై కనుకనిం జని సకలభువనాధీశ్వరుపైఁ బరిగొని.

క॥ ఎల విచ్చినట్లు జగముల। కల లెప్పను గలయు నొక్కకవిఁ జని కోలా
హలముగ సురాసురోరగ। కులముల నాగణము ముంచికొని వచ్చివడిన్. ౨౧౦

చ॥ మునిమనుజాసురాహిసురముఖ్యుల వీఁపులతోళు లెత్తఁగా
ముట్టుగఁ గొట్టి మోఁదియును ముంచిపెట్టుబు గట్టి కొట్టియున్

జనఁ బెడకేలు గట్టియును జర్మపటంబులు డిగ్గనొల్చియున్
జెనసి మసంగి యూరసముసేసిరి తత్ప్రమథాధినాయకుల్. ౨౧౧

చ॥ ఖలుఁ డని వజ్రిచేయి విఱుగంగ వడిం బడమోఁది రత్తి దో
ర్బలమున దాఁకె యక్షపతుల పందలయొత్తిరి తద్గణాధిపుల్
కలుషముతోడ ముట్టి భగుక న్నొక ద్రచ్చనపుచ్చి రుగ్రులై
బలువిడిఁ బట్టి పూషుమునిపండులు డుల్లఁగ వ్రేసి రీసునన్. ౨౧౨

స్ర॥ కోపోద్రేకంబునం జేకొన కజు హరితోఁగూడ బంధించె దేవా
శాపాలేంద్రాదులం దక్షణము పరిభవాసక్తులం జేసి దక్షుం
బాపాచారుం బదాఘాతదల కరుగుతద్విప్రబంధున్ దురాత్మున్
జూపుం డెచ్చోట నంచున్ సురలను బ్రమథుల్ చుట్టి దండించి రల్కన్. ౨౧౩

వ॥ తదవసరంబున శివద్రోహుం డైనదక్షుం డనునిద్దురాత్మునకై మహోగ్రాక్షగ
ణాగ్రణులచే నిగ్రహంబువడు టేమిప్పని యుని సురమునిజనంబు లాందోళింపం
గడఁగ. ౨౧౪

క॥ కనుగిట్టి చూపువారును । గనుమతి చెడి పట్టఁజూపఁ గడఁగెడువారుం
గని కడపిపుచ్చువారును । గనుమఱుపడువారుఁ బరులఁ గనుఁగొనువారున్. ౨౧౫

వ॥ తదవసరంబున నతిభయభ్రాంతుండై కన్నవారలకు మ్రొక్కుచు మ్రొక్కుచు లోఁ
గుచు దాఁగుచు గోమేధికసదనంబులో బెదరి చూచుచున్న దక్షునిం గని గ
ణముఖ్యు లెత్తింగి పట్టికొని. ౨౧౬

ఉ॥ వీండె ఖలుండు దక్షుఁ డనువీఁడె పాఱుఁడు వీఁడు సర్వవ
ఖ్యుం జెడనేయకుండు శివదూషకు నాలుకగోసి యుప్పు నిం
పుండుఁ ద్రపుద్రవ మ్మొడల బూయుఁడు లోహము గాఁచి నోరఁ బో
యుండు దురాత్మచర్మపట మొల్వుఁడు కన్నులు మీఁటుఁ డుక్కఱన్. ౨౧౭

వ॥ అని యనేకప్రకారంబులం బలుకుచు నారకోచితదండంబుల దండించి నిజాధీశ్వ
రుం డైనగణాధీశ్వరున కొప్పించి తన్నియోగంబున. ౨౧౮

ఆ॥ ప్రమథగణము దక్షుఁ బడఁగొట్టి కట్టుచుఁ । గాలుచేయుఁ బడిరెడు గావడించి
మనుష్యగింబు గట్టికొనువచ్చెలు వేఁట । కాఱుబోలె వచ్చి కనిరి శంభు. ౨౧౯

వ॥ తదవసరంబున. ౨౨౦

సీ॥ ఉరుశోకరసవార్ధి యుప్పొంగె నన మీన ఘర్మాశ్రుజలములు గడలుకొనఁగఁ
గడిసన్నతమ్మిఁ బోఁ గడరెనో యన దీనవదనంబుపై నైలుల్ నెదరితూల
ముఖలక్ష్మి భీతిఁ దమోవీధిఁ జొచ్చె నాఁ జాలియవిరివేణి వ్రేలుచుండఁ
గవవాసి యలఁదుఱ్ఱులహంసరుతముసా నాక్రందనారావ మతిశయిల్లఁ
దొడరు నడుగు లిడుచు దుఃఖాతిశయమున దల్లడిల్లుచున్న దక్షునర్మ
పత్ని వచ్చి పురుషభిక్షంబు వేఁడుచుఁ జాలదవుల నభవు మ్రోలఁ బడియె. ౨౨౧

వ॥ ఇట్లనాథవృత్తి ననన్యశరణ్యయై శరణువేఁడుదక్షాంగనం గని కరుణాకరుం డైన
పరమేశ్వరుండు కారుణ్యదృష్టిం జూచినక న్నెఱింగి. ౨౨౨

చ॥ హరకమలాసనాదు లభయం బభయంబు భయాతురార్తిసం
హర కరుణాత్మ విశ్వభువనాధిప మా కని చక్కఁజాగి ని
ర్జరపతి మ్రొక్కి యున్నఁ గని శంకరుఁ డంతన తద్దయారసా
భరితవిశాలనేత్రశతపత్రదళంబులఁ గప్పె నందఱన్. ౨౨౩

వ॥ ఇట్లు పరమేశ్వరదయావలోకనామృతరసప్రవాహోపగతభయసంతాపహృదయు
లైనసురవరులం దఖిలసురజ్యేష్ఠుం డైనసురజ్యేష్ఠుండు కరకమలముకుళవిన్యస్త
మస్తకుండై సమస్తవేదస్తుతులం బ్రస్తుతించి చతుర్ముఖుండు పంచముఖున కభిము
ఖుండై. ౨౨౪

చ॥ తనరఁ బ్రియాతిదక్షుఁ డగుదక్షుఁడు త్ర్యక్షమవల్లభుండు స
న్మునితతి ఋత్విజుల్ సురసమూహ సదస్యులు తత్ఫలంబు లిం
దనిశము నిచ్చు నీ వడఁచి తప్పె మఖం బిది కర్తభక్తిమైఁ
దనరనియుక్తి మైఁ దుది దొసభిచారము గాక పోవునే. ౨౨౫

వ॥ అదియునుంగాక సకలభువనస్వామియైన నిన్నుం గులస్వామియని తలంపక సంబంధ
బంధుకృత్యంబున నితరజనసామాన్యుం డని యెల్లిదించి. ౨౨౬

క॥ బంధుఁడ వని నిన్నుఁ దలఁచి స బంధురఁ డయి పడుట దనకుఁ బాడియె మఱి ని
ర్బంధుఁ డగునిన్నుఁ గనియు స బంధుం డై శిష్టుఁ డనికి పాడియె దేవా

వ॥ అనిన చతురాననచతురోక్తులకుం బరమేశ్వరుండు ప్రహృష్టమనస్కుండై దక్షు నీక్షించి దాక్షాయణిపై ప్రణయభావాకలితహృదయుండై యున్నగంగాధరు నింగితం బెఱింగి పద్మజుం డాని వెండియు నిట్లనియె ౨౨౮

క॥ ఆ నెపమున ద్రోహమునకు। వానిన పాండగని యతనివంశం బెల్లన్
గానుపునఁ బెట్టి యార్చిన। నేనియుఁ జాల దిది పెద్దయే ధృతికున్. ౨౨౯

ఆ॥ ఇంతద్రోహుఁ డయ్యు నితఁడు వధార్హుఁడే యభవ నీవు దీని నవధరింపు
మవని బ్రాహ్మణో నహంతవ్య యనుపలు కీవు నిలుపకున్న నేల తప్పు. ౨౩౦

వ॥ అని పరమేశ్వరునమమతంబునం బ్రజాపతి దక్షప్రజాపతిబంధమోక్షంబు సేసి యమృతాత్మకు శ్రీపాదంబులపైఁ బెట్టిన దదీయస్పర్శనంబున దక్షుండు తత్క్షణంబ సచేతనుండై భక్త్యావేశంబునం బ్రణుతింప నభిముఖుండై. ౨౩౧

లయగ్రాహి॥ ఫాలతలవిస్ఫురితలోలతరభాసురవిశాలభయదాసురకరాళనయనాగ్ని
జ్వాల లోకా పింగళజటాళియుకో నా బెరసి శూలి దివి భూషణచయాళులితదిగ్ఘ
వ్యాళనికరంబాకో కరాళియుకో నాఁ దనరి క్రాల వరనృత్యవరలోలుఁ డగుశ్రీకం
కాలధరు నుజ్జ్వలకపాలధరు సన్నిశితశూలధరు నీశ్వరు దయాళు నుతియింతున్.

లయ॥ ఉర్వర సలింపఁ గులపర్వతచయం బదర బర్వి భువి నంబునిధు లౌర్వశిఖియాడం।
బూర్వసురనాగనురపూర్వదిగధీశయదువార్విభుధనేశ్వరులగర్వము లడంగన్।
సర్వగుణముఖ్యులును సర్వగుణభూతములు నార్వ నహిభూషణములోర్వ జిశలన్ నిం
ధర్వతతి వాడఁగ నపూర్వనటనాదియగుసర్వగతు సర్వమయు శర్వు నుతియింతున్.()

లయ॥ తాలరుతిగీతిరుతి మేలితతి వాద్యరుతిసాలరసవంతమయి యోలి నులియంబ్రో
త్తాలగతి మెట్టుచునుఁ గేల చరు లిచ్చుచును సాలి యనురాగమున గ్రాలుచుసుఖాబ్ధిం
దేలుచును మేమఱచి వ్రాలుచును గెత్తుచును రోలగతి నేత్రభుజచాలనలతోఁ బ్రే
తాలయమునందు సుఖలీల నెఱసంజ ననునోలగతి వాడుశివు శూలి నుతియింతున్ ()

లయహారిణి॥ కఱగిళము ఘనఘనము లెఱుఁగనఁగనుత్రికలును గఱడియలు
గ్రిప్పఎలును గిఱిడియలు బెల్లై యుఱుము లన వడిఁజెలఁగఁ గొఱ

నెలయున్నదనరుచులు మెఱుఁగులన దశదిశలఁ మెఱవఁ దళ్లమీఁదన్ । నఖ
లు సురనది దొలఁకి నెఱిఁజినుకులను గురియఁ దఱిమికొని తొలుమొగులు
తఱియనఁగ నృత్యం। బొఱి నమరులలితగతి మెఱయుశివుఁ డజుఁ డమరుఁ
డుఱుఫలము లొసఁగు నని యొల్గి నుతియింతుర్. ౨౩౫

లయ ॥ కరనికర ముకురువిటపవరము లనఁ గరతలము లరుణరుచిఁ దలిరులన గరజములు
పుష్పా। కర మనఁగ వనరుహజహరిదనుజమునిమనుజసురగగనచర
భుజగగరుడగణయక్షే । శ్వరుల కతిదము నొసఁగువరఫలము
లనిశమును భరితమయి మధుసమయసురవరమహీజ। స్ఫురణ కెనయనఁ
దనరువరదు హితనటనరతు బరమపరుఁ బరమగురుఁబరము నుతియింతుర్.

క ॥ సురపానభోంతకాసుర। వరుణానిలధనదరుద్రవందితచరణున్
ధరణిజలవహ్నిమరుదం। బరరవిసోమాత్మమూర్తిఁ బరము నుతింతుర్ ౨౩౬

వ ॥ అనియనేకప్రకారంబులం బరమభక్తియుక్తిం బ్రస్తుతింప దక్షునకుం ద్ర్యక్షుండు
ప్రత్యక్షుంబై తదీయాధ్వరఫలంబుసఫలంబుగాఁ బ్రసాదించి దక్షుం బ్రజాపతి
నియోగంబునంద నియోగించి. ౨౩౭

ఉ ॥ ధర్మచరిత్రతాకలితతత్త్వమయాధికదీప్తిదీపికా
నిర్మలినప్రభాపటలనిర్గళితాఖిలలోకపూరితో
త్కర్మతమిస్రుఁ డర్థిజనకల్పమహీరుహకల్పుఁ డూర్జితాం
తర్ముఖముఖ్యుఁ డత్యధికదర్పకదర్పహరుండు సన్మతిన్. ౨౩౯

క ॥ ఇష్టానిష్టవిముక్తుఁ డ। భీష్టఫలప్రదుఁడు సన్మునీంద్రారాధ్యుం
డష్టతనుపరమతనుమయుఁ। డష్టార్ధముఖాన్వయాబ్జహరితేజమునన్. ౨౪౦

చ ॥ భవమరణాతురాంబునిధిపారుఁడు ఘోరమహోగ్రసత్వసం
భవగతసాగరోత్తరణబంధురభూచరసేతుభూతస
త్త్వవిమలితాత్మతత్త్వపదపారగుఁ డాదిమునీశ్వరుండు స
త్కవిగమకప్రశంసితుఁ డకారణమిత్రుఁడు పాత్రుఁ డిమ్మహిన్. ౨౪౧

క॥ రమణీరమణీయసురూ। పసమయాంగజశస్త్రివజ్రపంజరనిభస
ద్విమలశివయోగతత్పరుఁ। డమలచరిత్రుండు మల్లికార్జునుఁ డెలమిన్. ౨౪౫

మా॥ విశదయశుఁడు ముక్తోద్వేగుఁ డస్పృష్టరాగుం। డశుభగతినివృత్తుం
డార్యుఁ డాగ్యోఘవర్యుం। డశనిధరవిలాసాయత్తుఁ డధ్యాత్మచిత్తుం।
డిశరకమలినీపూర్ణేందు ండానందుఁ డెందున్. ౨౪౬

గద్యము॥ ఇది శ్రీమజ్జంగమమల్లికార్జునదేవదివ్యశ్రీపాదపంకజభ్రమరాయమాణకవిరాజ
శిఖామణినన్నెచోడదేవప్రణీతం బైనకుమారసంభవం బనుకథయందు ద్వితీయాశ్వాసము.



శ్రీ

# కుమారసంభవము.

## తృతీయాశ్వాసము.

శ్రీకంధరపరతత్త్వా । లోకనతత్త్వరుఁడు నిశ్చలుం డఖిలసుధీ
లోకానందితకల్పా । నోకహుఁ డగుమల్లికార్జునుండు నెగడ్తన్. ౨౮౪

వ॥ సకలభువనాధీశ్వరుం డైనపరమేశ్వరుండు హరిపరమేష్ఠిపురందరాద్యఖిలసుర
వరపరివృతుం డై నిఖిలకైలాసాచలప్రభావవిజితరజతశిఖరిశిఖరమణిరమ్యహర్మ్యతలా
లంకృతోత్తుంగసింహాసనాసీనుండై భృంగిరిటపరిహాసపేశలాలాపహాస్యాలాప
వ్యాకులితలలితహాస్యరసరసాయనపూరితాస్థానమందిరుండై పరమానందంబున
నుండెనంత నక్కడ. ౨౮౫

సీ॥ రోహిణాచల మమరూఢిగా కం దింత మహనీయరత్నసామగ్రి గలదె
వింధ్యాద్రితో సురల్ విరస మెత్తిరిగాక గ్రహచక్ర మద్రి యింత గడచియున్నె
హాటకరుచియుకా కమరేంద్రుగిరి కింత పరమౌషధీప్రభాభాతి యెత్తె
హరుఁ డర్థపతిచెల్మి కందుండెఁ గా కింత రమ్యమే వసియింప రజతశైలద్రి।
మజ్జుఁడు దనవిద్య నెఱ్ఱయఁ గుఱ్ఱలాండ్లు। వడనేఁ గా కుర్వి దాల్పంగ భరమె
కనఁగ నగచక్రవర్తి మాహాత్మ్యవైభ । వాలయం బగుపేర్మి హిమాలయంబు.

వ॥ సురవరవాహినీధరుఁడు శుభ్రశరీరవిభాసి నీలకం
ధరపరిశోభితుండు గుణధాముఁడు సంగతపుండు భూధరా
భరణుఁ డుమాసమన్వితుఁ డపారవిభూతిసమేతుఁడై మహే
శ్వరుఁడునుబోలె నొప్పు హిమవంతుఁ డనంతమహత్త్వసంపదన్. ౨౮౬

సీ॥ హేమాద్రివిస్తార మెంత సప్తాశ్వుండు నిచ్చలు నోరెల వచ్చునట్టె
తారాచలముప్రేకఁదన మెంత వింశతిబాహునిచే నెత్తువడియెనట్టె
పెరిఁగినవింధ్యాద్రి పెం పెంత కలశుఁ డెడగాల మెట్టిన నడఁగెనట్టె
నెగడుమంథరగిరినిలు పెంత కఱభోగి దీర్చినఁ జిట్లుఁ దిరిగెనట్టె
యనఁగ విస్తారమున ప్రేక్షఁదనమునందుఁ. జెంపునందును నిలుపున బెఱనగముల
నుఱక తనలోన నవ్వుచు నున్నకరణి వెలుఁగు శీతాద్రి ప్రాలేయవిమలరుచుల.

చ ॥ సురపురరమ్యహర్మ్యమణిశుభ్రతలాగ్రవిలాసహాసినులై
యురుకనకాగ్రశృంగమున నొంచిన తారకపఙ్క్తి శీతభూ
ధరపతి చూడఁ జూడ విదితం బగు నిర్మలినాంగభాతితో
నురగఫణాగ్రరత్నరుచిరోగ్రకపర్దధరేశ్వరాకృతిన్. ౨౪౯

గీ ॥ శీతగిరిమీఁద మదకరుల్ శీత్కరించు। నెలుఁగు ఘనారవ మని యెసఁగియాడు
నెమ్మి పదువులు గడునొప్పు నగవిభునకు। బలసి పట్టినపింఛాతపత్రభాతి. ౨౫౦

గీ ॥ శిశిరభూమిధరోద్దామశిఖరమణులఁ। గదిసి తారాగణంబులు గలసియున్న
మణిగణాన్వేషణంబు కీడుమణులు నావి। పాయఁ ద్రోతు రందవి గనుపట్టుకున్న.

గీ ॥ సన్నుతంబుగ నాహిమవన్నగంబు। గాంచనాద్రీంద్రు మెచ్చదు గంధురేని
కనకరుచి యేల యని చంపకప్రసూన। పరిమళాకీర్ణసౌవర్ణభాతి మిగిలి. ౨౫౨

గీ ॥ విలసితోత్తుంగశశికాంతశిలలఁ గదిసి। యరుగు శశిఁ గని శిలలెల్లఁ గరఁగి పెరిగి
తెరలి పట్టెంచువట్లొడిఁ దేలిపాఱు। నుడుగణేశుండు వెండి పేరోడవోలె. ౨౫౩

గీ ॥ సలలితం బగు శశికాంతశిలలనుచుబు। నింద్రనీలోపలద్యుతు లైనసి వెడల
పక్షులెల్ల సితాసితపక్షయుగళ। సహితమై మాడ నొప్పు మాసములవోలె. ౨౫౪

ఆ ॥ నెగసి సుడిసి తావి మిగులుచుఁ దరులతాకలితపుష్పరజము గాలిఁ దూలి
పొలుచు నగవిభునకుఁ బొంపట్టు చేల నాకసము నేలుకట్టు గట్టినట్లు. ౨౫౫

గీ ॥ పాయక గిరితటమూనన్న మేయుచుండు। నున్నతద్విరదేంద్రంబు లొప్పఁ జూడ
బర్వతాధీశుఁ డగుట నప్పర్వతంబు। బలసి కులగిరుల్ కొలువున్న భంగివోలె.

సీ ॥ సవిలాసగతిఁ గ్రాలుజంగమలతలతో నడపాడు నురగకన్యకల చెలువు
వెలుఁగొందు మణిపుత్రికల గెడ విహరించు వరనిధానాధిదేవతల చెన్ను
సానుసంగతమేఘసౌదామనులఁ గూడి ప్రోలపాడు ఖచరాంగనల బెడంగు
మందారచందననందనసంగతి నెలసిన వేల్పుమితలనయంబు
మనసు లురులుకొల్ప మండనాంగానోకహములఁ బొంది చూచు నమరసిద్ధ
చారణాదివరకుమారాంగభూషణద్యుతుల హిమనగేంద్ర మతిశయిల్లు. ౨౫౬

చ ॥ అరుదుగఁ జంద్రికాంతినిలయంబులలో విహరింతు రర్థిఁ దా
రరయుగి నెల్లవారికి బయల్పడితోఁపఁగ నందకొంద ఱ

చ్చెరువుగ నింద్రనీలరుచి చీకటిలోఁ గమియింతు రొప్పున
త్త్యురుతరలీలతో బయల నుండియు నెవ్వరుఁ గానకుండఁగన్. గా॥ ౫॥ ౨౫౮

మ॥ సరసచ్ఛత్రమహీరుహావళి నిజచ్ఛత్రాళిగా వచ్చు ఖే
చరరాజన్యులు బాలపల్లవలసచ్ఛత్రావళిం బొల్చునా
మరుఁ గ్రీడింతురు లీల జంగమలతామధ్యంబునం గ్రాలుత
ద్వరకాంతల్ వనలక్ష్మి చెన్నలరు నావర్తింతు రం దుమ్మలన్. ౨౫౯

ఉ॥ కలనుం గిన్నరగీతిఁ గూడ మృదురేఖం జాదుమత్తాళిసం
కులముల్ గింపురుషాంగనాతతి యెలుంగుల్ వించు భావించు మా
తెలుఁగుల్ నింపుగ నిచ్చకోవిలలు దేవేంద్రాంగనామంజుభా
షలతోడం దగు మాఱుమాట లెలమిన్ సంధించుఁ జిల్కల్ మొగిన్. ౨౬౦

సీ॥ ఉరుతమఃపటలంబు నుక్కపట్టెడి యని నెఱి నిగ్గు గొను నింద్రనీలరుచులుఁ
బున్నమవెన్నెలఁ బోదిపట్టెడి యని కాంతంబు లగు శశికాంతరుచులు
వెలుఁగొందు రేయెండ వీడుఁబట్టెడి యని రాజితం బగు పద్మరాగరుచులుఁ
గ్రొక్కారుమెఱుఁగులయిక్కపట్టెడి యని హారముక్తాహారతరలరుచులు
ప్రచురమాధవోద్యానంబు పసిమి కెల్ల నాటపట్టెడి యని గరుడాండరుచులు
మెచ్చి చూచుచు వేమఱుఁ బిచ్చలింతు రమరకన్యక లతులహిమాచలమున.

వ॥ అని వర్ణింపందగిన వర్ణనలం గడచి సకలసుగుణమణిగణంబులు నిజఘనమణిగణం
బులతో బన్నసరంబులై వెలుంగు నజాండకరండపూరితకర్పూరపాలీశలాకయుం

౨౫౯. ఛత్రవృక్షమును గుఱించి: "ఛత్రివద్దండపత్రాయా నాలినీచానచోన్న
తా। సుక్షీరా ఛత్రిణీనామా రసబంధకరీమతా" అని మంథానభైరవతంత్రము. ఇది
౬౪ దివ్యౌషధులలో నొకటి "ఛత్రిణీ త్రివిధా ప్రోక్తా వృక్షకందలతాత్మికా। రస
బంధే ఛత్రవృక్షో లతాకందే రసాయనే" ఖండకాపాలికతంత్రము.

౨౬౧. రేయెండ = ఈ రెండలు, బాలాతపము. రేయెండయను పదమునకు
వెన్నెలయనునర్థమున నాకుఁ బ్రామాణిక కవిప్రయోగములు చిక్కవయ్యె. కాశీఖండ
క..స, "ఒకదీవిఁ బోలు సంజ...నుదయు ౦చు మఱుసంజ యొండుదీవి। నొక దీవినిండు
చంద్రికలు మిన్నులుప్రాఁకు నొక దీవి రేయెండ యుబ్బి కాయు." ఆ-౧. లోనున్నది.
ఇందు రేయెండ నిండుచంద్రికకు విరోధముగా నాతపార్థమున నుపయోగింపఁబడినది.
ఈరు అనుపదము వర్ణప్లుతియను విధిచే, రే। యయియగును. ఎఁడీగ। లేఁడీగ.
ఇత్యాదులు. ఈ రెండ-రేయెండ రూపాంతరములు.

బోలె దేజరిల్లుప్రాలేయకులక్ష్మాలచక్రవర్తి నిఖిలస్త్రీరత్నం బైనమేనక నిజాగ్ర
మహిషిం గాఁ బరమసుఖలీలఁ బ్రవర్తిల్లుచుండు నంతఁ బరమేష్ఠివరప్రసాదంబున.

క॥ మేనకకు నాహిమాద్రికి। మైనాకనగంబు పుట్టె మణికనకమయా
భానూనభాసహాసిత। భానుద్యుతివిదితదివిజపతిగిరిపేర్మిన్. ౨౬౩

వ॥ ఇట్లుదయించినమైనాకనగంబు కులిశకులిశపాతభీతిం బయోనిధినిమగ్నం బైన
నపగతపుత్రావలోకనసుఖతత్పరులై చింతించి. ౨౬౪

క॥ వారిరువురు సద్విధిశ। క్త్యారాధన సేసి రతిశయస్థిరభక్తిం
గోరిక వదలక తమకడు। పార సతీదేవి కూతురై జన్మింపన్. ౨౬౫

వ॥ ఇట్లు పరమభక్తియుక్తి నారాధించినం గరుణించి నిజదేహవిదాహకరం బైన
కోపానలంబునకుం బరమేశ్వరువియోగానలంబునకు శిశిరోపచారంబు సేయం
దలంచినదియునుంబోలె హిమవంతంబునకుం జనుదెంచి దాక్షాయణి ప్రత్యక్షం
బై వారికోరినవరంబు దయసేసి పరముదేహార్ధంబు మెయిమెయిఁ గయికొనం
దలంచి పరమపవిత్రక్షేత్రం బైనమేనకాదేవిగర్భంబునం దవతరించె నంత మేన
కకుం గ్రమక్రమంబున. ౨౬౬

ఉ॥ తోరము లయ్యెఁ జన్నుఁగవతోన తొడల్ తనుకాంతితోన తె
ల్లారె విలోకనంబులుఁ గుచాగ్రతలంబులతోన యారు గ
ప్పారెఁ గచంబుతోన వలు లల్లన డిగ్గఁ బడెం దొడం గె శృం
గారముతోన పొల్పడరె గర్భవిలాసము మందహాసమున్. ౨౬౭

ఉ॥ ఆథవళాయతాక్షి విషమాక్షు సదాశివు నిచ్చ మెచ్చ నా
రాధన సేయఁగోరు నుడురాజశిఖామణిఁ జూడఁ దొరభూ
మీధర మెక్కఁగోరు నెడ మేనక మానక భక్తియుక్తిగం
గాధరుఁ గొల్వఁగోరు మది గౌరమనంబున గోర్కి గూడఁగాన్. ౨౬౮

సీ॥ పలుకొత్తి మిన్నేటితరఁగల గ్రమ్ముక్రొన్నురువులఁ గురులపై విరులఁ బెనుప
మెఱుఁగుల గ్రిక్కానుకొటనెల గేతక్కి దలములతో వేణి నెలవుకొలుపఁ
జెలువొందుపులితోలుఁ జిత్రితాంబరవస్తుకాంచిదామకముతోఁ గటి నమర్పఁ
దలతల వెలుఁగువేఁపలలరత్నము లొప్ప నహినాథమణిహారయష్టితోడఁ।

గదియ సురమునం దొడఁగోరుగర్భపంజ। రమున వసియించియును నిజరమణుఁడైన
యాశు నర్ధాంగ మెక్కటి యెక్కనెత్తు। నగజ కోర్కులఁ బెనఁగి మేనకయు నెలమి.

క॥ తరుణవిధూదయమునకుం। బరిపూర్ణం బగుసుధాబ్ధిపయస్సున నాసుం।
దరికిఁ గ్రమంబున గర్భము పరిపూర్ణంబయ్యె నిష్టఫలసంపదతోన్. ౨౨౦

వ॥ తదవసరంబున శుభముహూర్తంబున. ౨౨౧

సీ॥ వేలావనమునందు విలసిల్లు విద్రుమవల్లిక యుదయించు వడువువోలెఁ
బూర్వదిక్సతి కతిస్ఫురణతో నుతసుధాకరరేఖ యుదయించు కరణివోలెఁ
ద్రిదివంబునందు సమ్మద మొందఁ గల్పలతాంకుర ముదయించునట్లువోలెఁ
దేవతానదికి శోభావహమ్ముగ హేమరాజీవ ముదయించు రమణవోలె
వరవిదూరభూమి వైడూర్య ముదయించు తెఱఁగువోలె దిశలు తేజరిల్ల
మానినీలలామ మేనక కుదయించె రాజవదన శైలరాజకన్య. ౨౨౨

మ॥ వివిధామోదవిమిశ్రితానిల మొగిన్ వీచెన్ మరుద్దుందుభుల్
దివి రేఁగెన్ భోరనఁ బుష్పవృష్టి గురిసెన్ దేవాంగనాగాన ను
త్సవలీలన్ వినిచెన్ సమస్తభువనోత్సాహంబు సంధిల్లె ది
గ్వివరంబుల్ వెలిఁగెన్ నిధుల్ దెఱచె నుర్విం గౌంజ స్మించినన్. ౨౨౩

వ॥ అంత హిమవంతుం డంతఃపురసహితం బనంతసంతోషరసాపూరితాంతరంగుం
డగుచు నిజోత్సవంబుతోన పురోత్సవంబు నొనర్చుచు దీనానాథవిద్వజ్జనంబుల
నపారవసుధారాసారంబులం దేల్చుచు నమందానందుం డగుచు నుండె నంతం
బార్వతి శరచ్చంద్రరేఖయుంబోలె సకలజననయనేందీవరానందకరంబై వెలుం
గుచుం గ్రమక్రమంబున. ౨౨౪

సీ॥ పరమేశుమన ముద్దపరి ముట్టి సాధింప నెత్తినగతిఁ దలయెత్తఁ దొడఁగె
హరునూరుపీఠంబునం దుండు వెర విట్టి దనుగతి గూర్చుండ ననువు వడసెఁ
నొకధాత్రి తను దాల్ప నోపదన్ గతి ధాత్రిపై నిజధాత్రి చేపట్టి నిలిచెఁ
గలహంసకులమందగమనంబునయ మిట్టి దనిచూపుగతి నడపాడఁ దొడఁగె

---

౨౨౫. నడపాడ నడువ = „ నడపాడ నేర్చిన నవకంపునునుదీఁగె" కేయూర
బాహుచరిత్ర. ౩౪.

రాజకీరములకు రసవంతముగఁ బల్కుప్రాసాల్లపు దెల్పుకరణిఁ బలుకఁగ నెచె
హిమనగేంద్రునింట నీడితైశ్వర్యంబు పెరుగునట్లుగ గజ పెరుఁగ దొడఁగె. ౨౩

మ॥ స్ఫురదాలోకనదీ ప్రతలం గణముఁ బొల్పొందఁగాఁ జూచుచున్
దరహాసద్యుతు లాననాంబుజముపైఁ దళ్కొత్తఁగా నవ్వుచున్
జరణాంభోరుహరాగదీధితు లిలం సంధిల్లఁ దట్టాడు న
గ్గిరిరాజాత్మజ తల్లిదండ్రు లను రాగిల్లన్ మదిన్ దాదితోన్. ౨౪

క॥ గిరిసుత దొలుపలుకుల సు। స్వర మొదవఁగ నోంనమ శ్శివాయ సదాస్మ
ద్వరదాయ నమః శంకర। శరణు మహాదేవ నీవ శర ణనఁజొచ్చెన్. ౨౫

వ॥ మఱియు శైశవక్రీడావినోదంబులయందు. ౨౬

చ॥ తరుణులు చిల్కబొమ్మలును దంతపుబొమ్మలు మేలిగాజుబ
మ్మరులును మ్రానిబొమ్మికలు సగ్గడ నోలిన పెట్టి లీల జో
కురబొమరిండ్లఁ జేయు నగుగూళ్ళను। వండుచు బొమ్మపెండ్లి మా
సరముగఁ జేసి యాడ నగజాత శివార్చనసేయు నయ్యెడన్. ౨౭

వ॥ ఆసుకుమారి కౌమారంబునందు. ౨౮

సీ॥ హరుమ్రోల సద్భక్తి నాడుచోఁటన నాట్యవిషయమ్ము లన్నియు వెలయఁగ నబె
లీల నీశ్వరుసంకమాలిక లాడుచో గీతభేదంబులరీతు లెఱఁగె
శివురూపు పల్లఱుఁ జిత్రించి చూచునో వినుతంబుగాఁ జిత్రవిద్యవడసె
శర్వమౌళిఁ జిత్రపూజలు సేయుచోఁటఁ బత్రచ్ఛేదకుసుమబంధముల నేర్చె
మఱియు నఖిలలోకమాన్యంబు లగువిద్య లెల్ల నివ్విధమున నెసకమెసఁగ
నభ్యసించె నీశ్వరార్చనాజలమునహరుడు గురుఁడుగాఁగ నగతనూజ. ౨౯

వ॥ మఱియుం గౌమారానంతరంబున లేఁదీగెకుం గవ్వం బెక్కునట్లు పుష్పా
దావి వొందునట్లు చిత్రరూపంబునకు మెఱుం గెక్కువిధంబున నిఖిలజనమనో
రామం బగుచు. ౩౦

చ॥ మల్లెఁపఁగ నున్నకల్పలత మన్మథునారి నమర్చనున్న తో
మలలరపుష్పబాణ మహిమద్యుతిఁ జూడఁగ నున్నపస్మరు

ట్క్రశీ మలరంగ నున్న మధుమంజరి నా మదభృంగితాంగద్యో
హాలరుచి నొప్పె గౌరి నవయౌవనసంగమలీల దాయఁగాన్. ౨౮౩

వ॥ ఇట్లభినవమధుసంగతిం దనరుప్రద్యుమ్ను నుద్యానవనంబునుం బోనియౌవనమదా
భ్యుదయంబున. ౨౮౪

క॥ మెలుపును ఁగేపును సుస్థితిఁ । దలిరులయుం దేని లేదు తమ కుమవలనన్
నిలుకడయగు నని తత్పద । తలనుఁగాని నెలసెననఁ బాదతలము వ్రాల్పన్. ౨౮౫

క॥ సరసప్రవాళములపై । సరసిజరాగమణు లొలి సంధిల్లెనొ నుం
దరరాగలతాకందాం । కురములొ నా నుంగుటములు కోమలి కమరున్. ౨౮౬

క॥ అరుణాంబుజదళములలోఁ బరగు తటిత్త్విషలు నించి పై నభ్రకముల్
పొర లెత్తి కదియమూసిన । కరణి నుమాదేవిపదనఖంబులు వెలుఁగున్. ౨౮౭

క॥ తననీచయోని పడుటే । లని సకళత్రమును నుమపదారాధన కొం
దినవిష్ణుకమఠరూపము । యనఁ దగి మీఁగాళ్లు లగజ కందం బొందున్. ౨౮౮

క॥ సిందూరపిండములొ మరు । కందుకములొ సత్ప్రవాళకఫలంబులొ నా
నందము లై రాగలతా । కందము లన మడమ లచలకన్యక కొప్పున్. ౨౮౯

క॥ అతనుం డోప్రనిశివు వశ । గతుఁ జేసి భవాని మదనుకపదొన లతిలోకో
న్నతి నాఁచికొనియెనొ యను । గతిఁ జిఱుదొడ లమరు ప్రీహిగర్భాభములై. ()

క॥ స్మరమందిరమ్ము శోభా । కరముగ మెఱుఁగారుపసిఁడికంబము లనఁగాఁ
గర మొప్పు నగతనూజకుఁ । గరభోరుల వొలుచు మదనకరికరలీలన్. ౨౯౧

క॥ గురుకుచవహనభరంబునఁ । బాఁరిఁబ్రారిఁ బేదకప్పు నఱిగిపోఁ బోయిన ద
ద్భరవహనమునకు భరపడు కరణిం జఘనంబు సతికి ఘనమై యమరున్.

క॥ కనుఁగొని ఘూశ్వరుద్భ్రగుచు । లను విప్పులవహిత్రముల నపాంగజనార్థిం
జనఁ దిగిచి ముంచునుడి యది । యనఁ దగి యావర్తనాభి యద్రిజ కొప్పున్.

క॥ మారుమఘువేది మధ్యామొ । యారతియద్దంబు పిడియొ యన నెంతయుఁ బొ
ల్పారఁగడు నలికమై సుకు । మారికి మధ్యంబు సింహమధ్యము నోలెన్. ౨౯౪

క॥ ఉదరము నుచందనంబున । హృదయాంభోజాలనాళ మేర్పడి తనకో
ప్పొదవి వెలిఁ దోఁచెనో యన । సుదతికి నూఁగారుదీగె సుందర మయ్యెన్.

క॥ పారఁగొను దలము జవ్వన । సిరిగ్గుచముల కెక్క నడువఁ జేసినకాంత
స్వరసోపానములన్ను మ । త్తరఁగలు దగు నంగజాబ్ధితరఁగలు వోలెన్. ౨౯౬

క॥ ఆంధ్రీస్తనాపహాసులు । సంధృతమధుపాబ్జముకుళసదృశము లతినీ
రంధ్రములు గుచము లఖిలపు । రంధ్రీజనతిలక మచలరాజాత్మజకున్. ౨౯౭

క॥ కేళీవస్త్రము లన రతి । కేళీసదనంబు లనఁగ గింశుకకలికా
మూలము లనఁ గామలతా । మూలము లన గొంబహుమూలము లమరున్. ()

క॥ శివునంగయష్టి నిరియఁగ । నవిరళముగఁ బట్టి ప్రాఁక నని కడు నెమ్మిన్
నిపుడు నవకల్పలతికల । పవిదిని మృదుబాహులతలు పార్వతి కొప్పున్. ౨౯౯

క॥ రుచిరాశోకదలద్యుతి । నచలజకరతలము లొప్పు నతిశయరాగో
పచితరక్తిరాజపల్లవ । రచితోభయుమేఖడంబరంబులఁబోలెన్. ౩౦౦

క॥ మరుచేత నుండి హరుచే । ల్వరు దుమచేనుఁడి గెల్వ నా నని సుమనః
శరములు గరమ్ము నైసిన । కరణిఁ గరాంగుళము లచలకన్యక కొప్పున్. ౩౦౧

క॥ వరదము లగుకల్పలతాం । కురములా విషమాస్త్రనిశితకోరకవిశిఖో
త్కరము లనఁ గరజములు సుం । దరి కగు నరుణోత్పలాగ్రదలములఁబోలెన్. ()

క॥ వినుతరుచిఁ బొల్చు నావన । మను నాదర్శంబుపిడిసొ యతిమృదులీలం
జను బోఁకపోదెయో యన । ఘనరుచి నగసుతకుఁ గంబుకంధ రమరున్. ౩౦౩

క॥ అమృతోద్భవులగు మీలో । నమరదు పగ యని సుధాకరాబ్జములకు గూ
టము దనముఖమునఁ జేసెనో । యుమ యన రదనాంశుగండయుగగతి పొల్చున్.

క॥ మాలిత మగుగుడరసమున । నూలినతుండీరఫలము యొగి తేనెతల
న్నాని మృదువైనపవడము । నానద్రిజ తొప్పమోవి నయమై యొప్పున్. ౩౦౫

---

౨౯౭. "ఆంధ్రీకుచాలింగితః.........సోఽయం సంప్రతి రాజశేఖరకవిర్వారాణసీం వాంఛతే." అని యాంధ్రీస్తనములు కాఠిన్యమునకుం బ్రసిద్ధంబులుగా వర్ణింతురు.

క॥ కులిశద్యుతి కైన ముక్తా। ఫలతరలవిభాతితోడఁ బ్రతి యనఁ దుహినా
చలతనయకు గౌరికిఁ దళుకల వెలుఁగుచు శిశిరరుచిరదశనము లొప్పున్. ౩౦౬

క॥ వదనాంబుజ మనువాణీ। సదనము మణికీర్తియుగళసంకాశముతో
మదనకరముకురయుగరుచి। ముదితకు మృదుతరకపోలములు సెలువొందున్. ()

క॥ మనసిజవారిధి గట్టిన। కనకాచలసేతు వనఁగఁ గమనీయనకాలం
బనకర్ణిక నాశిక యనా। స్యమధ్యమునందు గౌరినాసిక యొప్పున్. ౩౦౮

క॥ తెలిమొగమునందు లోలం। బులపాలపం బమ్మరున్నాచకోరకు లరుణం
మలశశిబింబముఁగోఁ బడి। వెలలక చెలరారుచున్నవిధు విధమున సతికిన్. ౩౦౯

క॥ హారము లాంక్షితభాషా। సారము లాంసకలవస్తుసంపూర్ణాలం
కారంబులు శ్రీగ్రీవ। కారంబులు చెవులు సుకవికావ్యము వోలెన్. ౩౧౦

క॥ ఆముఖలక్ష్మికిఁ బెట్టెడు। చామరములన దృశ్యకీచిజలనిధికి హరి
స్తోమ మన బోలుచు నగజకుఁ। గామధనుఃఖండభాతి గరివంకబొమల్. ()

క॥ కొఱనెల సుధారసంబునఁ। గఱిపోవఁగ నొరసి కడిగి కౌముదితోఁ గ్రొ
మ్మెఱుఁగుల విదల్చికొని పై। మెఱుఁ గిడున ట్లొప్పు నగజమృదునిటలరుచుల్.

క॥ అప్పాలఁతి కురుల శివు మన। సొప్పరి తనుఁ దగులఁ బెట్టునురు లన నెరులై
కప్పారి కొదమైతుమ్మెద। లుప్పతనము సేసి నట్టియొఱపున నొప్పున్. ౩౧౩

క॥ చమరీతతియుఁ గలాపులు। నుమ కేశతమాలతరలతో గ్రాటపిలో
రమియింపగఁ దగునని దగి। సమ మగుహరినవ్యనీలదలదలిసమమై. ౩౧౪

క॥ స్మరకలహంబునఁ బతిదాస। గిరిసుత దిర్యఁద్దైన నత్యుకేళి మహోత్సన్
మరుఁడు దగిలించి గెలువగఁ। గర మమరిన ...... గతినింపొప్పున్. ౩౧౫

వ॥ అని యనేకప్రకారంబుల వర్ణింపం దగినవర్తనల కమరి. ౩౧౬

సీ॥ మధుసమాకలితమై మవ్వ మారినమారునవలతా నా మేన నవక మెక్కె
దరుణి చేసోఁకినఁ దావి పొంపిరివోవుతమ్మి నాఁ దగుసుగంధంబు నుడిసె
మది శరత్సంగతి మత్తిల్లి క్రాలురాయంచ నా మదమందయాన మమరెఁ

దాలిమి రసనేవ సోలి మూర్ధాదుర్గాచిలుక [నా] వెడఁగొఱుకఁబలుకు లొప్పె
మరుఁడు శృంగారలక్ష్మిఁ జిత్తరువు నెఱియ। వ్రాసి తెమ్మెర లాయువు లొసఁగినట్లు
సుందరాకృతిఁ ద్రైలోక్యశుభగ యయ్యె। శైలనందన యౌవనసంగమమున.

క॥ మెఱుఁగుల కచిరత శశికిం। గఱ్ఱయును మణికనకములకుఁ గాఠిన్యము లేఁ
బోఱకుం గాఢము దక్కఁగ। మెఱుఁగెల్లను వచ్చి గిరిజమేనన నిల్చెన్. ౩౧౮

చ॥ తలతలఁ బ్రజ్వరిల్లు సితధామకళంకము వాచి వక్త్రమం
డలరుచి పర్వె దిక్కులఁ గడల్కొని చూపట్టు సంచలించి బి
ట్టులుకఁగ వాణి మన్నెరసి యుండొకభంగి సురంగమయ్యెఁ జూ
పులు పొలపంబు గైకొనియె భ్రూలత లంతకుఁ జెన్ను వింతగాన్. ౩౧౯

వ॥ మఱియును. ౩౨౦

సీ॥ శశిబింబమణిహేమసౌదామనీచయోత్కరకాంతు లన్నియు సరసి తెచ్చి
నవలతాపుష్పపల్లవబిసకోమలవిభవంబు లన్నియు వెదకి తెచ్చి
కర్పూరచందనకాశ్మీరమృగమదామోదంబు లన్నియు నుంచి తెచ్చి
పరివాదినీశుకపరపుష్టమధుకరారావంబు లన్నియు రాచి తెచ్చి
హావభావరూపలావణ్యసారముల్ త్రిభువనముల నేర్చి తెచ్చి నేర్పు
సూపఁ దలఁచి యాఁడురూపు జేఁ డొనరించె నని నుతింప నొప్పు నగతనూజ.

వ॥ మఱియు నఖిలలావణ్యపుణ్యాధిదేవతయు నశేషసౌభాగ్యలక్ష్మియు నపారగుణ
మణిగణభూషణానర్ఘనాయకమణియు నిఖిలభర్తృదారికావిమలముక్తాఫలహార
తరలసరసీరుహరాగరత్నంబునుం బూర్ణయౌవనాలంకృతయు నై యొప్పుచున్న
పార్వతిం జూచి హిమవంతుం డనంతసంతోషరసాపూరితాంతరంగుం డై.

క॥ వేద నిధానము గన్న। ట్లాదరితమునం దనూజ నగ్గించుచు నా
హ్లాదమున దగినవరుఁ డిం। ద్రాదిసురలలోన నెవ్వఁ డగునో యనుచున్. ౩౨౩

వ॥ డోలాయమానమానసుం డగు చున్నయెడ. ౩౨౪

వ॥ గొనకొని సామగానమునకున్ మెఱుఁగిచ్చు చతుస్వరంబులం
దెనకొని మ్రోయు వీణె మొరయించుచు రాగరసప్రవాహమో

౩౨౧. ఆ-౩-౧౨౪. లేఁబోఱ=పల్లవము.

యనఁగఁ బిశంగజూటరుచు లంబుదమార్గమునందుఁ బర్వ భా
రనఁ జనుదెంచె నారదమహాముని తద్గిరిపాలుపాలికిన్. ౩౨౫

వ॥ ఇట్లు చనుదెంచు నారదమహామునిం గని యతిసంభ్రమంబున నెదురువచ్చి వినయ
వినమితోత్తమాంగుండై యాసనపాద్యార్ఘ్యాద్యశేషార్చనలవిధి నభ్యర్చితుం జేసిన
గిరిపతికి సమ్మునిపతి గరుణించి హితోపదేశంబు సేయందలంచి శివశక్తిభేదంబు
లు దెలిపి పార్వతీపూర్వప్రపంచంబు విశేషించి యెఱింగించి మఱియు నాతనికి
మనోనిశ్చయంబు సేయ నభిముఖుండై. ౩౨౬

క॥ ఈదేవి లోకజనని మ। హాదేవున కగ్రమహిషియై పేర్మి సురేం
ద్రాదుల కర్చితయగు నని। యాదేశము సేసి యమ్మహాముని సనియెన్. ౩౨౭

క॥ హిమవంతుఁ డెలమిఁ దైర్యిలో। క్యము సలవడ నేలినంతకంటె మనోరా
గమున నిజతనయఁ గులదై। వము గాఁ గొనియాడుచుండె వదలక నెమ్మిన్.

వ॥ తదవసరమ్మున. ౩౨౯

గీ॥ సతివియోగాగ్ని మనములో సంతతంబు। దగిల్చికొని కాల దానికిఁ దనువు సేయఁ
దలఁచియో కాదు నిక్కము దపము సేయ। దలఁచియో హిమగిరికి నీశ్వరుఁడు వచ్చె.

వ॥ ఇట్లు చనుదెంచి తదుపకంఠప్రదేశంబున నవతరించి. ౩౩౧

సీ॥ రసరసాయననిర్ఝరప్రవాహానూనగంగాప్రవాహశీకరములడరఁ
దనుపార నెలరారుఘనసారసురదారుమందారచంపకచందనములఁ
లలిన సర్వర్తుకఫలపుష్పపల్లవభరితలతాగుల్మతరువనముల
సురుచిరశశికాంతసూర్యకాంతాసర్ఘ్యమణిహేమమయకుట్టిమస్థలముల
వంశరుద్రాక్షమాలూరకింశుకముల। హంసకీరమయూరవిహంగమముల
ఋష్యసారంగమృగచమరీమృగములఁ। బావనం బగుదివ్యతపోవనంబు. ౩౩౨

వ॥ కని యంత సహకారకర్పూరనారికేరనమేరుదేవదారుమందారపారిజాతజంబూ
జంబీరాశోకానీకలతామందిరాంతరంబున హిమవంతునిరంతరోపార్జితానంత
పుణ్యఫలంబునుంబోలె నవదాతశిశిరద్యోతితశశికాంతశిలాతలంబు సమాధిస్థా
నంబు స్వీకరించి నందిమహాకాళాదిగణముఖ్యుల నిజయోగంబులంద నియమించి.

గీ॥ హిమనగంబుపైఁ బొల్పొందు హేమశిఖర । మనఁగఁదనరారు కెంజెడ ల్పెనచిక్కి
యందుఁ జుట్టినదివిజాపగామలప్ర । వాహమున నహిబంధంబు వఱల బిగిసి. ()

గీ॥ క్షీరవారాశి కెలఁగిన కార్మొగుళు । కరణి శశికాంతవేదిపై గార్మొలోలు
పరచి విలసిల్లు సందుండి పరమపరుఁడు వొలిచె నొగిమొగుళ్లపైఁదటిత్పుంజమనఁగ.

సీ॥ పద్మాసనస్థుఁడై భావించి శోషణదాహనప్లావనతర్పణముల
దేహోదయాత్మప్రతిష్ఠలు విధయించి యోగమరీతి బ్రహ్మాంగవర్ణ
విన్యాసములు దీర్చి విమలాత్మదీపంబు ప్రణవసంపుటముగాఁ బ్రజ్వలించి
వడి బాహ్యవర్తన ల్విడిచి ప్రత్యాహారగతి మన స్సంతర్ముఖమ్ము సేసి
తన్నుఁ దానై కాంచి తనయందుఁ జేతోలయంబు చేసి నిశ్చలాత్మయోగ
మయసుఖామృతాబ్ధిమగ్నుఁడై పరదుండు నిరతిశయసమాధినిష్ఠ నుండె. ౩౩౬

క॥ ఆధ్యాత్మమూర్తి బ్రహ్మా । రాధ్యయాత్మకుఁడు సురవరేణ్యుఁడు సకలా
రాధ్యుఁడయితనరుతాను స । మాధ్యవహితలీయమానమానసుఁ డయ్యెన్. ౩౩౭

గీ॥ తనకుఁ బర మొండు లేదనఁ దనరి వెలుఁగు । చుండుపరమేశ్వరుండ్లు దానుగ్రతప్తము
చేసె భక్తులు దనుఁ బ్రీతిఁ జేరవచ్చు । తెరువుద్దాదీర్చిచూపెడు తెఱఁగువోలె.

ఉ॥ అంతకుమున్న సన్మతిఁ బురాంతకు రాకయు వచ్చియున్నవృ
త్తాంతము మేలుగా నెఱిఁగి యాహిమవంతుఁ డనంతసంభ్రమా
త్యంతమనోనురాగమున నప్పుడు వాజిపరీవాధదంతినా
మంతవిలాసినీస్వజనమంత్రిపురోహితభృత్యయుక్తుఁడై. ౩౩౯

వ॥ నిజాశేషకులకళత్రపుత్రీసమేతుండై చనుదెంచి పరమేశ్వరునిం గని ముహుర్ముహు
ర్గృహీతలాలంకృతసర్వాంగుండై నిజదేశాదిసమస్తరాజ్యవిభవంబులు నీశ్వరు
శ్రీపాదంబులకు నివేదించి. ౩౪౦

క॥ వినుతించు చున్నగిరిపతిఁ । గని గిరీశుఁడు సన్మనమునఁ గారుణ్యాలో
కనసాంద్రసుధారసప్లా । వనిమగ్నునిఁ జేసి సురవరేణ్యునిఁ జేసెన్. ౩౪౧

వ॥ ఇట్లచలాధీశ్వరుం డీశ్వరుకరుణామృతరసప్రవాహప్లావితుం డగుచు నీశ్వరారా
ధనానంతసంతోషితాంతరంగుండగుచు నుండునంత గొంతకాలంబునకు రుద్రుం
డు గిరీంద్రున కనేకవరంబు లొసంగి నిజపురంబున కరుగు మని నియోగించిన.

క॥ విన్నిస్సొకాన్తై యెన్నఁడును నినుఁ। గని యెఱుఁగరు హరిసరోజగర్భామరసు
స్మను లిట్టినీస్వరూపముఁ। గని యియ్యెడఁ బ్రాని పోవగా నోపుదునే. ౩౪౩

వ॥ అని కరంబులు మొగిచి దీనాననుండై యున్న వానిభక్తియుక్తికిం గరుణించి సక
లలోకాభీష్టఫలవృద్ధి కేదారాత్మకుండ నగుటం గేదారేశ్వరుం డన నిప్పురంబున
వసియించెద నోడకుండు మనిన దానికిం బ్రసాదం బిచ్చి. ౩౪౪

సీ॥ ఈబాల దన్నుఁ దా నెఱిఁగినకోలె ననన్యశరణ్యయై యహరహంబు
నిన్న కొల్చుచుండు నీ విందు మాపుణ్యమునఁజేసి వచ్చుట విని ముదమునఁ
జూడంగ వచ్చె నిక్క జూచినకోలె భక్త్యావేశమునఁజేసి జీవ మొడలఁ
దానిన్న మీపొందు వాయనోపదు హాని త్తలఁకుఁ గావున నిచ్చఁ దగినవరుఁపుఁ
బనులు సేయుచుండుఁ బార్వతియునికికి వరద యిచ్చగింపవలయు ననిన
నతనివిన్నపమున నంతకు భక్తవత్సలుండు సెమ్మనమున సంతసించి. ౩౪౫

వ॥ అదత్తప్రతివచనుండైన దానికి మహాప్రసాదం బిచ్చి యనేకమాణిక్యాకల్పలేపాంబ
రాలంకృతం బైనకన్యాంతఃపురంబులోన. ౩౪౬

క॥ ఆక్షితధరపతి శివుఁ బ్ర। త్యక్షముగాఁ గొలుచుచుండు మని తత్పరుఁడై
శిక్షించి గౌరి నందు ను। రక్షితముగ నునిచి నిజపురంబున కరిగెన్. ౩౪౭

వ॥ అంతం బార్వతియు నీశ్వరారాధనాసక్తయుక్తయై భక్తియు ననురక్తియు నంత
కంత కగ్గలించుచుండ. ౩౪౮

సీ॥ చమరీజబర్హాగ్రమార్జనులఁ బరీక్షించి నయమున సమ్మార్జనంబు సేయుఁ
గర్పూరతైలంబు కస్తూరికాకర్దమంబుల ననులేపనంబు సేయుఁ
గాశ్మీరమాంజిష్ఠగరుడాండహరినీలముక్తాఫలంబుల మ్రుగ్గువెట్టుఁ
గుసుమపల్లవలతాతోరకంబులఁ జిత్రదామంబు లొనరించుఁ దావిమిగులఁ
బుష్పమంజరి మొనరించుఁ బుణ్యవారి। సౌరభము లించి మణికలశముల నించు
నచలపతిసుత యవి నిట్టు లహరహంబు। శివున కనురక్తిఁ బరిచర్య సేయుచుండె.

చ॥ పొలుపుగఁ జంద్రశేఖరుతపోవన మంగజచక్రవర్తిదో
ర్బలమున ముట్టి చూడఁగొనఁ బంచిరదం డొకొ నాఁగఁ బొల్చె క

న్యలు దనుఁ గోల్చిరా నచలనందన సుందరలీల నిచ్చలుం
గొలుచుచు నుండె భక్తినహికుండలమండితగండమండలుఁ 3౫౦

సీ॥ మొన లావులించి వాసన సల్లఁ బసిగొని లేఁదేటిగము లేఁగ్రుల్లింపకుండ
నైడ సూఱగొని వేచి సుడియుత్తెమ్మెరలచేఁ బాఁడముపుప్పొడి వొలివోవకుండఁ
దరణిహాటమున మే యొర్రలి పద్మినిమేన మొలతెంచుమధుమద మొలుకకుండ
మేల్కని గోమిని మెలఁగి మైముఱిసిన బొదిగొన్నయకరుపు సెదరకుండఁ
దెలిసి జక్కవ లాండ్రొంటిఁ గెలయుఁదారు। కెలకులంబున రేకులు గదలకుండ
యున్న కొనివచ్చి గణికాసమూహితోడ। గిరిజ పూజించెఁ బసిఁడితామరల వరదు.

ఉ॥ చారుతరావధానసుతశాశ్వతకీర్తిరసప్రవాహసం
పూరితరోదసీకుహరుఁ బుణ్యసనాతనమూర్తి సజ్జనా
ధారు సమస్తలోకజనతానుతపాదసరోజపీఠు శ్రీం
గారభవారి నర్థిజనకల్పమహీజను మల్లికార్జునుఁ 3౫౨

క॥ అనవరతదానరతుఁ బా। వనతరశుభమూర్తి భక్తవత్సలు జనతా
వినుతమతిక్రమభవసం। గనివృత్తు మునీంద్రవరశిఖామణి ననఘుఁ

ఉ॥ సత్యవిలాసు నాదిమునిసచ్చరితుం గవిగాయకాదిసం
స్తుత్యు ననూనదాననిరతుం గరుణాకరు సజ్జనాంబుజా
దిత్యు వినిర్జితాంగభవుఁ దీర్ణభవార్ణవు శేముషీసురా
మాత్యు సదాత్మయోగిజనమండను జంగమమల్లికార్జునుఁ. 3౫౪

క॥ ధీమణి నాశ్రితజనర। క్షామణిఁ గవిగమకివాగ్మిగాయకనటచిం
తామణి సన్మునిగణచూడా। మణి నిహలోకవరనిటలతటనయనుఁ. 3౫౫

వనమయూరము॥ మేరునగధీరు నిరమిత్రు సుచరిత్రుఁ
వారిధిగభీరు నిరవద్య జనవంద్యుఁ
చారుతరమూర్తి నతిశాంతు గుణవంతుఁ
మారహరు సర్వజనమాన్యు మునిమాన్యుఁ. 3౫౬

గద్యము॥ ఇది శ్రీమజ్జంగమమల్లికార్జునదేవదివ్యశ్రీపాదపంకజభ్రమరాయమాణకవిరాజ
శిఖామణినన్నెచోడదేవప్రణీతం బయినకుమారసంభవం బన్నుకథయందుఁ
దృతీయాశ్వాసము.

శ్రీ

# కుమారసంభవము.

## చతుర్థాశ్వాసము.

శ్రీమదశేషమునీంద్ర । గ్రామణినుతచరిత్ర విగతకల్మష శివత
త్త్వామలమతిప్రకాశద । యామృతసరసీజ మల్లికార్జునదేవా. ౩౫౭

వ॥ ఇట్లు పార్వతి పరమభక్తియుక్తిం దగిలి నిరంతరశుశ్రూషాతత్పర యగుచుండె
నంత. ౩౫౮

క॥ వినుతింపఁ గామసుఖసా । ధనముగ గౌరిఁ జంద్రధరుఁడు తపస్సా
ధనముగఁ జరించె నుత్తము । లనయము విపరీతచరిత్రులైనను జనదే. ౩౫౯

వ॥ ఇట్లు పరమేశ్వరుండు తపోవృత్తిం దగిలి జగద్వ్యాపారంబు లెఱయ కునికిం
జేసి తారకాసురుం డనుఘోరాసురుం డేచి హరిపరమేష్ఠిపురందరాదుల
కజేయుండై సకలజగజ్జనంబుల కనేకోపద్రవంబులు సేయం దొడంగిన. ౩౬౦

క॥ వాసిపటుదండముల్లు క్షమ । రాసీకము లప్పగింప కపగతరాజ్య
శ్రీనిలయులై పితామహుఁ । గాఁగఁ జని రెందుఁ బొందుగానక భీతిన్.

వ॥ తదవసరంబున. ౩౬౨

సీ॥ మ్రొగ్గిఁ దముఁ బడసినమునులమూర్తుల మీఱి ధర్మశాస్త్రములు సూత్రములు దసర
మణిదీధితుల పెంపు మాయించి సాలోక్యముక్తులు తనుతేజములు వెలుంగ
వాణివీణారుచి వారించి సామగానంబులు శ్రుతులఁ దియ్యంబుఁ బెంప
మృగమదాదులతావి మగ్గించి నుడిసి నిజాననాంబుజగంధ మతిశయిల్లఁ
జామరగ్రాహిణీకరచారురత్న రుచులు వెలుంగఁజేయక వాశరుచులు వాలయఁ
గనకమయపద్మకర్ణికాగ్రమున విశ్వకర్తసుఖలీలఁ బేరోలగమున నుండె.

వ ॥ ఇట్లు శతానందుండు సదానందకందళితహృదయారవిందుం డగుచున్నంత బృందారకబృందంబు గాందిశీకులై కంది తదీయాస్యారవిందమకరందంబుల కెఱఁగునలిసందోహంబునుం బోలె నెఱఁగి నానావిధస్తుతిరవంబు లుగ్గడించుచు నభయ మభయ మనుచున్న దేవేంద్రాదిగణంబులం గని పిలిచి కరుణించి యూరడించి యిట్లనియె. ౩౬౪

క ॥ మీ కింత వంది కందఁగ। యాకులతం బొంది నిగ్రహైశ్వర్యులరై రాకకుఁ గారణ మేమి త్రి। లోకాహితదనుజతతికి లోఁబడరు వరే.

వ ॥ అని తమవచ్చినకార్యస్వరూపంబున కనురూపంబుగా నానతిచ్చినవాక్పతికి బృహస్పతి నిటలతటఘటితకరకమలముకుళపుటవిలసితుండై తారకాసురుబారిం బడి తమ్ముఁ బ్రదికి వచ్చినవృత్తాంతం బెల్ల నెఱింగించి వానిదోషవిశేషంబులు విజ్ఞాపింపందలంచి యిట్లనియె. ౩౬౬

సీ ॥ వేళ్ళతోఁ దుత్తఁ గల్పవృక్షముల్ పెల్లగించి కొనిపోయి తన కుపవనము జేసెఁ
గనకాద్రి గొనిపోయి తన కెక్కియాడ నిజారామభూమిఁ గ్రీడాద్రిఁ జేసె
నమరారి దన పేరియుచ్చులు వెట్టించి సురధేనుసమితిఁ గీలరము సేసె
గరుడోరగామరతరుణుల నందఱఁ జేకొని తనవిలాసినులఁ జేసె
వేదవిహితవృత్తి విప్రుల నుడిగించెఁ దత్సుతులపురుషభక్తి సలుపు దుడిచెఁ
బుణ్యకర్మ మడఁచె భువి నిట్లు నిఖిలాపకారకుండు బలిమిఁ దారకుండు. ౩౬౭

మ ॥ తన తేజం బహిమాంశువై తనమహత్త్వం బాసవసంస్తోమమై
తనకోపోన్నతి రుద్రులై తనమహోత్సాహంబు సిద్ధాదులై
తనచె న్నశ్విమలై వెలుంగఁ దనదోర్దర్పంబు దిక్పాలురై
చన గీర్వాణనియోగము ల్గొని నిజేచ్ఛం దాన పాలించెడున్. ౩౬౮

క ॥ అనిమిషపురముల నెల్లం। దనబలునాయకుల నిల్పఁ దలఁచినవాఁడై
దనుజేంద్రుఁ డదు గోల్కొననీ। కనిశముఁ బోఁదోలు చుండు నమరగణంబున్. (

క ॥ ఇలఁ జిత్రము తారకుకర। తలసంగతమైనఘోరతరవారి నీర
న్నిలు పగుఁ దనుఁ జూర కడరిన। దల్లును మునుక యగు న్విరోధితతి కబ్జభవా. ౩౭౦

౩౭౦. "దెసలు చూడఁగనుండె దిగ్గను చక్రసమూహంబునకుఁ దలమున కలుగుచు......వెన్నెలనిట్టదోఁచె." నిర్వ-ఆ-౬.

చ॥ పలుపలుతారకుండు సురపాలపురంబులు గాల్చుధూమప
ఙ్క్తులు పయిఁ గప్పుచున్న బెనుధూపటమై పొగసోఁకి కందెఁ గా
కలవడ్రి వానితోడిపగ నబ్జుఁడు గందఁగ నీయలంతివీ
రులె మొగపెట్ట కాసురవిరోధికి నోడినవార వోయరే. ౩౨౧

గీ॥ పోరఁ దన కోడిపాటుని హారరోచిఁ। బట్టుకొని పోయి దానవప్రభుఁడు బిలికి
వారి కెల్లను న్యోగ్యులవానిఁ గాఁగ। నురముపై జీడి నిల్జి య చ్చొత్తి విడిచె. ()

క॥ ఆలమున నసుర చిచ్చును। గాలియుఁ గొని కవియుననుట గల దెనిరిరిపుల్
గాలుదురె దీని గనుకనిఁ। గూలుదు రెందేని నర్కతూలము వోలెన్. ౩౨౩

క॥ సురగరుడోరగవిద్యా। ధరపురవరసతులతోడ దనుజేశ్వరుకిం
కరులు రమింతురు దోషా। చరులకు వెలిలోపు గలదె చతురాననుఁడా. ౩౨౪

క॥ ఇప్పుడు నీకే మిన్నియుఁ। జెప్పిన నందేమి దనుజుఁ జేకొని దయతో
నెప్పుడు వర మిచ్చితి నీ। వప్పుడ మది నీడవిడిచి తమరుల నెల్లన్. ౩౨౫

క॥ కాలవశంబునఁ దనుజుఁడు। గాలునిఁ గీడ్పఱచె బలిమిఁ గాలుని నోర్చెన్
గాలుని తేజ మడంచెన్। గాలుఁడ తా నయ్యె నెల్ల కడలును బేర్మిన్. ౩౨౬

క॥ గోపాలక విను మిప్పుడు। గోపాలకు లాదిగాఁగ గుప్తితమతులై
గోపాలకు లెల్లను జెడి। గోపాలకు లైరి దారకున కతిభీతిన్. ౩౨౭

క॥ విషధరుఁడు హరియుఁ దక్కఁగ। విషధరసురగరుడయక్షవిద్యాధరత
ద్విషధరపదచరు లాదిగ। విషధరులై రిప్పు డసురవీరునకళ్కన్. ౩౨౮

సీ॥ వృద్ధునెద్దుఁ గొని గాడ్పుమృగము బండిఁగఁ జేసి తొలయించి నెలలోనియిఱ్ఱినేయు।
గౌరివాహనము దిగ్గజముల కుసికొల్పి విడిచి సింహముఁ బట్టి వేటలాడు
హరిఁ ద్రోచికొని పోయి గరుడుండు డేగగా విడుచు భేరుండాదివిహగములకు
జముపోతుఁ దెచ్చి భాస్కరుతేరిమావుల నెగిచి నుగ్గాడ వేగించి చూచు

---

౩౨౯. గాడ్పుమృగము, జింకయనుటకు :—

“తద్వ్యాఘాస్య కరన్యస్తచిత్రపత్రలతాంకితః। అసౌ విహారహరిణః కింస్యాదనలసారథేః” అని సాహసాంకచరిత్రము. “ప్రవహనామకమహాపవనవాహనమైన మృగముగాఁబోలు నీమృగముతరుణి” నై-ఆ-౮.

చుండు రేయుం బగలు నొండువినోదములు విడిచి సురల మీఁది వేఁట దగిలి
తారకుండు రిపువిదారకుం డనివార్యవిక్రముండు దనుజచక్రవర్తి. ౩౨౯

క॥ ఇనశశితేజంబుల జగ। మనిశము విధి నడపు టెంత యని వాని మహిం
జననీక తారకప్రభ। జననడపెడి మిన్ను మిగిలి సామర్థ్యమునన్. ౩౩౦

క॥ కోపించి సురల వెలువడ। ద్రోపించె సురారి బలిమి ధూర్జటి నీళ్ళన్
మోపించె విష్ణుఁ బసులం। గాపించెను మీఁదు నొకయుగడఁ బ్రాపించెన్. ౩౩౧

మ॥ హరుఁ డాదైత్యుని కోడి చన్నసడి వాయంగాక మోక్షార్థమే
విరసం బైనతపంబు సేయఁదొడఁగెన్ విష్ణుండు తద్బాహ్వప్రీ
కరదంతాహతి దీర్ఘనిద్ర సనియెం గా కింతకాలంబు సా
గరమధ్యంబున నిద్రసేయునె జగత్కల్యాణకాంక్షాత్ముఁడై ౩౩౨

క॥ మందారాదార్కాలయగులు। మందారార్కావనీజమయ మయ్యె సదా
నందనవనజావాసము। నందనవనజాకరాభినందిత మయ్యెన్. ౩౩౩

సీ॥ అనిమిషపతి పుర మనిమిషాస్పద మయ్యె ననలు ప్రోలెల్లను ననలమయము
ప్రేతాధిపతివీడు ప్రేతసంగతము పలాశను నెలవు పలాశయుతము
వసధీశునగరంబు వనచర్రాకీర్ణంబు మారుతాలయమును భీమారుతంబు
కనకాధిపతివీడు కనకోదితంబు శివావాస మెల్ల శివాన్వితంబు
సేసెఁ గానఁ దారకాసురుదెస విపరీతవృత్తి లేక రిత్తదూఱు
లేఁటి కవిన నాసురేశ్వరామత్యవక్రోక్తి విని సరోజయోని నగుచు ౩౩౪

వ॥ నిజవరపరిభావంబున దారకుండు ప్రబలుండగుటకు సంతోషించియు నిఖిలజగద
పకారుం డగుటకుం గోపించి తద్వధోపాయంబు విచారించి కని. ౩౩౫

చ॥ వెలయనుమామహేశ్వరులవీర్యమునం దుదయించునట్టిదో
ర్బలకలితుండు గాని సురపాలకవిద్విషుఁ దారకాసురున్
గెలువఁడు పోరిలో మకరకేతనుఁ బంపుఁడు వానికిం దప
శ్చలనము సేసి మైపడిఁ బ్రసంగము సేయు జగద్ధితంబుగాన్. ౩౩౬

వ॥ అని తపసుం గరుణించి చతుర్ముఖుండు హితోపదేశంబు సేసిన దానికి మహా
ప్రసాదం బని వీడుకొని. ౩౩౭

క॥ తమ కప్పుడు త్రిభువనరా। జ్యము నేకుత్రి నంతకంటె సంతోషముతో
నమరపతి గొల్చి చనుదే। నమరేంద్రుఁడు వచ్చెఁ బేర్మి నమరావతికిన్. ౩౮౮

వ॥ ఇట్లు వచ్చి పచ్చవిల్తు రావింపం బుచ్చినం దదాజ్ఞాప్రేరితుండై కుసుమాయుధుం
డాక్షణంబు కదలి. ౩౮౯

ఉ॥ పూవులతేరు జక్కవలు పూన వసంతుఁడుఁ దాను నెక్కి కీ
రావళి గోకిలాళి మలయానిలముం దనుఁ గొల్చి పొల్చి రాఁ
గా వరమీనకేతనము గ్రాల నలివ్రజశంఖకాహళా
రావములుం జెలంగ నమరావతికిం జనుదెంచె నున్నతిన్. ౩౯౦

వ॥ ఇట్లు శృంగారయోని శృంగారరసప్రవాహంబు మేరదప్పి కప్పిన ట్లుప్పొరంబు
సొత్తెంచు నప్పు డతిసంభ్రమంబున బుష్పాయుధుం గనుంగొని. ౩౯౧

ఆ॥ పడఁతు లెల్లఁ గామపరవశలై రతి దగు మనోజుఁ జూచి మగలు గరము
ప్రీతి దగిలి గంటబేట్టంబు గొని సురపురిజనంబు లెల్ల విరలిగొనిరి. ౩౯౨

వ॥ ఇట్లఖిలజనసమ్మోహనాకారుం డగుసమ్మోహనాయుధుండు వజ్రాయుధు
నాస్థానరంగంబు దఱియం జొత్తెంచి. ౩౯౩

శా॥ రంభాద్యప్సరసౌఘుఁ గాంస్యరసపూరస్ఫారనేత్రామలో
జ్జృంభాంభోజసహస్రభోగఫలభాసిం దారకోన్మూలనా
రంభాయత్తసుచిత్తు నిర్జరధునీరాజీవమాలాధరున్
జంభారాతిఁ బురందరుం గని మనోజాతుండు ప్రీతాత్ముఁడై. ౩౯౪

గీ॥ తన్నుఁ గని యనిమిషులైరొ మున్న యైరొ। నాఁగ ననిమిషదృష్టిని నాకిసమితి
దగిలి కనుగొని వారిచిత్తముల్ దనకు। నెఱిఁగ సమరేశునకును రతీశుఁ డెఱిఁగె.

వ॥ ఇట్లు సురరాజు వలరాజుసుందరాకారంబు గని ముదితహృదయుం డగుచు సము
చితాసనతాంబూలదానసన్మానాదులం బ్రహృష్టమనస్కుంజేసి సురపతి రతిపతి
నిజభుజాకలితపుష్పకోదండకౌశలోన్నతి మెచ్చి మహోత్సాహంబున నిట్లనియె.

మ॥ అతినిష్ఠాపరుఁడై సురేంద్రవిభవవ్యాసక్తి నుగ్రాధిక
వ్రతముల్ చేసి ధీరుఁడై నడచు మున్నా రెవ్వఁడైనన్ శుభ

స్థితి నెందేనియుఁ గల్గినం బనుపు నన్ శీఘ్రంబ పుష్పాస్త్రసం
హతి విచ్ఛిన్నమనస్కులన్ విషయమాయాగ్రస్తులం జేసెదన్. ౩౯౭

క॥ పరమపతివ్రతలై సుర। పురములు సాధింప నున్న పుణ్యస్త్రీలె
వ్వరు గలరు చూపు చూతాం। సురశరహతిఁ దిరుగు మరులు గొలిపెద వారిన్.

చ॥ అనుపమరూపయౌవనమహాగుణవైభవలీల నెవ్వరిం।
గనుగొని మెచ్చ కున్నవరకన్యక గల్గిన దాని జెప్పు నీ।
పనిచినవాని వేలగొని పైఁబడఁ జేసెద నీవు దన్నుఁ గ
ల్చిన సురుఁ దాను గిల్చి చనుచేడియ గల్గినఁ జూపు తెచ్చెదన్. ౩౯౯

చ॥ వలయుజనాలి కెల్ల మును వశ్యులఁ జేసితిఁ బుష్పబాణకా
శలమున సూర్పకాదిరిపుసంహతి నోర్చితిఁ దీవ్రసాయకా
వలిఁ ద్రిజగంబులందు వశవర్తులు భీతులు గాని నాకు న
గ్గల మెరు లెందు లేరు విను కౌశిక నేర్పున విక్రమంబునన్. ౪౦౦

సీ॥ జలశాయి ననుఁ గన్న జనకుండు హరి చక్రియైనను స్వామికార్యంబు గాఁగ
వేదజడుండైన విధి పాశసంయుక్తుఁడైనను నాదుమహాత్మ్య మమరఁ
బరమతపోనిధి పరమేశుఁ డుగ్రాత్ముఁడైన నపారశౌర్యంబు వెలయ
మఱియు నమర్త్యాహిమర్త్యాధిపతు లెంతశుచులయ్యు నాయుధశూరులైన
నీక్షణంబ సతుల కెలఁగింతుఁ బుష్పాస్త్రకౌశలమున నదియుఁ గాక పోర
నీసుదక్కు నీకు నెలఁగింతు నత్యుగ్రబాణశక్తిఁ దన్నుఁ బంపు దేవ. ౪౦౧

క॥ వెరవున భుజశౌర్యంబున। సురవల్లభ పనుపు నీవ చూడఁగఁ బరమే
శ్వరుసైన నోర్తు బెలసుర। నరఫణిదివిజాధిపతులు నా కెదురదురే. ౪౦౨

వ॥ అని నెనరుముట్టం బూనినకుసుమాయుధుపూనికి వజ్రాయుధుండు ఘనంపలిచి
తారు తారకాసురుచేతం బరాజితులై పరమేష్ఠిముఖుపుఁ జొచ్చినవిధంబును విధి
తద్వధ కుపాయం బయ్యుమామహేశ్వరులవీర్యసంభవుం డైనకుమారుం డగు
నని హితోపదేశంబు సేయుటయు హరగిరిజులు నైష్ఠికానుష్ఠానులై హిమవంతం
బున నున్నవారు వారికి సంగమంబు సేసి జగద్ధితంబు సేయు మిది యనన్యవిష
యంబు నీవలన నగాని మొరునకు సాధ్యంబు గాదు కావున నిన్నుం బ్రార్థించితి
మెట్లనిన. ౪౦౩

మ॥ ధర నత్యుత్తము లైనధీకులమునస్తాపంబు వాప న్మహా
పురుషానీకము ద్రోపుఁగాక మహి నల్పుం డోపునే యద్ధరా
ధరనైదాఘనితాంతదాహ ముడుపన్ ధారాధరానర్గళో
త్కరధారావళిగాక యార్ప నగునే గండూషతోయంబులన్. ౪౦౪

వ॥ అని తన్ను నగ్గించు చున్నసురవల్లభుం జూచి రతివల్లభుండు విజృంభించి. ()

చ॥ పరమతపం బడంచి మఱి పార్వతియం దనురక్తుఁ జేయు మా
యిరువురకుం గుమారుఁ డుదయించిన మాపగ దీర్తు నంచు న
చ్చెరువుగ నన్నిదొంతులును జెప్పఁగ నేటికి వానినైన సురే
శ్వర ననుఁ బంపు మీక్షణము చంపెద మీపగదీర్తుఁ దారకున్. ౪౦౬

క॥ తారకునోర్వఁగ వేలుపు। వారకుఁ బడయంగ। సంగమము సేయను మున్
వారలఁ పై బంపనినాఁ। డారిపుపైఁ బంపు మాతఁ డధికుఁడె నాకున్. ౪౦౭

వ॥ అనిన సురేంద్రుండు నీ కసాధ్యం బెందును లేదైనను బరమేష్ఠివచనం బుల్లంఘ
నీయం బగుట నిదియ మనకుం గర్తవ్యంబు దీని కొడంబడవలయు నని ప్రార్థిం
చిన నప్పని నైకొని నా కిది యేమిగహనం బని దర్పకుండు దర్పించి. ౪౦౮

గీ॥ శూలినేకోన్నతప మెల్ల నాలినేసి। యతనిదేహంబునందు సా మాలిఁ జేసి।
కామకింకరుఁ జేసి నాకడిమినేలుప। గంటి నీప్రస్తవము దీర్పఁగంటి నెలమి.

క॥ నాకుం దగినకెలసంబు గంటి దీని కింతకు మైకొంటిఁ దాంబూలంబు దయ
సేయు మని వసంతసహితంబుగా వలరాజు సురరాజుచేత నపారసత్కారం
బులు గొని వీడుకొని చనుదెంచునంత నిక్కడ. ౪౧౦

చ॥ రతి మతిఁ దల్లడిల్లి పతిరాకయ వార్చుచు నంతకంత క
ద్భుతములు దుర్నిమిత్తములు పుట్టుచు నోలి నిజాంగసంగతో
ద్గతభయదానురాద్యశుభచేష్టల కెంతయు బెగ్గలించి దుః
ఖిత యగుచున్నచో మకరకేతన మంబరవీథిఁ గాలఁగన్. ౪౧౧

క॥ అలిగానము మదకోకిల। కలనాదోద్యమును శుకస్వనఘనమం
గలపాఠరవము ఘోరనఁ। జెలఁగఁగ రతిఁ। గానవచ్చెఁ జిత్తజుఁ డెలమిన్.

క॥ పతిఁ జూచి రతి నిజాంత। ర్గతఖేదం బెలమి మాఱుపుగా నిడి కాలో
చితవచనాంతరముల నసుర। పతి గడువేగ నిన్ను నేమిపని రాఁ బనిచెన్. ౪౧౩

వ॥ అని తఱిమియడుగు చున్నరతిముఖవికారంబు గని మనసిజుండు మనంబునం గుసురుకొనుచుఁ జిఱునవ్వు నవ్వుచు నిట్లనియె. ౪౧౪

చ॥ బెదరుచు నంతరంగమున భీతికిఁ గందవడంబునుట్టి ప
ల్కెదు పొరపొచ్చెముల్ వెలుపుఁ గేనముఁ జెయ్వుల కోలి నెత్తువె
ట్టెదు వడి మోవియుం గరువటిల్లెదు నీమది నింతదల్లడం
బొదవుడి దేమికారణమ యుగ్మలి నా కెఱిఁగింపు మేర్పడన్. ౪౧౫

వ॥ అనిన దివ్యాంతరిక్షభౌమాంగికాద్యనేకదుర్నిమిత్తంబులు నిర్నిమిత్తంబ పుట్టు టెఱింగించి దీనాననయగుచు నీపోయివచ్చినకార్యం బెఱింగింపు మనినం బెద్దయు విశేషంబులే దయ్యుమామహేశ్వరులతపోభంగంబు సేయ మనిన దానికి మేయి కొని వచ్చితి ననిన విని రతి యుదరిపడి యుల్లంబునం దల్లడిల్లుచు. ౪౧౬

సీ॥ మనకులదైవ మన్ మన్నన లేదేనిఁ ద్రిభువనారాధ్యుఁ డన్ తెంక లేక
పరమయోగాత్ముఁ డన్ భక్తి లేదేనియు సర్వేశ్వరుం డనుశంక లేక
యజశిరోదళనుఁ డన్నదరు లేదేనియుఁ గాలారి యనునోటికండ లేక
విషమాంబకుం డనువెఱపు లేదేనియుఁ బ్రళయాగ్నిరుద్రుఁ డన్ భయము లేక
పంచె నట్టియుగ్రుపై నిన్ను నదిమీఁదఁ బోయి తనకు లగ్నఁ బోయి లగ్గ
వచ్చునే ప్రధానవైరాన మరణంబు ధ్రువ మనంగ వినఁడె దివిజవిభుఁడు. ౪౧౭

చ॥ విడ్డిపక పంచె నాకఁడొకఁడేలినవాఁ డని పూనికాఁడవై
పొడువఁగఁ బోయె దీవు నొకపోటరిమూఁటవ నీకు నక్కడన్
మృడుఁ డొకయెల్లిదుం డకట మెచ్చక సింగపువేఁట లాడఁగాఁ
గడఁగెద రిట్లు నైనఁ దుది గాకెడ నింద్రుఁడు నీవు దక్కఁగన్. ౪౧౮

౪౧౪. తఱిమి=నిర్బంధించి «కీడుగాంచి...నొండెండ్లు లేదని। తఱిమి యడుగుటయును వెఱపువాసి» నిర్వ-ఆ-౮. «ఇత్తెఱంగుననూఱార్చి యింతిఁదఱిమి। యల్లనల్లనదోకొని» నిర్వ-ఆ-౯. ౪౧౫. ఒదవుడు=ఒదవుట. ౪౧౭. ఇట్టి సంధికి:— «అన్నిష్టసఖియూదియున్న దాని» భార. ఆది. «వైరేణమరణంధ్రువమ్మనంగదివిజవరుడు వినఁడె.» అను పాఠాంతరము.

క ॥ ఆనాకంబున గలయు । మ్మానిను లందఱును నీకు మన మిడ్డి యున్నం
దాని సహింపక సురవిభుఁ । డీనెపమునఁ జంపఁ దలఁచి యీపనిఁ బంచెన్.

క ॥ నినుఁ జూచినకన్నుల సుర । వనితలు దనుఁ జూడకున్న వాసవుఁ డలుకం
జని చానిన్ బంచినఁ జాఁ । జను నే యాతనిచలంబె సాధ్యము గాఁగన్.

చ ॥ త్రిదశులు విల్చి పంపు డోకతేజమ్ముగాఁ గొని దేవదేవు నె
ల్లిదముగఁ జెప్పి యింతగాని లేవడిలేచెదు ప్రాణగొడ్డ మా
డెదు మది నోటకండ సెడి డెప్పరికంబులు సేసె దిట్టిక్రొ
వ్విదములు దక్కు మీపలుకు విష్ణుఁడు లక్ష్మియు విన్న మెత్తురే. ౪౨౧

గీ ॥ హరుఁడు నెపమగ్గి చూచుడు నాతఁ డంబ । యఖిలజగములు సంహారమగురయమున
నట్టియుగ్రుపై నటేవోయె దకట లగ్గ । మేలుమే లెంతమీ లెంతిమేలఁ ద్రాగు.

క ॥ కనుకట్టిన నిట్టిక నమ । లినవిశిఖమున దేవతావలికిఁ బూనితి నే
నని రుద్రున కులికి పైఁజని । చెనయుట శిఖిశిఖల మిడుత సెనయుట గాదే. ()

వ ॥ అని పరమేశ్వరు నెఱింగించుచున్నరతిం గనుంగొని. ౪౨౪

ఉ ॥ ఏ నలరమ్ము లొగ్గఁ బరమేశ్వరుచిత్తము గౌరిచిత్తముం
ద్రాస కరంగి కూడ మఱి దానికి సందియ మేల వెండియు
బూనెద మూఁడులోకములఁబుట్టనిపూనికి వారిమేనులు
న్మానుగఁ గూర్తు నొక్కటిగ మార్గణకౌశలభావ మేర్పడన్. ౪౨౫

గీ ॥ జగము లెల్లను నాయాజ్ఞ మిగుల కునికిఁ । గనియు వినియు నెఱుంగుదు వనజనేత్రి
యింతభయమునఁ బొంద నీ కేల మది భు । జంగభూషణు నబ్బాటగొంగఁ జేసి.

---

౪౨౧. పంపుడు=పంపుట. ౪౨౨. మీలనుమీలుద్రాగుననుటకు : ‹‹ మండల
నాథునాజ్ఞకుసమస్తజనంబులునోడిపాఁడిమై । నుండకమేరతప్పిబలియుండబలున్ మనసీక
పెద్దమీన్ కొండికమీనుద్రాక్రియఁ గ్రొవ్వునఁజంపుచునున్న ప్రేఁకమ । మ్మండలనేలియుండ
మతిమంతులకుంబరపక్షభైరవా" అని భద్రభూపాలుని నీతిశాస్త్రిముక్తావళి. మఱియు
‹‹ తగరుకొండమీఁదఁదాఁకగోరినాదారి । నెనరితన్నుదెలియకింతపలికె । నెంతమీనువచ్చి
యెంతమీనుమ్రింగె" రాధికాసాంత్వనము.

వ॥ అని మనసిజుండు మీఁదు లేక పలికిన విని రతి పరమేశ్వరుమాహాత్మ్యంబు దలంచి వెండియు నిట్లనియె. ౪౨౭

చ॥ అతనిశరాసనంబు కనకాచల మిక్షుశరాసనంబు నీ
కతనికి నమ్ము పాశుపత మంటినఁ గందెదుపువ్వు లమ్ము నీ
కతఁడు పురాపహారి విరహాతురపాంథజనాపహారి నీ
వతనికి నీకు హస్తిమశకాంతర మెమ్మెయి నెన్నిచూచినన్. ౪౨౮

గీ॥ ఈశుఁ దలఁచుమహాత్ముల హృదయములును। గాఁడ నోపని మృదుపుష్పకాండనికర
మతని భేదింపనోపునే యంగజన్మ। తమ కసాధ్యుల సాధింపఁ దలఁపఁ దగునె. ()

గీ॥ ఆఁడుదాన నబల నైన నేయించుక యలిగిచూచుడును భయమున దలరు
దుగ్రనుగ్రలోచనోద్భూతవహ్నికి నెదిరి నిలువ నీకు నెంతకోలఁది. ౪౩౦

సీ॥ కోని బాలు రైనను దిని పిప్పియమినెడుచెఱకు విల్లని నమ్మి చేతఁబట్టి
మెలఁతలతలవెండ్రుకలఁ బొంది కందెడునలరుపుష్పము లమ్ము లని తలంచి
తలిరాకులైనఁ గదల్ప నోపనిమందపవనుఁడు నొకపెనుప్రాపు గాఁగ
నబలలు సోఁకిన నాకాశమునఁ బోవునలిశుకములు మూలబలము గాఁగ
నెంతవేసవి మ్రుట్టిన నెండఁగమరు నసువసంతుండు దగుసహాయంబు గాఁగఁ
గాకిపిల్లల కోడుపికములు ఁబోటు। మగలుగా నుగ్రుపైఁ బోవఁదగునె మదన.

చ॥ చిరముగ నుల్లువద్దనరసింహునికంటెను బెద్దవే శిరం
బురలఁగ నాటువద్దజలజోద్భవుకంటెను బెద్దవె పెనుం
గరిగొనఁ గాల్పువద్దజముకంటెను బెద్దవె నీవు విశ్వసం
హారు నుఱ [illegible]త్తిపోయి కలహంబున నోర్వఁగ నీయలంతియే. ౪౩౨

చ॥ హరికంకాలము చేతిముద్ర దివిజేంద్రాస్థుల్ సుభూషావళుల్
గరళం బభ్యవహార మంతకతనుత్సారంబు సైపూఁత పం
కరుహాసీనశిరఃకపాల మురుభిక్షాపాత్రగా విశ్వసం
హరువర్తించుమహోగ్రతోపహతి నేయంబూన నీప్రాప్తియే. ౪౩౩

వ॥ అనిన విని బలపరాక్రమాతిధైర్యశౌర్యమంత్రతంత్రధ్యానధారణైశ్వర్యాద్యశేష
దివ్యశక్తు లెంతవిశేషంబు లయ్యును జంద్రకాంతోపలంబులుఁ జంద్రకిరణస్పర్శ

సంబునం గరంగునట్టు లతికోమలం బైనకాముశక్తికి లోనై మృదుభావంబునం బొందు|నిది జగంబునం దనుభవసిద్ధం బది యెట్లనిన. ౪౩౪

గీ॥ అదిమిపట్టినఁ గరుతైనఁ జదియు నట్టి। కడిఁదిబలు లగుమగ లాత్తి కౌఁగిలింపఁ
గుసుమకోమలు లగుసతు ల్కాసరుచునికి। గినియు నైయుఁగవె విపరీతకామశక్తి.

వ॥ దానికిం గారణం బేమి యుంచేని. ౪౩౬

క॥ ఆరయఁగా స్త్రీపురుషా। కారములై చిత్తవృత్తి గలిగినఁ జాలుఁ
వా రెల్లఁ గామవశు లగు। వా రని నియమించి నాకు వర మజుఁ డిచ్చెన్.

వ॥ అని యాదిసృష్టికిని గారణం బైనకామతత్త్వమహత్త్వంబు దెలిపి రతి నూడం బల్కిని రతీశ్వరుఁడు పరమేశ్వరుపైఁ బోవ నుద్యుక్తుం డగుడు నాక్షణంబ. ()

సీ॥ పంకరుహంబులు బండికన్నులు చంపకంబులు నొగ లుత్పలంబు లిరుసు
గరవీరములు పలుఁగాఁడి జాఱులు సహఁగొయ్య లశోకముల్ గోడిపింఁట
సింధువారంబులు సీలలు గేతకుల్ మొట్టులు మొల్లలు మెట్టుగుదెలు
పాగడలు పలుపులు పున్నాగములు పగ్గములు సహకారముల్ పూనుగాఁడి
కురవకాసికమాలంపుఁగోల కైర। వములు మునుకోల కోకము ల్వాహనములు
గా వసంతుండు సూతుఁడై పూవుఁదేర। నెరయఁగుసుమాయుధంబులు నినితెచ్చె.

వ॥ అంతరతిసమేతుండు పుష్పాయుధుండు పుష్పరథారూఢుండై నిజసామ్రాజ్యవిభవైశ్వర్యంబులతో నతిరయంబున హిమవంతంబున కరిగి పరమేశ్వరుతపోవనంబు సొత్తెంచెఁ దత్‌క్షణంబ. ౪౪౦

మ॥ వలరాజామనిఁ బిల్చి వేగ మెయి నీవాసంలికానందదో
హల మీకాననలక్ష్మికి మ్మనుడు నాహ్లాదంబుతో నెయ్య మ
గ్గలమై యుండ వసంతకుండు దమనైఁ గన్నిగ్గఁ గారాకుఁ గెం
దలిరా కయ్యెనో నాఁ దలిర్చె వడిఁ గాంతారాంతరోర్వీజముల్. ౪౪౧

క॥ తనఁగూడ ధనదదిశాంగన నిముఁ డొడఁగూడఁ బోక్క గని యామ్యదిశాం
గన నొచ్చి వెచ్చనూర్చెనొ యన శిశిరవిముక్తదక్షిణానిల మెసఁగెన్. ౪౪౨

చ॥ మలయసమీరణాభిహతి మ్రాఁకుల నాకులు డుల్లి డుల్లి క్రొ
మ్మొలకలు సాగి సాగి పిరిమోసులఁ గెందలి రొత్తినొత్తి ను

ట్మలములు గ్రమ్మిక్రమ్మి కుసుమంబులు వాసన కెక్కియెక్కి గు
త్తులు గొని పండిపండి ఫలసంతతుల్ దగ నారము లొప్పె నామనిన్. ౪౪౩

క॥ భోరన నంకురపల్లవ। కోరకపుష్పఫలవితతిఁ గొమ రమరి మనో
హారములై సారములై। యారామము లొప్పె మధుసమాగమవేళన్. ౪౪౪

వేదన విరహులు నేదలు నెడి సంధు లెడలంగఁ బల్లంకులెడలెఁ దరుల
రాగిల్లుకపలమేఁడ్తిగలఁ బులకంబు లంకురింపఁగఁ దరు లంకురించె
సమ్మదంబునఁ గామిజనులచిత్తంబులు చిగురొత్తఁ దరులందుఁ జిగురు లొత్తె
రతిదోహలమున దంపతులముఖాబ్జముల్ విలసిల్ల వికసిల్లె విరులు దరుల
నెలమిఁ జిలుకపిండు తొలుమేనఁ జేసినతపము పండఁ బండెఁ దరువనంబు
లుపిద లింపుమిగుల నోయలపాటలు వాడ మధుమదమునఁ బాడె నలులు. ( )

క॥ మదనుతలిరాకల్లులకో యనఁ। బొడిగొని కెందలిరు లెసఁగు భూరుహముల్లపై
నొదవెడురాగాంబుధి బు। ద్బుదములునా నెసఁగె ముకుళములు తోరములై.

ఉ॥ పొన్నలు పూచెఁ బొన్న లొగిఁ బూవకముందఱఁ బూచె గోఁగు లా
పొన్నలుఁ గొండగోఁగులునుఁ బూవకముందఱఁ బూచెఁ బూరువుల్
పొన్నలుఁ గొండగోఁగులును బూరువులు న్నొగిఁ బూవకుండఁగా
మున్న వనంబునం గలయ మోఁదుగు లొప్పుగఁ బూచె నామనిన్. ౪౪౬

క॥ భావజవిభుఁ డలిశుకపిక। సేవకతతి కెడరుదీర జీతము సేయం
గా వెలిఁబోసినపసిఁడుల। ప్రోవులు నాఁ దమ్ము లెలమిఁ బూచె బెడంగై.

క॥ నలి మొగ్గలువిరిపువ్వులు। సలలిత మయి చూడనొప్పెఁ జంపకమ్మతుల్యా
జ్వలరుచిరేవగలూరక। వెలిగెడునుద్దీపదీపవృక్షమువోలెన్. ౪౪౮

గీ॥ పొలిచె మధువేళఁ గంకేళి పూచి భృంగ। పరివృతమ్మై మనోజుండు పాంథతతికి
నాభిచారంబు వేల్చుకుండాంతరమున। దగిలి కామాగ్ని పొగలతో నెగయునట్లు.

క॥ విరహులహృదయంబులు జ। ర్ఝర్ఝరితంబులు చేసి మరుద్దు శరశస్త్రము లా
నరవృత్తిఁ బెటికి పట్టిన। కరణిం గర మొప్పె నరుణకరవీరంబుల్. ౪౫౧

క॥ నను పగుస్తలిగాన్నము విని। వనదేవత గరము మెచ్చి వానికి నొసఁగం
జనఁ బైఁడుల వీడెలు వ। చ్చినవిధమునఁ బొన్న లెలమిఁ జెలువుగఁ బూచెన్.

క॥ సురపొన్నలపైఁ బ్రాఁకిన। గురువిందలు ననలఁ బెరిగి కోమ రమారతీ
శ్వరునకు వసంతుఁ డనుగొన। పరి చేసినముత్తియములపందిరివోలెన్. ౧౫౩

క॥ మారుజయలక్ష్మి మలయస। మీరునిపైఁ బూఁత మధుసమృద్ధికి నురుశృం
గారం బనఁదగు నన సహ। కారముఁ గురువకముఁ గర్ణికారముఁ బూచెన్.

చ॥ మొగడలు వజ్రముల్ విరులు ముత్తెము లింపగునున్న గెంపు లేఁ
జిగురులు పద్మరాగములు చిల్కలు వైరిజరాజి తుమ్మెదల్
నగరిపునీలజాలములు నాఁ దనరారె వసంతవల్లభుం
డగువలరాజుపంచమణిహర్మ్యములో యనఁ జూతభూజముల్. ౧౫౫

క॥ చననున్మదనమదనమో। హనసంతాపన వశీకరాస్త్రము లని హృ
జ్జనునకు నంకురపల్లవ। ఘనకోరకపుష్పఫలనికర మామ్రములన్. ౧౫౬

స॥ పల్లకైదుకారాకులలితాస్థిచయముగా నోలుకొమ్మలు పలుకేలు గాఁగ
బాలుపల్లవములు ప్రేలుకెంజెడలుగాఁ బెనఁగుతీగలు దొడ్డఫణులు గాఁగఁ
గలగంతనికరంబు గళమునకప్పు గాఁ బుప్పొడి మేనివిభూతి గాఁగ
ఫలములు వరదానఫలములు గా నలిమాలికల్ రుద్రాక్షమాలికలుగ
శంభుమూర్తిఁ దాల్చి సహకారభూరుహచక్రవర్తి నవవసంతవేళ
నతిశయిల్లుచుండె నక్కడఁ గని మది నుదరిపడి మనోజుఁ డోసరింప. ౧౫౭

చ॥ అలరులమందహాసమున నన్నినషట్పదమంజుగీతి రా
చిలుకలముద్దుమాటలనుఁ జెంవలిరాకులసొగలీలఁ గో
కిలనినదంబులన్ బహిరకేశభరంబున ముక్తపగ్గమే
ఖల నభిరామ మయ్యె సహకారలతాంగి మధుప్రసంగలిన్. ౧౫౮

క॥ తలిరెల్లి పూవుటమ్ముల। బలసినపికకీరభృంగపరివారముతో
వలరాజుఁ బోలి మామిడి। సలలితగతి నుతవసంతసంగతి నొప్పెన్. ౧౫౯

---

౧౫౮. నా। చేననుచుంబతాకయును జెంపరుణాచలమెక్క..." త్రిపురాంత కోదాహరణము.

౧౫౯. వన్మథుని ఛత్రముపల్లవమైనందులకు "కర్ణికారపుమొగ్గకనకంపుగుబ్బ గాఁగోయిలనోరూరు గొడుగుతోడ" ఉ-హరి. ఆ-౨, "కోకిలవ్రాతంబు గ్రుక్కిళ్ళు మింగించు క్రొమ్మావిచిగురాకుఁగొడుగుతోడ" హరిశ్చ-ఆ-౩.

చ॥ మలయసమీర మద్ధి సుకుమారలసత్పికకారనందనా
వలి నడిఁజొచ్చుఁ జొట్టుకొనివచ్చుఁ గుజాలికిమెచ్చు నీరిక
ల్వలు పొనరించుఁ గెందలిరు వెంచు ననల్ విరియించు దాని న
ర్మిలిఁ గబళించు నాదట రమించుఁ దమిన్ విహరించు నామనిన్. ౪౬౦

చ॥ అలు లాడఁగూడుఁ బిండుగొని యాడు మృదుధ్వనిఁ బాడు నోలి దొం
తులుగొని పాఱు జొంపములు దూఱు సుగంధము మీఱుఁ బువ్వగు
త్తులపయి మూఁగు బుష్పాళులం ద్రావు వడిం దనివోవుమంజరుల్
వెలువడ నేఁగు దర్పమున వీఁగు మదిన్ నలిరేఁగు నామనిన్. ౪౬౧

చ॥ చెలఁగుచుఁ బాఱి చొక్కి కటిఁ జీఱి వనంబులు దూఱి చిల్కపిం
డెలఁ బ్రాఁకి ద్రాక్ష కెందలిరు లెక్కకొలంకులు నిక్కి చూచి కా
యలు గని మ్రానిపండ్లరస మాని ముదంబున నూని పల్కుమున్
పాలు పడరంగ దంపతులు వాంగ వియోగులు గ్రుంగ నామనిన్. ౪౬౨

చ॥ గుజురులు గట్టి యీరికలు గుట్టి ప్రవాళము వట్టి కింకతో
నమలక మ్రింగి మొగ్గలఁ బెనంగి విరుల్ గని వొంగి పూఁప లు
త్తమ మని చావి యుద్ధవడిఁ ద్రావికొను న్నెలమావియందుఁ గూ
రిమి పడఁజేయునామనిని రేముపవల్ వడి గూయుఁ గోవిలల్. ౪౬౩

మత్త॥ మెత్తమెత్తన చందనాద్రిసమీరణుండు మనోభవుం
డెత్తకుండఁగ నేగకుండఁగ నెత్తు నెత్తక తక్కినన్
జత్తు సుమ్ము వసంతుచే నని చాటునట్లు చెలంగె నా
మత్తకోకిల లాఁటలిమిం గడ బాసరం బగునామనిన్. ౪౬౪

సీ॥ ఆరగ్వధార్కజంబీరకరోకులమందారచందననారికేరసింధు
వారకంకేళిఖర్జూరశాల్మలిఘనసారచంపకబీజపూరదేవ

---

౪౬౧. ఏఁగుశబ్దమునకు ఉన్నది :— "కాఁగానిమాటలాడెదు। రాఁగూడదు...నుండం। గాఁగోమలియిటునిల్వక। యేఁగుముమగనాలికేలయీదుర్గుణముల్." భోజ-ఆ-౪ "తాఁగడువేగిరించె...। లోఁగుచునింతనుండి...। నేఁగుచు..। దాఁగుటదేని పేమిలిడింపిరి" ప్రభా-ఆ-౧౬.

దారుసల్లకికరవీరగుగ్గులుపీతసారపున్నాగనమేరుకర్ణి
కారధాత్రీత్వచిసారపటలసహకారభల్లాతకపారిజాత
భూరుహారూఢపికరాజకీరమదమ। యూరమధుకరమృదుమధురారవములఁ
జారుతరమైనభూరికాంతారమహిమ। గారవించుచుఁ జనుదెంచె మారుతంబు

క॥ మధుసంగమునఁ ద్రిలోకీ। వధు వనురాగమునఁ గామవశగతిఁ జేతో
విధురవిధి నడరె నట్టిద। మధుసంగతి జనులు రాగమయు లగుదురుదే. ౪౬౬

సీ॥ నెలఁతలపరిమళనిశ్వాసపవనంబు దలఁపించె దక్షిణానిలవిలాస
మింతులదరహాసకాంతి సంభావనఁ గావించెఁ జంద్రప్రభావిభాతి
రమణులరక్తాధరభ్రాంతి నొదవించె లాలితాశోకప్రవాళలీల
వనితలమంజులస్వనశంకఁ బుట్టించెఁ గలకంఠమదకీరకలకలంబు
గామినీవిలోలకర్ణాంతవిశ్రాంతలోచనప్రశంసాలోలబుద్ధిఁ
బడసె దలితపద్మపద్మవిభ్రమము వియోగులందు మధుసమాగమమున. ౪౬౭

క॥ సోలుచు సమ్మదరసమునఁ। దూలుచు వనపాలబాలికలు నవలతికాం
దోలముల వేడ్కఁ నలుపుచు। నాలతు లాగిఁ జేసి పాడి రభినవలీలన్. ౪౬౮

సీ॥ కరి యిచ్చె నరమేసి కరిణికి సల్లకీపల్లవ ముల్లంబు పల్లవింప
మృగ మర్థిఁ గజళించి మృగి కిచ్చె నంచుదర్భాంకురంబులు చిత్త మంకురింప
హంస పెకుకవ నిచ్చె హంసికి నోర్చోర నెదురుదుమొగముల నెలమి మిగుల
భృంగము దావితో భృంగికి దయ నిచ్చె మధుధారముఖరాగముదముదలఁ
గిన్నరుండు దోల్చెఁ గిన్నరివీనుల రాగరసము నొన రాగ మొసఁగ
మధువిడంబనమున మగలును మగువలు। విరలిగొనిరి మదనపరవశమున. ౪౬౯

క॥ ఆమనికి నెలమి విపులా। రామంబులపాల్పు నూచి రాగోత్కటమై
కాముఁడు రతిఁ గని తానునుఁ। గామాతురుఁడై మనోవికారము వొందెన్.

---

౪౬౬. అగుదు=అగుట.

౪౬౮. ఆలతి=ఆలాపము. ‹‹ వల్లభుమీఁదియర్మిలి నెపంబుమలంగిమనంబులో నరా। గిల్లికుచాంతరంగమునగిన్నెరమోపిగుణంబుసారెము। న్నల్లనమాట నూలొక నెదునాలతిసేసినిజాంగలీలశోభిల్లఁగఁబాడెదైన్యబలభిద్వనుధాధరుమంత్రిశ్రీధరున్ ”
హంళికిక భాస్కరునిదశగతులు. ‹‹ ఆలతినేయుఃభృంగమాలికలకు బెదరిజెదర” దశ. అ- ౩.

సీ॥ లత్తుకరసమునఁ జొత్తిల్లఁ బదతలములఁ గరచేతుల మోవిఁ బూని
నవకుసుమంబుల నానావిధంబులఁ దొడవులు రచియించి తొడిగిపి వేడ్క
రాజీవపుష్పపరాగంబు గబళించి విలసిల్లుసీమంతవీథిఁ బోసి
యరవిరి సురపొన్నయకరువు వరుసతో నలకలఁ జిన్నిపు వ్రాలికి కలయ
సలలితం బగుపుప్పొడి డులిచి వీఁగుఁజన్నుఁగవమీఁదఁ బోయుచుఁ జెన్నుమిగుల
సుదతిఁ గైచేసి ప్రీతితోఁ జూచుచుండె। భావజన్ముండు వచ్చినపనియు మఱచి.

వ॥ ఇట్లఖిలభువనభవనాపూరితంబై సకలజనానందకరంబై యతిరమణీయం బైనవసం
తోత్సవంబునం దత్యాకులోచితక్రీడాపరవశుండై కంతుండు బెదరి నిజగమన
ప్రయోజనంబు దలంచి/యాక్షణంబ. ౪౭౨

మ॥ దళితాంభోజదళాంగుళీత్రనుత్రిరస్త్రాణంబులుం గోమలే
క్షులసచ్చాపము నబ్జసూత్రగుణముం జూతాంకురాశోకకు
ట్మలజాతిప్రసవాస్త్రపూర్ణశరధుల్ మంత్రించి వశ్యాత్మతా
దులసన్నాహము సేసి మారుఁడు/జగత్క్షోభంబు సంధిల్లఁగాన్. ౪౭౩

వ॥ ఇట్లుసమశరుండు సమరసన్నద్ధుండై సకలజనంబులు నభినవవసంతోత్సవంబున
ననురాగరసపూరితహృదయులై పరవశులై యున్నం గని హరగిరిజల కంతకుం
దమయంతన సంగమం బగు నా వచ్చినకెలసంబు వసంతుపలనన తీరకున్నెయని
పరమేశ్వరావాసంబున కనతిదూరంబుగాఁ జని ముందట. ౪౭౪

మ॥స్ర॥ హరహాసాకాశగంగాత్యమలజలమరాళాబ్జనీహారధాత్రీ
ధరకర్పూరేందుకాకోదరవరపతిదిగ్దంతిపక్షీరనీరా
కరముక్తాహారకుందోత్కరరజతశరత్కౌముదీద్యోతకీర్తి
శ్వరు నాత్మారాము వాణీవరు వరగురు సర్వజ్ఞు నజ్ఞానదూరున్. ౪౭౫

క॥ దీపితవిమలజ్ఞానను। డీపితసుఖదళితమోహతిమిరాపహర
వ్యాపారు సర్వసుజనద। యాపరు నచలాత్మ మల్లికార్జునదేవున్. ౪౭౬

మ॥స్ర॥ శివధర్మార్థప్రవీణున్ సితియుతుఁ ద్రిజగత్సేవ్యు వేదాంతవేద్యున్
భవభావాభ్యూహమారున్ బ్రవిమలగుణు నభ్రాంతచేతస్కు నంగో
ద్భవబాణాఘోరతాపాపహతు నచలు నిర్భగ్న నీశాంబుతోమో
ద్భవసద్భక్తిగాఢమానోత్తమహృదయు మహోత్సాహు నానందదేహున్.

## చతుర్థాశ్వాసము

క॥ హరితపస్సాధనమారయు, నరిషడ్వర్గాటవీదవానలుఁ గర్గా
బురుహసుధాకర భవసాగరకుంభజు దివ్యముని శిఖామణి ననఘున్. ౪౭౮

వసంతతిలకము॥ సాహిత్యవేది గుణశక్తు వివేకయుక్తున్
మోహాదిదోషపథముక్తు బుధానురక్తున్
మాహేశ్వరప్రకరమాన్యు సదావదాన్యున్
దేహేంద్రియాఘజయధీరు సుమేరుసారున్. ౪౭౯

గద్యము॥ ఇది శ్రీమజ్జంగమమల్లికార్జునదేవదివ్యశ్రీపాదపంకజభ్రమరాయమాణకవిరాజశిఖామణి, నన్నెచోడదేవప్రణీతం బైనకుమారసంభవం బనుకథయందు చతుర్థాశ్వాసము.



శ్రీ

# కుమారసంభవము.

## పంచమాశ్వాసము.

శ్రీభాషాశ్రితసన్నుత। భాభాసితవిమలవదన పంకరుహుం దపః
శ్రీభామావిభు గుణర। త్నాభరణాభరణు మల్లికార్జునదేవున్. ౪౮౦

చ॥ అమరఁగ నింద్రియాదివిషయంబులతో విషయంబు లన్నియుం
గ్రమమున గాడ్పునం దడఁచి గాడ్పులఁ గూర్చి మనంబునందు సం
యమమతిఁ దన్మనం బొనర నాత్మునియం దొడఁగూడ్చి యాత్మయో
గమునఁ జలింప కున్నశివుఁ గాంచె మనోజుఁడు దవ్వుదవ్వులన్. ౪౮౧

క॥ హరుఁ గని ప్రాణము ఝల్లని। వెఱసిన మెయిఁ జుచ్చి పచ్చవిల్తుఁడు దగఁ జి
త్తరువున వ్రాసినకాముని। కరణి నచైతన్యవృత్తిఁ గదలక నిల్చెన్. ౪౮౨

వ॥ ఇట్లు నిలిచి యాక్షణంబ రతిప్రబోధితుండై త్రిణయనుసమాధివైకల్యంబు సేయ
నుపక్రమించి నిజమూలబలంబుల నవలోకించిన. ౪౮౩

మ॥ అలిఝుంకారముఁ గీచకస్వనముఁ గీరాలాపముల్ మత్తకో
కిలనాదంబులు శారికారవములుం గేకినినాదంబులుం
గలయం భోరన మంజుగానములతో గంధర్వగీతంబు లె
గ్గలమై భోరన మ్రోసె సీశ్వరులతాగారంబు ఘూర్ణిల్లఁగన్. ౪౮౪

వ॥ ఇట్లు విపరీతమధుజృంభణంబు గని విస్మితుం డగుచు. ౪౮౫

క॥ శంభుసమాధికి విఘ్నా। రంభము లై యలియువనచరములకు జిహ్వా
స్తంభగతి స్తంభమున। స్తంభములుగ నంది హస్తసంజ్ఞ నడచెన్. ౪౮౬

వ॥ అంతం దదాజ్ఞాప్రభావంబున. ౪౮౭

గంతుఁ జేయఁదొడఁగె నంత నీశ్వరునకు నచలవృత్తిఁ జలుపు నాత్మనిమల
యోగభావ మెడపి రాగోత్కటంబున గౌరియందు నిలిచెఁ గన్ను మనము.

క॥ గిరిజలలితాంగమ్ములు । వారిఁబోరిఁ గనుఁగొని సొగపి యనుకంపాస్రుజలముల్
దెరలఁగ విరిసినగతిఁ బోది । విరిసి మహేశ్వరుమనంబు వికలం బయ్యెన్. ()

గీ॥ వరసుముఖదీప్తి వెడలి పార్వతిముఖంబు । ప్రీతి విలసిల్లి కలయఁ జేర్చెందు లెపఁగి
వెల్లదివెన్నెల దొలుపారి విరిసిమీఁద । మంచువేరిన చెంగొవపూడ్కివోలె. ()

క॥ మెఱుఁగు లగువాఁడిచూడ్కులు । నెఱుకులు గాఁడఁగొన నగజ నెరవిడిఁ జూడం
దెఱపిగొనుకతనఁ గాకిదఁ । జెఱినాఁ డన్మరుశరంబు భేదించు హరున్. ()

వ॥ మఱియు నత్యాసక్తి ననురాగిల్లి. ౧౯

సీ॥ ఎలరారుకనుఁగవ వొలయించుఁ గ్రేవల నెఱిగొని మెఱుఁగులు దుఱఁగలింప
గ్రొవ్విరిచిఱునవ్వు నవ్వ వాతెఱకాంతి రంగిల్లి సితరుచుల్ దొంగలింపఁ
గుదుటఁ గ్రక్కదరిన నుడుపిల్లు గడియించు నుడిసి ముత్తరఁగలు గడలుకొనఁగ
సోలంబు నెఱిసూరసోగియునుం జెమటపై వదలి మేఁదీగ మవ్వంబుమిగుల
నొత్తరించుఁ దఱచు నూకించు దామి క్రాలించు నెఱియు నప్పలించు
మదనశర విభిన్నహృదయాబ్జయై మహాదేవుఁ జూచి గౌరిదేవి యపుడు. ౨౦

వ॥ ఇట్లు మదనపరవశ యగుచున్న పార్వతీముఖాలంకారంబు గనుంగొని సొగిసి
యాక్షణంబ. ౨౧

ఉ॥ ఆరుచిరాననాబ్జదరహాసవిలాసవికాసభాసినీ
హారికరాతిభాతి నమలాంగశరీరతుషారదీప్తికాం
తోదినగంబు సన్ముదరసోత్కటఘర్మజలంబు పర్వి హా
ల్ఫారె హిమాచలంబు నమరాధిపవాహిని గట్టినట్టిదై. ౨౨

వ॥ మఱియుం గనుగొంటం బైనఁ ద్రావఁగొనక. ౨౩

సీ॥ పులకాంకురంబులు దల లెత్తి మేను గంపింపఁ గోమలిఁ గౌఁగలింపఁ దలఁచు
రాగోత్కటమున స్థైర్యంబులేక మానినిఁ గామ్యాన చైపడి కవయఁదలఁచు
లలితాంగియవయవములు సూచి మఱి పనివోవక చూడ్కులఁ ద్రావఁదలఁచు

క ॥ తన కగసుతపై రాగము। మనసిజుపై ద్వేషముం గ్రమంబున నైనం।
జనియెఁ దప ముడిగి శివుఁ డెడ। పని రాగద్వేషములఁ దపము సెడు డరుదే. ()

వ ॥ ఇట్లు గిరిశుండు రజతగిరి కరిగిన గిరిజ హరవిరహతాపంబునం బరవశయై పడి యుండె నంత నంత వృత్తాంతంబు హిమవంతుఁ డెఱింగి రయంబునం జనుదెంచి యాక్షణంబున. ॥౩౫॥

గీ ॥ కీలుబ్రదిలి తటిల్లత నేలఁబడినఁ। బరవసంబున శారదాభ్రంబు మగుడ।
నెత్తికొనిపోవు గతి సుమ హిమనగేంద్రుఁ। డెత్తుకొని నిజపురమున కేఁగె నంత.

వ ॥ ఇట్లు రతి పతి నగ్నిశిఖలు గప్పుడు భయరసావేశంబునం దల్లడిల్లి. ॥౩౭॥

క ॥ పరవశయై పడి రతి సె। చ్చెరఁ దెప్పిఱి లేచి చూచి శిఖిపాదపు నిజే
శ్వరుపాడపు గాన కచ్చటఁ। బురుషాకృతి నున్నభస్మపుంజముఁ గాంచెన్. ()

వ ॥ కని కలవలించుచు. ॥౩౯॥

తరువోజ ॥ కాయజు డాయగ్నిఁ గాలెనో నెఱియఁ గాలంగ నెడయెద్ది గడుభీతిఁ బాఱి
పోయెనో ననుఁ బెట్టి పోవునే కడచి పోయిన నీభస్మపుంజ మొక్కడిద
మాయమో యిది యని మదియఁ బొదల భ్రాంతుల చెట్టుల మఱువునఁ గలయు
నాయింత భ్రమగొని యడ లతి సంశయాకులచిత్తయై యాత్మేశు రోసె. ()

వ ॥ వెండియు నన్వేషించి ప్రలాపించుచు. ॥౪౧॥

గీ ॥ నన్ను నురయుంగ వేఁడియే నాథ యిచటఁ బొదవు సూపక డాఁగి తీపొదలలోన
నిన్నుఁ బాసి చరింతునే నిమిషమైనఁ। గామరహితంబుగా రతి గలదె యెందు.

క ॥ రతిహితుఁడ వనఁగ నెప్పుడు। రతిసంగతి నుండు దీవు రతి నిప్పుడు దుః
ఖితఁ జేసి పోయి తక్కట। రతి వంచనచేసి పోక రసికులగుణమే. ॥౪౩॥

గీ ॥ అలుగడు నెదమెఱుఁగనియాఁటదాన। మెలఁత నవిభీత నన్ను నమ్మించి తెచ్చి
కాననంబులోఁ గన్నులుకట్టి గాడు। పెఱిచి నీ కెట్లు పోఁజన్నె భావజన్మ. ()

వ ॥ అని ప్రలాపించుచు మగుడిం జనుదెంచి పుష్పకోదండపల్లవఛత్రమకరకేతనం బుల నచ్చుపడి యున్నమదిభస్మాకారంబుఁ గని త్రినయనానలాహుతుం డగుట నిశ్చయించి శోకపరవశయై పడి చేతరించుచు. ॥౪౫॥

---

౩౬. సడుడు = సెపుట.

౪౫. చేతరించుచు = మూర్ఛదేఱుచు. "శోకోద్రేకదినమూర్ఛాగతి నాగిన్పు నీగిలి చేతఃసుగుమున్నుం డివ్రప్రాపమనుపసంహారపుడు." రన్నకవిగదాయుద్ధము.

మ॥ ప్రణుతాంగోద్గతఘర్మకంకణములున్ బాహుద్వయాకీర్ణకం
కణముల్ ఘోరన ధారుణిం దొరఁగ నాకంపించుచున్ లేచి భూ
షణరత్నప్రభతోన పర్వుచు సితాక్షిద్యోతు లందంద ది
గ్గణికాక్షుల్ మిఱుమిట్లుపోవఁ బాలయంగాఁ జూచు విభ్రాంతనై. ౫౪౭

క॥ ఏమెడఁ బతిఁ బాడగానక। హాయని యొలుఁగెత్తి దిక్కు లరయుచుఁ గనుచున్
గూయిడు మొరయిడుఁ బలుమఱు। వా యుమపక చీరు నేన్చు వడి వాపోవున్.

వ॥ తదనంతరంబ. ౫౪౯

సీ॥ సొలయునిట్టూర్పులకలకలంబులతోన యా ర్తరవంబు మి న్నుముట్టఁ జెలఁగ
దంపడి దొరుగుచేక్కిండులతోడన కన్నీరు ధారలఁ గడలుకొనఁగ
నిరుగడఁ బాదివిచ్చి విరియువేనలితోన సూహాంఛితమసంబు నుంచుకొనఁగ
వెడ బీటవాఱి నెవ్వడవడుమోవితో ముడిఁగి వాడినయొగ్గు వడఁకుచూప
తలను లెద మోఁదఁ బెరిఁగినతారహార। ధాళితో సోముమెన్నెల పలుకఁబాఱ
బిట్టు వెసఁదాఁకుచిచ్చుటపిడుగువోలె నడలురతిఁదాఁకు మెయిమున్ను మూర్ఛముడిఁగిపడఁగ.

వ॥ ఇట్లు చలచలం బగునడలడిం బడి రదలి పతివలను గనుంగొని. ౫౫౦

చ॥ సలలితసాంద్రకుంకుమము చన్నులపై మెయిఁ బ్రీతి నాకు నీ
వలఁదినచందనంబు తడియారదు నేనియు నంగజన్మ నీ
విలసితచారురూపతనువిభ్రమసంపద లీక్షణంబులోఁ
బొలుపఱఁగాలి యాకె నహిభూషణుకోపదవానలాహుతిన్. ()

గీ॥ గిరిజ నోడఁగూర్చి వరదుచే వరము వడయ। నోపుఁబొమ్మని నన్ను యే నున్నచోట
నెట్టివిడుమర వచ్చె నీ కెట్టి చావు। సంభవించెనె మనసిజచక్రవర్తి.

స। శ్రీతినీపినుకలి బేటంబు గొనియున్న వెలఁదుల జేట్లంబు వృథయు కాఁగ
గరమర్థి నినుఁజూచి కన్నుకలిఁ గలిచినపడఁతులకల్పు నిష్ఫలము కాఁగ
దిపుటలో నిసు డాసి కవయంగఁగోరెడువనితలకోరికె వమ్ము గాఁగ
ననురక్తి నినుఁ గూడి మనగంటి మంటి నే ననురతిమనవు మాయంబు గాఁగ
జగములందు నీప్రాపు చే నెగడి నెరయఁ బ్రబలుఁ దైవవసంతుప్రాపు చెడఁగ
దగునె వలరాజ నీ కింత తెగఁదలంచి। పరముకోపాగ్నిలోఁ బడి యెరిసిపోవ.

ఉ॥ తప్పనవారు లేని పెఱతాపసులకా వెఱపించునట్లు నీ
వప్పరమేశు నేయు టనయుంబు భరం బని చెప్పఁజెప్ప నా
చెప్పుట యాఁడుగర్జ మని చేకొన కొట్ట్యన వచ్చి తీవు పెం
పిప్పి దెఱింగితే కడవనేచ్చిననీ కిది యింత పెద్దతే. ౫౫౪

మత్త॥ ఇందిరాప్రియపుత్ర సద్వినుతేక్షుకార్ముకహస్త గో
విందనందన రూపసద్గుణవిగ్రహుతా వలరాజ నీ
సుందరాకృతి నాకు నిప్పుడు 'చూపనొల్లక డాఁగి నీ
వెందుఁబోయితి చెప్పవే రతి కేదిదిక్కు మనోభవా.' ౫౫౫

ఉ॥ నీపరిరంభణంబు ధరణీపరిరంభణ మయ్యెఁ సమ్మదా
రోపితశుష్కరోదనము రోదన మయ్యె రతిక్రియాగసా
లాపము లాంత్రవేషితవిలాపము లయ్యె మనోజ నేనియుం
జూపవు నిన్ను నన్నురసి మాచుడో గా కిది దప్పఁజూచుడో. ౫౫౬

గీ॥ తగిలి నాజీవమునకు నాధారమైన। నీవు నన్నుఁ బెట్టి పోఁజన్నె భావజన్మ।
కట్ట యవియుడు నీరుబు కట్టువాసి। బయలువడ డించి పోయినభంగివోలె. ()

ఉత్సా॥ పోరిచూచిన తకన్నుఁ బాంతకన్ను నిలిగితా
కారములనెఱుంగు దీవు గావలుండవై యహం
కారవృత్తి నీకుఁదల్కి కన్నెఱింగి తప్పఁ బో
నేరవైతి కాల మైన నేర్పు సెప్పు నేయునే. ౫౫౮

ఉ॥ అక్కట వేల్పులెల్ల కుసుమాయుధ నాఁడిచావు మాని మీ
రెక్కడ మాయ మైతి రసమేక్షణ మన్మథ నీఱునేసి నీ
వెక్కడ పోయి తయ్యు పొడ వెవ్వరుఁ జూడక కానత్తోస నే
నెక్కడ సొత్తు నాకు దెస యెయ్యదియో వలరాజ చెప్పవే. ౫౫౯

వ॥ అని యనాథవృత్తి దీనానన యగుచు భీతిం గాంతారాంతరంబు గనుంగొను
నప్పుడు. ౫౬౦

---

౫౫౬. చూచుడో=చూచుటయో.

౫౫౮. దీనిలోఁ బ్రథమచరణమునకు భావము తోచినది కాదు.

సీ॥ మేళిల్లు నీలతమాలరుచుల్ ధూమసంహతు లనఁ దనరు నవ్యనీలశాలి
శోభిల్లుపుష్పితాశోకంబు లెసఁగు తీవ్రానల మనఁ దగు నవమలరుచులఁ
బొలుపారఁ బూచినపొన్నలు సను గాలియూఁచిన నీ లన నతులదీప్తి
శిఖులకోపశిఖిశిఖల్ చిత్తజు నేర్చి తత్పరివార మగుశుకపరభృతాలి
సమితి మూర్ఛిల్లి వసంతుండు వనములోఁ బ్రాచ్చియున్న గాంచి చుట్టుముట్టి
యొలసి కాల్పఁ గాలుచున్నట్టి దయ్యె నాఁరములు శోకదృష్టి రతికిఁ జూడ. ()

చ॥ అనిశముఁ గ్రమ్ముపుష్పమధు వశ్రుజలంబుగఁ గొమ్మలెక్క భో
రనఁ జెలరేఁగుపక్షిరవ మార్తరవంబుగ మీఁద నోరిమూఁ
గినయలిమాలికల్ నిభృతకేశభరంబుగఁ జుట్టు నుండి పే
ర్చనరతితోడిసంబెరను చూపువిధంబునఁ బొల్చె భూజముల్. 992

వ॥ ఇట్లు నిస్పృహయయ్యైన రతి మఱి నిరంతరానంతశోకరసం బుత్కటంబై వెలివిరియం
దొడంగిన. 993

గీ॥ తలఁకె కనుఁగవఁ గన్నీరు ధార లొలుక। నేనఁ బ్రేర్చిందు లురులంగ మెలఁతవోలెఁ
గీలు బ్రిదిలినజలధార లోలి గలయు। గ్రిమ్మి చెదరెడుధారాగృహమ్ము వోలె. ()

గీ॥ మెఱసి క్రొవ్వేణి వెంటపై నెఱసి పొలయు। నడలు దరికొని వావిరి నడచుచుండెఁ
గాన నెల్లఁ జెలంగ నగ్రక్కదల మదము। దగిలి కేకించుపురినమ్మిపగిదివోలె.

వ॥ ఇట్లపారఘోరకాంతారాంతరాపూరితంబై చెలంగురతిరోదనధ్వని వసంతుడు
చెవులం జిలికిన నులికిపడి యద్దెస యాలించి విని. 996

గీ॥ రతియొలుం గగు నదివలరాజు పేరు సెప్పి పనవెడు నది యేమి చిత్ర మ్ముగ్రు
నెయిదఁవడనెద్ది మరుఁడు దండె త్తిపోవఁబోవ నడుమను బింబింబుపుట్టెనొక్కొ.

వ॥ అనుచు నతిసంభ్రమంబునం బఱతెంచిన వసంతునం గనుంగొని రతి మఱి నడల
నూర్మడించినం దావగొనక. 998

995. వెంటపై = వెన్నుమీఁద.

998. దావగొనక = నిలుపోపక, నిలువలేక. "నాపుడు...పార్థివముఖ్యుఁ
స తల్లడంబునం దావగొనంగలేక తనదిమ్ములనప్పుడు" నిర్వ. ఆ-౮. "నారణసేయ
దావగొనవానవవారిజమందుఁదేఁటిక్రొ। వ్వారుచునంట నీ వెఱుఁగవాప్రియహాతెఱగంటి
ంటికె। వ్వారికిఁగెంపురాదెలగవామఁగవారలదూలు నీ విభుం। దారసినీనిజంబెఱుఁగు
చెకునంతకునోర్వనెచ్చెలీ." శ్రీనాథునిసప్తశతి. ఆ-౮.

గీ॥ అలిగి పూవైన నలఁపలే దబల దాను। శోకజలమునఁ జొంకెనచోటఁ దోలు
తెరసి జర్ఝరమైపోవఁ గరతలములు। మీఁది కందందరతి యెత్తి మోఁదికొనియె

ప॥ అంత వసంతుం డసంతశోకాకులితహృదయుండై మూర్ఛిల్లి పడి క్రమ్మఱ
సచేతనుండై తన్నుం దాన సవరించుకొని తనయుడుగులం బడి విలపించుచున్న
రతి ననేకోపాయంబుల సంతరించి యూఱడంబలికిన నడలు డిందువడి నిజాధీశ్వరు
నెచ్చెలి యైనవసంతుకుం గనుఁగొని. ౫౭

గీ॥ ప్రాణవల్లభుండు భస్మపుంజముగ నాయెదురఁ జూడఁజూడ నెరసిపోవ।
గనియు నొడలఁ బాఁదఁగనదయ్యొ నగ్గడిజీవ మింక నేమి సేయుదాన. ౫౭

గీ॥ అంత నొచ్చెంబులేని నెయ్యమునఁ గూడియున్నపతిఁ బాసి తెగువలేకున్నదాన
నేను మొదలుగ నింక నొండెవ్వ రాఁడువారు సిక్కనిడెందంబువారు జగతి

వ॥ అని తన్నుఁ దాను నిరాకరించుచుం బతిసహవృత్తి లేమినిం గులపాలికాధర్మ
వృత్తి నైనం బురుషుతోడం బరలోకంబున కరుగఁడనయు నవశ్యం బగ్నిప్రవే
శంబు సేయుదు నని రతి మరణనిశ్చయంబు సేసిన. ౫౭

క॥ ఆకాశవాణి మృదురుతు। లాంకాశమునందుఁజెలఁగ నంగజు దయతో
నీ కిచ్చు నిక్కువముగఁ బ్రి। లోకహితార్థమ్ము గాఁ ద్రిలోచనుఁ డనిన౯. ౫౭

వ॥ సంభ్రమించి వియత్తలంబు గనుంగొని యాలించి మఱుమాట లేమికిం దురుపిల్లు
నుగ్రశోకానలాహుతుం దయ్యును గ్రమ్మఱ నేయును చున్నదానికి గగనస
స్వతి నిశ్చయంబుగా వెండియు నిట్లనియె. ౫౭

ఉ॥ అట్టిమహోగ్రకోపదహనాంబకుఁ డట్టిదయాగుణంబు దాఁ
బుట్టి మనోజు నిచ్చునటె పోలదు నాఁ జనదభ్రపంక్తిలోఁ
బుట్టె నిరప్పదాగ్నియును భూరితరామృతవృష్టి దీనిచోఁ
బ్పట్టిది నాఁగ నెవ్వరికి నీశ్వరుతత్త్వ మెఱుంగఁబోలునే. ౫౭

వ॥ అనిన నట్టిదివ్యవచనంబులు విని నమ్మి రతి మరణపరిచ్ఛేదంబు విచ్ఛేదంబుచే
పఱిం దలంచి శమలించి. ౫౭

క॥ కఱుసనఁ బూఁతలై పొం। హరసఖుఁ లోఁ గాలునట్లు లంగజశోకో
ద్ధురశిఖి రతితను విమ్ముగ। గరఁగియుఁ బొడవఱుక లోనఁ గాలుచునుండెన్.

వ॥ ఇట్లెడయుడుగనియడల్లడిం బడి. ౫౮౦

సీ॥ అలమట నెడి యొండెనిలువదు చిత్తంబు మూర్ఛిల్లి వెడఁబాని పోవఁ గొండె
నూఱట గొనియొండె నాఱదు శోకాగ్ని హార్దిమాలఁ గొని కాఱి పోవ దొండె
ఘర్మాశ్రుజలము లొక్కటకట్టుకొనవొండెఁ బాడవంతయుఁ గరంగి పోవ దొండెఁ
బర్వునిట్టూర్పులు పట్టునఁ బడవొండెఁ బొం దిమ్ముగాఁ బాని పోవ దొండెఁ.
నిట్టికడలేనిదుఃఖాబ్ధిఁ జిట్టి ముంపఁ। దలఁచియో కాక పోనీక బలిమి నాదు
ప్రాణ మొడలిలో నాకాశవాణి దెచ్చి। మగుడఁజెఱఁబెట్టె నని రతి మఱుగుచుండె

వ॥ అంత వసంతకుం డక్కుసుమకోమలి నూరార్చి కుసుమాయుధు పునరవతారంబు
నకు నుద్యోగింపు మని నైపథ్యము నాకు కొలిపి ౫౮౧

చ॥ అమితసురాసురేంద్రవరు లాదిగ నెవ్వనిఁ గొల్చి తత్ప్రసా
దమున నభీష్టముల్ వడసి తద్దయుఁ బేర్మి వెలుంగు చున్న వా
రమరఁగ నీవు నాతని దయాపరు నీశ్వరు భక్తియుక్తి సం
యమమలిఁ గొల్చుచుండు కమలాసన నీకు నభీష్టసిద్ధిగాత్.  ౫౮౨

వ॥ అని హితోపదేశంబు చేసినం గైకొని రతి నిరతిశయభక్తిం బరమేశ్వరారాధ
నంబు సేయుచుండె నట గిరిజ శిశిరగిరివరకరస్పర్శంబు శిశిరోపచారంబుగా
నెచ్చెలిక కన్యాంతఃపురావర్తి యగుచు నంతికాంతకు నిజాంతరంగంబునం జిం
తించుచుండు నంత నంతకాంత కగ్గలించుచు. ౫౮౩

చ॥ తలఁపులనిట్టి భావములతానైక మానలపుట్టినిల్లు గో
ర్కులనెలవీడు వల్వగలహూట మవస్థలజన్మదేశ ము
మ్మలికల పెంట వేదనలమందు మనోభవుఫేటపట్టు మూ
ర్ఛలసహవాస మన్విరహసంతతితాపము వొందెఁ బార్వతిన్. ౫౮౪

వ॥ ఇట్లుల్లసంబున నదరు నాయల్లకభరంబునం దురుపిల్లుచు. ౫౮౫

చ॥ అలులకు నుల్కు మందమలయానిలుఁ డన్న భయంబునొందఁ గో
యిలలకు బెగ్గలించుఁ గడు నేచిన మావిడి నూడనోపు రా
చిలుకల కుల్కుఁ గాముఁ డని చెప్పినఁ గల్లడమందు నిందువె
న్నెలఁ గని సొమ్మసిల్లు ధరణీధరనందన గామవేదనన్. ౫౮౬

క॥ వగచినచిత్తము నలఁదురి। మొగిచినకనుఁగవయు నుదుట మోపినకేలుక్
వెగిచినకంఠము నుడుగక। నెగసిననిశ్వాసతతియు నీరజముఖికిన్. ౫౭

తరువోజ॥ వెలఁదునిట్టూర్పుల వెసనుచ్చుకించు వెల్లుపునగలుగు నెవ్వఁగుచఁదోయి
యొలరార నెఱకల నెగయు నుంకించు నెలమి జక్కవ పొదలివి నాఁగ జాలు
బలువిడిగొనిజాఱు బాష్పోదకముల బాలకన్గవ నేఁడి వరవాళులొప్పు
దలఁపించెఁ గెంగేలుఁ దమ్మిపైఁ దోడి తమ్మినాఁదగి మోముఁదమ్మి వొల్చు।

సీ॥ ఎలమి ముఖాంభోజ మలరు నొక్కొకమాటు వలవంత నప్పుడ వందికందు।
నెలరారుకనుఁగవ వొలయు నొక్కొకమాటు కన్నీరు లప్పుడ గలయఁ గప్పుఁ
బులకలు మైదీగఁ బొలయు నొక్కొకమాటు ముచ్చిరి యప్పుడ ముచ్చముడుఁగుఁ
జేర్బందు లాడలిపైఁ బేర్చు నొక్కొక్కమా టప్పుడ మీఁదఁ గామాగ్ని నెగయు।
మనసులోఁగూడి యొక్కొకమాఁటుసూచుఁ। జూచి జెడగానకప్పుడసొమ్మసిల్లు।
నెనర భావజహరులసంయోగవృత్తి। తగి యెఱుంగకయుండు నానగతనూజ. ()

క॥ భావజశరహతిజీవము వోవఁగ వచ్చుటయు నగజ పరహరు నెదలోఁ
భావించి తెలిసి మగుడు శు। భావహు శివుఁ దలఁప మృత్యుహర మగుటరుదే. ()

వ॥ ఇట్లసాధారణం బైనరణరణకవ్యథ కప్పగింపక సొలయుచు. ౬౧

మ॥ ఇదిగా కేమి వియోగతాపమనఁగా నిల్లేర్చుఁగా కేమి కౌ
ముది ప్రోషిత్తతి కింతబెట్టిదుఁడె కాముం డంగనారాజికిన్
హృదయాధీశులఁ బాసియున్నవిరహం బింతేచునే యింతతు
మ్మెదకుం జిల్కకు గండుఁగోయిలకు మేత్మే లంచు విభ్రాంతనై. ౬౨

వ॥ కళవళించి పరమేశ్వరుం దలంచి ధ్యానంబున విహ్వలరుచు. ౬౩

స॥ సురసదిసురువులు జూటాంతరంబునఁ గ్రొవ్విరిజూదులకొమరుగాఁగఁ
బావకాంబకరుచి ఫాలతటంబునఁ గాశ్మీరనుయతిలకంబుగాఁగఁ
గరళానితప్రభ గళమున వ్రాసినకస్తూరిపత్రభంగంబుగాఁగఁ
భాసురం బగునిజపాండురాంగద్యుతి సదమలచందనచర్చగాఁగఁ
జారుతర సైనసహజశృంగారరూప విభవసౌభాగ్యసంపద విస్తరిల్లు।
నామహాదేవుతోఁ జిత్తమార వెలసి కలసి రమియింప నెన్నఁడుగాంతునొక్కొ.

---

౬౨. ఏచునే = ఏచుటయా (బాధించుటయా).

వ॥ అని గద్దించి కాలుకొనక లీలోద్యానంబున నేకాంతంబున జని విరహాదహన దాహంబు సహింపనోపక. ౧౮౫

గీ॥ రుచిరశశికాంతరచితసరోవరంబు। నెలఁత సొచ్చిన మెయివేఁకి నీరులెల్ల
నింక వదనేందురుచిశిలలెల్ల గరఁగి। నిండెఁ దోడ్తోనక్కొల నతనుండు విసువ. ()

వ॥ అంతం దనుసంతాపంబు వాపనోపక పరమేశ్వరురూపు చిత్రించి చూచిననైన నూఱట యగునో యని చిత్రసాధనంబులు గొని పలకఘుట్టించి మెఱుంగిడి త్రివటించి తిట్టంబు కోలఁదికిం దెచ్చి రుజ్వాగతంబున రేఖ నూల్కొలిపి పత్రకబిందుకనిమ్నోన్నతాపాంగమానోన్మానంబు లలవఱచి సలక్షణంబుగాఁ జిత్రించి వన్నువగొలిపి కందెఱ దెఱచిన. ౧౮౬

చ॥ కలకల నవ్వునట్లు దమకంబునఁ గన్గవ విచ్చి భ్రూలతల్
వొలయఁగఁ జూచునట్లు దనివోవఁగఁ దెల్వియుఁగౌఁగలింపఁజే
తులు పచరించునట్లదటుతో రతికేలికి నప్పళించున
ట్లొలమి నటించుచుండె సతికీశ్వరురూ పెదుర్రం బ్రసన్నమై. ౧౮౭

వ॥ అంత నంతియు నిక్కువంబకాఁ దలంచి లజ్జించి మేయొత్తుసరించుచు నపాంగావలోకనంబు సురంగంబై పొలయం దదాసక్తి యగుచుండునంత నక్కడం జతురిక యనుప్రియవయస్య కన్యాంతఃపురంబునం దగసుతం గానక లీలోద్యానంబునం దన్వేషించుచు వచ్చివచ్చి. ౧౮౮

సీ॥ జలజాతముల కింతచన వెవ్వ రిచ్చిరి దరహాసరుచిఁ బొల్చుతావిఁ బెనఁగ
హిమరుచి కీమెయి యెం దుండి వచ్చె నితాంతసుధాపూర్ణ కాంతిఁ బెనఁగ
మలయానిలుం డింతచలివిర్మిఁతోఁ గ్రాలి నడపాఁ మనోజ యెన్నండొ పడసె
రాజకీరము లింతరసవంతె మగుమాటచొప్పు లేరీతి నెచ్చోటఁ బడసెఁ
దగు నెఱింగితిఁ బ్రాలేయనగతనూజ। మదనవేదన తప్పుఁ దా మఱచి యున్న।
యవసరంబున నాఁబాలముఖయుపముల। చెలువు గ్రొచ్చుకొనిరి గావలయు నేఁడు.

---

౧౮౭. “కలకలనవ్వునట్లతెలికన్నులనిక్కము చూచునట్లుతోఁ
బలుకఁగడంగినట్లుపలుభావగభీరతలబ్బినట్లు పెం
పొలయఁదనర్చిజీవకళయుట్టిపడన్ శివభ్రాసియిచ్చెనా
చెలువునకాభిముఖ్యముభజింపఁ దలంకెనుదానుబోటియున్.”
ప్రం. ప్ర అ-౧.

వ॥ అనుచు గిరిజ హాసనం బాసక్తయగు డెతింగినదై చరచాలించుచు నరుగుదెంచి శశికాంతసరోవరతీరకర్పూరలతామందిరంబులం నిందుశేఖరసుందరాకారంబు చిత్రించు చున్నగిరినందనం గని దాపునం జనుదెంచి చతురికసముచితాలాపంబుల దన్నుం గలపికొని యమ్మెలంతం గనుంగొని. ౬౦౧

సీ॥ ఎలమి నీమైందీఁగె నెలకొన్నసుకుమారవాసంతలక్ష్మిపొం దొసరించి
మరిగి నీజిహ్వాసుమంజరి విహరించు భాషాశుకంబులఁ బాఱఁజోపి।
సంధిల్లునీముఖచంద్రుతో రమియించుదరహాసచంద్రికఁ బొరపుచేసి।
నెత్రిలేక నీతోడినీడయై కెడఁగూడి పరఁగిన నన్నింతయెరవు సేసి [యుఁ
వచ్చి యీావనలక్ష్మితో నిచ్చ మెచ్చి। చెలిమిగొనియుండుటయుఁగాక చిత్తమున
గన్నుఁగవ కూర్తగా నహికటకురూపు। చిత్ర మిడి చూచె దిదియేమిచిత్ర మబలం

వ॥ ఇదియంతయు హరువలనివిరహవ్యంజకం బగుచున్నయది యనిన నగజ నెచ్చెలిం గనుంగొని. ౬౦౩

ఉ॥ ఆదరహాసవాసలలితాస్యరుచుల్ దలుకొత్త నప్పుడా
హ్లాదముతోడఁ జూచి చనదప్పటిసమ్మదలీలరాఁగ నాఁ
డాదిగఁ బాయ కీశుఁ డెద నప్పటికప్పటి కొక్కభంగి న
న్నాదటఁ గూడియుండ విరహవ్యథ నాదెసఁ బొంద నేర్చునే. ౬౦౪

వ॥ అని కప్పి పల్కంబోయి బయల్పడఁ బల్కి వెలవెలఁబాఱుచుఁ దనబహిఃప్రాణ మైనప్రియవయస్యపై నల్లన వ్రాలుడు. ౬౦౫

ఆ॥ ఉవిదమానసమునయూర్మ్యాగి వలరసం బొక్కపెట్ట తెఱమి కుక్కదంబు
గాఁగ నిండి తొణ్కి కట్టువిసెనో యన। వెడలె నశ్రువారి వెల్లిగొనుచు. ౬౦౬

---

౬౦౨. "పొరపు" నకు—"పరువంపువిరులపైఁబొరసియుండొకవనంబుల సౌరభంబులు పొరపునేయుఁ। జక్కవాసిన పువ్వుపదువతోఁజెరలాడియిలకుఁబూఁ బొమపులలవరించు." విన్నకోటపెద్దన ప్రద్యుమ్నచరిత్ర. ఆ-౧. పొరపట్యెక్ బలు తొణ్కి" ఉ-హరి ఆ-౫. "నన్నెరవుసేయకుఁడీకపులారమొక్కెదన్" ఆంధ్రభాషా భూషణము. నెఱి=స్నేహధర్మము. "నెఱిదప్పినమాటలు దానవకులనాథ." నిర్వ-౬-౩.

వ॥ అంతం జతురికచతురోక్తుల నగజ ననునయించుచు. ౬౦౩

మ॥ తగదే పోలదె చాలదే యమరదే త్రైలోక్యపూజ్యంబు నీ
తగులం బీశ్వరుమీఁద నట్టియిది యేతన్మాత్రమే కన్యకా
సుగుణం బెమ్మెయి దూషితం బగునె సంశుద్ధాత్మ సర్వాత్మ స
ర్వగతుం జిత్తమునందుఁ గోరు టిది సద్వంద్యం బనింద్యం బిలన్. ౬౦౪

వ॥ అని సంబోధించుచు నంతట నాచెలువకు విరహం బతిక్రాంతం బగుటెంచు డెంతిం
గి నగజం గనుంగొని చతురిక నిపుణికాదిసఖీజనంబులఁ దోడ్తెంచి శిశిరోపచా
రంబులు సేయించి విరహపరితాపంబు పుచ్చివైచెద నోడకుండు మని పోవ నిశ్చ
యించి, ౬౦౫

ఉ॥ ఆడెడునమ్మిఁ గన్గొనకు మమ్మ బయల్పడ నాడుచిల్కతో
నాడకుమమ్మ తేఁటిగెడ నాలతి సేయకుమమ్మ వెన్నెలం
జూడకుమమ్మ తెమ్మెరలఁ జోఁకకుమమ్మ తలిర్చుమావిక్రీ
నీడకుఁ బోకుమమ్మ యని నెచ్చెలికత్తెకుఁ జెప్పె సమ్మతిన్. ౬౧౦

వ॥ చని నిపుణికాదిసఖీజనంబులకుం దద్వృత్తాంతం బెఱిగించిన నుదరిపడి యంద
ఱుం జనుదెంచి మదనవేదనం బరవశనై యున్నయగ్గిరినందనం గని లగ్గ బెగ్గిలి.

చ॥ అలకలఁ జిన్నపూ వలికినంతన మోము నెమర్చుఁ జన్నుఁగ్రే
వల మృదుపత్రభంగములు వ్రాయుదుఁ గొనసియాడు లగ్గ స
మ్మెలఁతికు మాధవీకుసుమమేఖల గట్టుటయున్ వడంకునూ
రులు నిజ మింత గోషలి మరుప్రసవాస్త్రహతిం జలింపదే. ౬౧౨

వ॥ అని మెత్తమెత్తన తడవుచు. ౬౧౩

సీ॥ మృదురీతి నూర్పుఁదె మ్మెరలు నూల్కొలుపవే తెఱవ నీలేఁత మైదీఁగె మొలయ
నధరారుణద్యుతి నభ్యుదయింపవే పొలఁతి నీయాననాంభోజ మలర
దరహాసచంద్రికాస్ఫురణ పూరింపవే రమణి నీనయనోత్పలములు వోలయ

౬౦౮. గోరుడు=గోరుట.

౬౧౨. మరుశబ్దమునకు మన్మథార్థమున సంస్కృతపదముగా నుభయభాషా
ప్రామాణిక కావ్యములలోఁ బ్రయోగములభించినదికాదు. ఇట్టిమూపము వ్యాకరణముచే
సమర్థించుకొనవచ్చునుగాని యదికవిసిద్ధపదము గాను.

భాషామృతముఁ గర్ణపథములఁ జొనుపవే చెలువ నీ జీవంబు చేతరింప
వేఁడెది నీవ నీకు వెజ్జవై వలవంత యువయువముల దీర నవయువముల
వలను సొలయ కేల వలరాజుచలము సాధ్యమ్ము సేసెదమ్మ తలిరుఁబోఁడి. ౬౧౪

వ॥ అనుచు నందఱు నెచ్చెలులం గనుంగొని. ౬౧౫

చ॥ తలిరులు మొగ్గలున్ వికసితప్రసవంబులు దెండు పీరు శీ
తలికలుఁ బిక్కమూలములు తామరతూఁడులు దెండు మీరు చెం
గలువలుఁ దోవకాముల నుఁ గంజదళంబులు దెండు మీర లీ
చెలువకు శీతలక్రియలు సేయుద మిం కెడసేయ నేటికిన్ ౬౧౬

వ॥ అని యందఱు నెచ్చెలులకు మీఱిన ట్లనేకశిశిరోపకరణద్రవ్యంబులు తత్క్షణంబ కొనివచ్చి తమలోన.

సీ॥ పుష్పఫలతోడిమలు పుచ్చి నయంబునఁ జివుళ్లలకాములు నిడుము లేఁత
తూఁడులగంటులు తుదలకు మ్రుగ్గుపు చెంగలువలపై రేకు లొలుపు మరఁటి
మోసుల వీజనంబులు సేయు కొలఁదివే ళ్ళిరవుగాఁ గూర్చి చామరలు సేయు
తోవపుష్పకాములతో క్రమ్మగాఁ బుచ్చి పిక్కమూలంబుల పెనఁగు వాపు
చందనంబు రాచి సన్నయఁబెట్టు చెంగావిమన్ను నీరఁ గలపి తేర్పు
కప్పురంబు దూలిగాఁ జేసి వడివెట్టు మనుడుఁ గడఁగి ప్రియవయస్యలెల్ల.

వ॥ అని యన్నియు నవయవంబులు గా నమర్చి శిశిరవీర్యమంత్రంబుల నభిమంత్రించి.

ఉ॥ చందనకర్దమంబు ఘనసారరజఃప్రసరంబు శీతలుల్
గెందలిరుల్ ప్రసూనములు గేసరము లుక్కముదోత్పలాంబుజత
త్కందమృణాళపత్రఘనధాతుతుషారఘనోపలంబులుల్
నాం దిగుశీతలోపకరణంబుల నేర్చితలిర్చి సిద్ధికిన్. ౬౧౭

---

౬౧౬. శైత్యోపకరణములకుఁ బోల్చిచూడుఁడు:—ప్రాప్తోమృణాళహారో పియదస్యా దాహహేతుతాం। నిహితాస్స్రసమాలీభిర్లవలీపాకపాండునీ। అస్యాస్తనతటేభారఃపరంవాసీరపల్లవాః। నచందనేననోశిరవారిణానజలార్ద్రియా। నాస్యాఃపుటకినీపత్రైః శమమేతిస్మరజ్వరః అని పద్మగుప్తుఁడు. శీతలికలు వృక్షపర్ణవిశేషము. శైత్యమునకుఁ జెప్పినందునను, "మలయురుహశిశిరకరశీతలికాకరకేందు కాంతజలశీతలమీ। లలనాలింగనసుఖకర। వి...సము" అనికవిరాజమార్గ. ఆ-౩.

వ॥ విరహాగ్నిదాహంబునఁ దల్లడిల్లు చున్నగౌరిం గనుంగొని. ౬౨౧

గీ॥ అలిగి మరునేర్చుహరుఁడు దాఁ గట్టిసాహసాత్మనుడఁగూర్చి యాయంబుజాక్షి నింత
విరహవేదనఁ బెట్టెడు విధి కఠంగి। మొసలిలోతాదండగుండము ముంచునట్లు.

వ॥ అని విధి నుల్లంఘించుచు నక్కుసుమకోమలి నల్లనల్లన తడమికొనివచ్చి. ౬౨౩

స॥ హిమధామధాతుమిశ్రము లగుశశికాంతజలములు హానించి జలకమార్చి
శీతాద్రికంధరధాతురంజిత మగుగైరికాంబరములు గట్ట నిచ్చి
ఘనసారపాంసుసంగత మగునామోదమలయజపంకంబు గలయ నలఁది
కోమలబిసతంతుగుణరోపితము లగునమలకర్పూరహారములు వెట్టి
సహజశైత్యాభినవపుష్పసమితిఁ దుఱిమి తరుణపల్లవకర్ణావతంసకంబు।
లిడి విదాహంబువాటి నేయలమి నవక మెసఁగఁజేసిరి తనుపారుపసదనములు. ౬౨౪

వ॥ తదనంతరంబ. ౬౨౫

చ॥ మరుఁ బ్రణుతించి మందపవమానుఁ దలంచి వసంతుఁ గొల్చి చం
దురునకు మ్రొక్కి చూతనవతోయజసంహతిఁ దేల్చి శారికా
పరభృతచంచరీకశుకబర్హిణపఙ్క్తికిఁ దృప్తిచేసి సు
స్థిరవిరహాధిదేవతలఁ జిత్తమునం గొనియాడి భక్తితోన్. ౬౨౬

సీ॥ ఏలమావిజొంపముల్ బలసిననెత్తమ్మికొలనిలోపలిదూబ నెలమిఁ బొదలి
పెనఁ గప్పి యొప్పినయనఁటులలోపలిచందనకర్పూరసహితవారి
భోరనఁ దొరఁగెడుధారాగృహంబులో విలసిల్లుశశికాంతవేదిమీఁదఁ
దనుపారుపువ్వులఁ దలిరుల నెడఁగొల్పి పాటించి తేర్చినపాన్పుమీఁదఁ
శైలతనయ నునిచి సఖు లోలిఁ దేలినధాతుజలము లూడలఁ దడిపితడిపి
కమలనవదళములకదళీదళమ్ములవీజనములు చేసి వీచివీచి. ౬౨౭

క॥ కొలవేళులు నెలఁదూఁడులుఁ। దలిఁగలు నీసరవారిఁ దడిపి నయమునన్
గుల్తిరుగొన మేననొత్తిరి। లలనలు పార్వతికి శీతలక్రియ వెలయన్. ౬౨౮

---

౬౨౪. తనుపారు=చల్లనైన. “తనుపారఁగనీరుద్రావి” ఉ-హరి. ఆ-౪.
“ఎండ కన్నెన్నఁడు నెఱుఁగనికొమ్మ్రావిసీడలఁదనుపారు నెలవులందు” నృసిం-ఆ-౩

౬౨౭. “దూబవైయుచొచ్చుదూఁటితొకొ” అడిదము సూరకవి చాటు.

వ॥ అంత నొక్కించుక యుల్లంబు సల్లనై గిరిజకన్నులు మూసినం గని సతు లొం
డొరుపుఱం బదక్రికొని కెలంకుల కోసరించి రయ్యవసరంబున. ౬౨౯

చ॥ ఉదరెడుమోవి ముత్స్వలక లొత్తెడు నూగులుఁ గేలుఁ జన్నులుం
గదలెడు మేనఁ బెంజెమట గ్రమ్మెడు నూర్పులు నీగ్గడుల్ ముదం
బొదవఁ బ్రియం గలం గవయుచున్నది యిత్తఱి నేల నిద్రదె
ల్పెద వని యంతరంగగతి భేదము దెల్పె విదగ్ధ ముగ్ధలన్. ౬౩౦

వ॥ అంత నగజ గల నిక్కువంబకా భావించి బెదరి లేచి పతిం గానక. ౬౩౧

ఉ॥ ఉమ్మలికమ్మునన్ సొలసి యుస్సని మెల్లన వ్రాలుఁ బాన్పుపై
గ్రమ్మన లేచి నిల్చి పతిఁ గానక విభ్రమ మంది చిత్తతా
పమ్మున నేలమీఁదఁ బడి ప్రాణము నిల్పకి తల్లడంబునన్
సొమ్మలువోపుఁ దన్ సఖులు చూచి భయింపడఁ గామవేదనన్. ౬౩౨

వ॥ తదవసరంబున సఖీజనంబులు తల్లడిల్లి. ౬౩౩

సీ॥ పరితాపవేదనాపరవశంబునఁ దూలి సొలసినచిత్తంబు నెరపుకొనఁగ
నుమ్మలికమ్మున వెమ్మనంగజవహ్ని దుఱపిల్లునుల్లంబు మరలుకొనఁగ
వలవంతవరుపట్టు పట్టిననాలుకి తల ముగ్ధమాటలు మెలఁగియాడ
నలరమ్ము నెఱనూర నాడినవెస సొమ్మసిల్లినజీవి సంజీవి గాఁగఁ
గోర్కి కోర్కి వీనిఁ గొలగొనఁ దినుఁ గూడ వగచు వగలు రిత్తపగల గూడఁ
బరముఁ డెన్నఁడొకొ ప్రత్యక్షమై తనరూపు శైలసుతకుఁ జూపు నెలమి. ()

గ॥ అనుచున త్తరుణి నెత్తి మెత్తన శిశిరతల్పంబునం బెట్టిన. ౬౩౫

క॥ ఎలఁగూఁడులుఁ గోలలు విరు। లలుగులు నవధాతుజలము లరుణాంబుపుష్టై
పొలిచె నలి మారునలర। మ్ములపొన్పన చన్నకిరణి మూర్ఛాగతయై. ౬౩౬

వ॥ అంత. ౬౩౭

క॥ త్రైలిల డెంపముతల సం। ప్రీతిగ హిమవారిధార వెట్టుచు మలయా
ఘ్రాతరజం బరకాళులఁ। జేటుల నురయుదురు సొమ్మసిల్లినచోటన్. ౬౩౮

---

౬౩౮. ఎల=నాల్గుకొనలో,, అని యింతి చీరతల ముడిచిన మణిమంచ
నములు.” ది శ-౨-౬.

వ॥ ఇట్లు౦దయు నక్కట్టికొనక చేయుశిశిరోపచారంబులగ్గజకృష్టోపచారంబులైనం దనసఖులం బదరుచుఁ దను వాస్తపడి దిశలు గలయం గనుంగొని యెందు నుపాశ్రయంబు గానక కలవరించుచు. ౨౩౯

క॥ మలయానిలునకుఁ గదలీ। దళముల వీచిరొకో వేఁకి దనుకఁగ నాపై
నలఁదెడుమలయజకర్దమ। మలఁదిరొకో యిడుకులేవ నమృతాంశుపయిన్. ( )

సీ॥ చివురెల్లఁ గసినొత్తి తొవరాకు గుత్తుక డెక్కొని కోయిల వెక్కుచుండుఁ
బూవెల్ల విడిగొల్చి పుప్పొడి ముక్కున క్రాలపై యళుల్ డగ్గుచుండుఁ
దనిపండ్లరసమెల్ల ద్రావి రసాధికమై చిల్కలెల్లఁ గిట్టుమిరొనఁగ
మలయానిలం బేచి భ్రమానైలనుగ్గుగావించి తా వలీ వీఁపు విత్రిగికూల
వలవదే దైవమా యిట్లు వసముఁ దారుఁ బోరి తెమలోన సరివోక పోయెనేని
బలము సాధనములుఁ జెడి చలముసెడక। కాముఁ డెక్కటి వచ్చిన న్నేమిసేయు.

ఉ॥ కంతుఁ డనంగుఁ డమ్ము లనఁగా విరు లిందుఁడు దానుగాంగుఁ డ
త్యంతహిమంబు చంద్రిక నఃసుం బిమఁ డాలయమూర్తి కిల, నా
నింతబలంబు క్రొవ్విరుల కింతప్రచండత యిుక్ సుధామ్మనం
దింతబలంబు శైత్యమున కింతపిదాహకరంబు గల్గునే. ౨౪౨

వ॥ అని లగ్గ బెగ్గలించి భయాకులహృదయ యగు చున్నగిరిరాజనందనం బ్రియసఖు
లెల్ల సంతరించుచు. ౨౪౩

సీ॥ బాల నీవేనలి కాలోరగం బని మలయానిలంబు నీవలన రాదు
కమలాస్య నీకినుఁగవ చకోరము లని వెన్నెల సొరదు నీయున్నయెడకు
నబల నీమెలుఁగు పికారావ మని నీకుఁ జూతమ్ము గొమ్మలుసూప వెఱచుఁ
జపలాక్షి నీముక్కు చంపక మనుభీతి నలులు నీపొడగని యలయఁ బోవు
వనిత నీకుఁ బ్రాణవల్లభుండై మది నొల్లనె శవుఁడు వాటుకొందునన్నియు
పేదమగుశరములు నీదెస రానోడు వీని కేల నీవు వెఱచెదమ్మ. ౨౪౪

---

౨౪౪. కొమ్ములుచూపు=ఎదిరించు; " మించినగితులు సాధించి యుగ్రునికి మారొక్కనియున్న కొల్లలకొండలనఁగఁ। జేతన త్త్వంబులు నేకొనిరవికిఁ గొమ్ములసూపు నొకటి మొనలనంగఁ। జెకగ్గి యలులక నేకదానములిడి మెలఁగుతమాల భూమిజములనఁగఁ। జిలివధోద్ధర సిద్ధులై గాడ్పుతో మోహరించిన కారుమొగుళులనఁగ। నొగ్గి చందంబులను నెసక మెసఁగి। సొగడు నెగడునుండని యుప్పరిఁజరించుఁ। తమ్ముఁజూచిన మెఱయుఁ బణ్యమ్ము నెసఁగఁ। దావలంబైన భద్రదంతావళములు." పిన్నకోట పెట్టన్న— పద్యమ్మ్నపచరిత్ర-౫-౧.

వ॥ అని యనేకప్రకారంబుల బుజ్జగించుచున్నంత నక్కోమలికి విరహతాప మతి
క్రాంత మగుట గని భయస్థలై యిది మనచేతం దెగ దింతయు హిమవంతున
కెఱింగింపవలయు నని చని పర్వతాధీశ్వరుం గని తద్వృత్తాంతంబు విన్నపంబు
సేసి వెండియు నిట్లనిరి. ౬౪౫

చ॥ మనసిజుఁ డావిలాసవతిమానధనం బెడ సూఱగొన్నక్రం
దునఁ గుటిలాలకద్యుతులుఁ దుమ్మెదలంగ విభాతిఁ దీగలా
ననకిరణాళి రాజు సిఱునవ్వు వెలుంగు సితాబ్జముల్ విలో
చనరుచు లుత్పలల్ మగుడఁ గైకొనియెం దమయచ్చు వాటినన్. ౬౪౬

చ॥ తనకు మృణాళముల్ ముదిరి తామరకాములు కర్కశంబులై
యున్నము లైనభంగి మృదులాంగ మునం బులకాళి పేర్చి మా
రునిదొనయమ్ము లొక్కమొగి రోమము రోమము దప్పకుండ నాఁ
టినక్రియ నుండు నింతి మెయి డెక్కొని చిత్తవికారచేష్టలన్ ౬౪౭

క॥ ధారాగృహమున నుండిన। నీ రెంతయు నింకెఁ గొలనినీరులలో నం
భోరుహకదళీసహ। కారంబులు గలయఁ గోఁదు గమరులు వోయెన్. ౬౪౮

క॥ విరహానలమున డెందము। దరికొని మది నున్నవిభునిఁ దాఁకును యని చె
చ్చెర దాని నార్పుక్రియ నెదఁ। దరుణి విగళితాశ్రుధారఁ దడుపుచు నుండెన్.

క॥ రేలుం బగలును మొగమున। వ్రేలుచుఁ బతి వాయకున్న వ్రేఁగుననో లోఁ
దాలివలవంత్తనో యు। బ్బాలిక మొగ మెత్త దలసభావన నుండున్. ౬౫౦

సీ॥ పరితాపశిఖిశిఖల్ దరికొని వనములోఁ గార్చిచ్చులై కొని కాలుచుండు
నుడుగక వెడలునిట్టూర్పుల జగములఁ బ్రళయానిలంబులై పర్వి నెగయు
ఘోరన దొరుగుకన్నీరు వారాశికి నేఱులై వెసఁగూడి పాఱుచుండు
వగఁ గూడి కడుఁగంది వందినమైఁదీగకప్పున దెసలఁ జీకటులు గవియుఁ
బ్రాణవల్లభుఁ డెడ నున్కిఁ బ్రాణ మొడలఁ బాయ దింతియ చెప్పంగ వేయు నేల
యాసరోజాస్యపై విరహానలంబు దలఁప వినఁ జూడఁ గడునద్భుతంబు దేవ. ()

---

౬౫౦. "మొకమునవ్రేలుచున్న యవిముఖ్వరమూర్తులు నంచునార్తుపై"

వ॥ అనిన విని హిమవంతుండు దుదరిపడి మేనకాసహితం బతిసంభ్రమంబునం జను
దెంచునంత నిట పార్వతియును. ౬౫౨

మ॥ జగదారాధ్యు ననాధ్యు సాధ్యువిమలాచారుఁ మహోదారు స
ర్వగు సర్వేశు ననీశు నీశు సుగుణావాసుం జగత్త్రాణుఁ ద
త్త్రిగుణాతీతు నజాతు జాతు వృషవర్ధిష్ణుం గ్రియాజిష్ణు లో
కగురుఁ దృశ్యు నవశ్యు వశ్యు వివిధాకల్పుఁ సుజల్పుఁ మహిన్. ౬౫౩

క॥ సుజ్ఞానామలతత్త్వవి। ధిజ్ఞుఁ గళాభిజ్ఞు భారతీరమణుఁ ద్రిలో
కజ్ఞు నయజ్ఞు సుధీనిధి। నజ్ఞానవిముక్తు సుచరితాభరణాంకున్. ౬౫౪

క॥ కరుణామిత్రుననమిత్రు మిత్రు నుతలోకజ్ఞుం గళాభిజ్ఞు సా
గరగంభీరు నమారు దూరగతదోషున్యుఁ జగన్మాన్యు భూ।
సురవంశాద్యు నభేద్యు భేద్యు సుమనశ్శుద్ధుఁ మనశ్శుద్ధు వి
స్తరితశ్లోకు నలోకు లోకు శివసంసక్తుఁ వినుక్తుఁ మహిన్. ౬౫౫

క॥ లోకాలోకనకీర్తి। శ్రీకాంతాకాంతు విబుధశేఖరు దురితా
నోకహకుఠారు సకలక। ళాకల్పాకల్పు మల్లికార్జునదేవున్. ౬౫౬

మాలిని॥ అమలపరమయోగాయత్త సంశుద్ధచిత్తున్
గమలవిశిఖరమ్యాకారు దుస్సంగదూరున్
శమితవిషయుఁ దత్త్వాసక్తు సంసారముక్తున్
శమదమనియతాత్ముఁ శాంతువాక్శ్రీసుకాంతున్. ౬౫౭

గద్యము॥ ఇది శ్రీమజ్జంగమమల్లికార్జునదేవదివ్యశ్రీపాదపంకజభ్రమరాయమాణకవిరాజ
శిఖామణినన్నెచోడదేవప్రణీతం బైనకుమారసంభవం బనుకథయందుఁ బంచ
మాశ్వాసము.



శ్రీ

# కుమారసంభవము.

## షష్ఠాశ్వాసము.

శ్రీవాణీవను నఖిలక। ళావిదు నఘురహితు నిహాలక్ష్యాన్ముద్రిత
త్త్వావిష్కృతమతి నఖిలను। భావహు నణిమాదిగుణగణాలంకారున్. ౬౫౮

వ॥ పరమేశ్వరుం దపోమహిమ నర్చించి మెచ్చించి నిజాధీశ్వరుండుగాఁ బడయుదు నని తపోవనంబునకుం బోవ నిశ్చయించి కన్యాంతఃపురంబునకుం జనుదెంచె నంత హిమవంతుం డరుగుదెంచి విరహానలాహతిం దీవ్రకరాహతేందురేఖయుం బోలె వివర్ణయై యున్న హైమవతిం గని నెమ్మనంబునం దల్లడిల్లుచు. ౬౫౯

గీ॥ పుడికి వైచినమవ్వంపుఁబోఁటియపోలె। వాడి స్రామరుచు మేఁదీగ వందికంది
వెలఁది నీ వింతవగఁ గూరి విన్నదారి। యునికి దుఃఖాగ్ని మమ్మడి యునికి గాదె.

వ॥ అని యనేకప్రకారంబులఁ దన్ను సంతరించుచున్నం బార్వతి నిజాభిప్రాయం బచలాధీశ్వరున కెఱింగింపు మని చతురిక కెఱింగించిన. ౬౬౧

క॥ కడలేనివిరహవేదన। నిడుగడ వచ్చుచుండుకంటె నీభర మెల్లన్
మృదు నైయిదఁ దపోవర్తన। నొడలేర్చెద నరిగి దారుణోగ్రాటవులన్. ()

వ॥ అని విన్నపంబుసేసి వీడ్కొని చన నిశ్చయించె నది యని చతురిక పలికిన విని తీవ్రానలాహతిని నవనీతపిండంబునుబోలె శోకానలాహతిం గరంగుచు హిమవంతుం డనేకప్రకారంబుల ననునయించుచుఁ బ్రియనందన నెత్తి కౌఁగిటకిం దిగిచికొని. ()

చ॥ వలవదు తల్లి నీకుఁ దగువాని వయోగుణరూపవంతు నీ
వలచినవానిఁ జేసెద నవశ్యము నీవు దపంబు సేయఁ బోఁ

దలఁపకుమమ్మ చిత్తపరితాపము సేయకు మమ్ము మాకుఁ గో
మలి వనదుర్గవాసము ప్రమాద మగుం దగ దాఁడువారికిన్. ౬౬౪

వ॥ అదియునుం గాక. ౬౬౫

క॥ దొర యెఱిఁగి కోరవలదే। స్మరహరునకు నీకు హస్తిమశకాంతర మా
పరమునకు నీకుఁ బర్వత। పరమాణ్వంతరము దలఁపఁ బతి యెట్లగున్. ()

గీ॥ చిఱుత వేప్పరి నిన్ను నెఱుఁగవు గాన నీ। యుష్టిఁ గారణముగ నరియె దబల।
వాసవాదుల కని దాసులైరా గాన। శ్రైను మాముగాఁగ నేల కూడు. ()

క॥ అనుచుండె మఱియు మేనక బాష్పాకులితలోచన యగుచు. ()

క॥ హావో హావోయని చేడైవినం గందుననిసు వరిగ్లౌడు నామై।
జీవంబు నిలుచునే నినుఁ। బో విడిచి మహోగ్రదిగ్గజములఁ బాల్పడఁగాన్. ()

సీ॥ నలిరాకుకం బెను మెలపారునడుగులు ధరమీఁద మోపుఁడుఁ దెరలిపోపుఁ
గ్రొవ్విరితావకిం బెఁ గోమలం బగుమోము రేయెండ ముట్టిన నోయుఁ దడ్డ
పవనంపుఁబోరకం బె నవకంపుమెయిదీఁగె వడగాలిసోఁకుడు వాఁడు లగ్గ
నాదిగ ర్భేశ్వరి వంటినిఁ గందదు నెలకన్నెఱుంగవు నేని ముంప
రున్నయునికినె వెలువడ నుత్సహింపఁ దలఁచితేని యు నిది దుది దాఁక నెట్లు
నెయ్యిద నేరదు గాన నీ విందయుండె। కోర్కె సేసుఱ సర్వేశుఁ గొలువు మఱల.

వ॥ అని మేనక కూఁతు ననునయంబునం బట్టుకొలుపుచుండె నంత నంతిపురంబునం
గలవృద్ధకంచుకిప్రౌఢాంగనలుఁ దివ్యబలిమియుం గలిమియు మెఱయుచు నగజ
భంగించుచు నగ్గించుచు. ()

క॥ ఆలవు బాలవు గడుఁ గోమ। లాలవు గోమలివి ముద్దరాలవు దగి మం
చాలవు బేలవు గాకిది। కాలమె తపమున కపారకాంతారములన్. ()

గీ॥ ఇడ్డబొట్టువోలె నింటిలో నుండక యొఁడ్డదాక పింత యడలి బాస
నడవిలోనఁ దపము వడఁ బోదు నను చింతి జాలిభీతనము లెందు గలవి తీవు. ()

సీ॥ హరిఁ దెత్తుమే నీకు నర్ఘ్ముదువడి యుండఁ బరమేష్ఠిఁ దెత్తుమే బంటు చేసి
దేవేంద్రుఁ దెత్తుమే నీవేలగొని యుండ నురగేంద్రుఁ దెత్తుమే యుమలుగొలిపి
శశిఁ దెత్తుమే నీకు సంబత్తు లిడియుండ ధననాథుఁ దెత్తుమే దానుఁజేసి
రవిఁ దెత్తుమే నీకు రమణుండుగా నలకూబరుఁ దెత్తుమే గోలికొల్పి
మదనసంహారుఁ డొక్కఁడు మాకు నెలసి। ప్రచ్ఛ కాఁడవుఁగా కెట్టివారి నైన
నొరుల నొక వ్రేలిమిడి దిరుల్ మరులుగొలిపి। దివియమే దేవి నీయట్టి దీము గలుగ.

వ॥ అని యనేకప్రకారంబులఁ దన్నుఁ సిబ్బుగ్గివడం బలుకు చున్నవారి నందఱం గ
టాక్షించి చూచి కోపరసాభరితాకుంచితభ్రూలతార క్తనయనాస్ఫురితాధర యు
గుచు గిరినందన పరిచ్ఛేదించి. ()

చ॥ చెవుడుపడంగ నగ్గడలఁ జీరుచు నన్నొకవెంద్రు చేసి మీ
రివియవి యంచు బుజ్జవము లిన్నియునెన్నగ నేల నాకు నీ
భవమున నీశ్వరుండ పతి ప్రాణము దేహముఁ జిత్తవృత్తులున్
శివపదపంకజార్పణము సేసితిఁ బాసితి మీకు నింతతోన్ ()

వ॥ అని తెగంబలికిన మాఱువలుక నోడి గిరినందన తపోవనంబునకుం బోవుట కంప
ఱు సమ్మతించి. ()

తరు॥ బాలవు నీకు నిప్పటిఁగోలె నీతపం బిగి కైకొని పార మేదింపఁ
బోలదు వల దని బుద్ధులు చెప్పఁ బోయిన మానూనిఁబోవకుమమ్మ
నేలిదముగఁ జేసి యెస్సని వోయె దేవి నిక్కఁడ నీవ యెఱుఁగుదు నిన్ను
వాలాయముగ నాఁగవచ్చునె యింత వలవంత తన నూఁదువారికిఁ దగునె.

ఎ॥ అను చుండి రంత హిమవంతుండు నారదాదేశమ్ముఁ దలంచి. ()

క॥ హరిణాక్షి తపోబలమున బరమేశ్వరుఁ గూడఁ బడయుఁ బరమార్థంబ
త్యుదితరతపమునకు నవి। స్తరంవనోగింప కాదె తగుఫల మొందున్. ()

వ॥ అని నిశ్చయించి నిజతనయ తపోవనంబునకుం జనుట కొడంబడియె నంతఁ బా
ర్వతి జననీజనకాదివృద్ధజనంబుల వీడుకొని మహోహర్షంబున నిజనివాసంబునకుం
జనుదెంచి గమనోద్యోగంబు సేయుచు. ౬౮౧

మ॥ హారిణీ వచ్చెదె కానకుం దపము సేయం బోద మంచున్ మృగిం।
బుజ్జుదున్ మామిడి నీవు గ్రమ్మఱెదె సన్ బోఁజ్యోపి యంచున్నవా
జిరచూతంబుల గౌఁగిలించుకొను నాచే వాయుదుం గాక పు
ద్గురువృత్తస్తనసంగతిం దొఁగిఁగితే ఘోషావలీ నీ వనున్. ౬౮౨

వ॥ మఱియును. ౬౮౩

గీ॥ చెలువ దనచెలిమికత్తెలఁ బిలిచి నాకుఁ। గూర్చుగుమ్మ లెవ్వ రీకొమ్మలందు
వారు నేకొని రక్షింపవలయు వీని। బాఁతిగా నని యుందఱఁ బట్టువఱిని. ౬౮౪

ఉ॥ ఈకలహంసిఁ బెంపు మది నేమఱ కీవు మయూరపోతముం
జేకొని పెంపు మీవు గవచిల్కలఁ బెంపుము నీవు వెంపు మీ
కోకిల నీవు పెంపు మఱఁగోరఁట నీ వెద మెచ్చఁగొల్పి యే
నాకఱకంతుఁ దోడ్కొని రమ్మనఁ గ్రమ్మఱ వచ్చునంతకున్. ౬౮౫

వ॥ అని నియమించుచున్నతఱిం బ్రియవయస్యలైన రాజనందనలు తమయందఱికి
వగకల్లినకన్నెఱింగి. ౬౮౬

సీ॥ పాలయించి నీచూచునలఁతికిమైదయెకొని చూచురాలేటికొదమ లివియు
ఁగడు మృదురీతి నీనడపాడుగతికి రా నని క్రాలినడచు రాయంచ లివియు
భావించు నీముద్దుఁబలుకులమెయివడి బలవడఁగఱచురాచిలుక లివియుఁ
బాటించి నీకేశపాశంబు మీఁదికిఁ బాదివెంచురానమ్మిపదువ లివియుఁ
దరుణి వీని నింత మరపించి నునుపారఁ బెనిచి నీవు ననఁగి పెనఁగి పెరిగి।
నెయ్య మఱఁగ నెట్లు నిర్మోహివై తెగ విడిచెదమ్మ మమ్ము విడిచెదేని. ౬౮౭

వ॥ అని యుందఱకు వగపు పుట్టించి మనసు గుదియం బలుకుచున్న చెలికత్తెలం గ
నుంగొని నగజ నగుచు వారినందఱం బౌరజనంబుతోన వీడుకొలిపి చతురికా
ద్యాప్తసఖీజనపరివృతయై చని తపోవనప్రవేశంబు నేసి. ౬౮౮

క॥ గిరినందన గిరినందన। తరుగుల్మలతానదీనదప్రాకటని
ర్ఝరసరసీపులినలతాం। తరముల విహరించుచును ముదం బొదవ మదిన్.

---

౬౮౨. వాయుదుం=పాయుటయుఁగాక.

సీ॥ అరుణాంఘ్రితలదీప్తి నవనీతలం బెల్లఁ బద్మరాగస్థలభాతి నొనర
వదనేందుకాంతిదిగ్వదనకైరవము లకాలచంద్రాతపలీల నెఱయ
నధరారుణద్యుతి నారణ్యతరులతాసమితి పల్లవితవిభ్రమముఁ బడయఁ
దనులత నుడియు నెత్తావి గైకొని సమీరుఁడు గంధవహుఁ డనురూఢిఁ దనర
వఱలు నయనరుచులు వనమయూరములు విద్యుల్లతావలోకనోత్సవంబు
బొరయ నరుగుదెంచెఁ దరువాసస్థని నువిరాజితముగ శైలరాజతనయ. ౬౯౧

వ॥ తదవసరంబున. ౬౯౨

ఉ॥ సాయక వేరువెల్లకినుఁ బండులు నొండ్లులుఁ గూరగాయలుం
గోసుమ నుక్కసంబులు లగోళులుఁ దోళులుఁ గొంచుఁ బేస్వనం
గాయఁ జంపి యేనుఁగులకొమ్ములు నెమ్ములుఁ గొంచుఁ గానలో
నేమెడఁ దారగ్రాఁ పోలుచు నెఱ్ఱులు మొఱ్ఱులు శేకపారులున్. ౬౯౩

వ॥ అనునాటవికజనంబు లపూర్వస్త్రీరూపంబులు చూచి దేవలోకనకుతూహ
సముత్రై కూడం జనుదెంచి రంత ౬౯౪

సీ॥ పణిచుంముఁదలలును బఱుదులు దబ్బర మిడిసినగ్రుడ్డులు ఒడఁకిచెవులుఁ
గుందుఁబండ్లుఁ బలికెగడ్డంబులును నల్లపొట్టలఁ దులనంటురూపులును ఁగుఱుచ
కోఁజేతులు నిఱుకగోళ్ళును నొక్కఁబ్రక్కలు బొక్కరొమ్ములు కఱకుఁద్రొంటి
కిడుపులు మురప్రమోకాళులుఁ బార లెత్తినెఱసినయడుగులుఁ గుఱుపుగిట్టి
సరళి తొత్తియున్నపరుసంపుటాడువులు నడవిలోనఁ గిలయ మొదించు రేఁగి
గదిరువలచుకంపుగాలి మచ్ఛయుఁ గలుగు నెఱుకుమునింఁడి గనిర సరులు. ౬౯౫

వ॥ ఇట్టివికృతాకారంబులు గని కిన్నరులు లగు చుండ రంత. ౬౯౬

మ॥ చమరీవాలములన్ మయూరవరపింఛవ్రాతముల్ గండశృం
గములున్ సూకరవేణునాగభవముక్తాజాలముల్ రుక్మచ
ర్మములున్ సింహనఖంబులున్ మధువులున్ మాంసంబులున్ దాల్చి రా
మ్రముతో వచ్చుపులిందులం గనిరి కాంతాదాంతరాళంబులన్. ౬౯౭

వ॥ అంత నాటవికబలంబున్నొవ్వరుం డిది లోకేశనందన యగు నెఱింగి యతిసంభ్రమమున

గీ॥ దప్పితేఘనగనాయతనుప్రకోష్టుఁ। డిభవిషాణాహతోరస్కుఁ డభయుఁ డుగ్ర
కోలదంతాగ్రభిన్నజంఘుండు శబర। నాథుఁ డేతెంచి శైలకన్యకకు మ్రొక్కె.

వ ॥ తదనంతరంబ. ౧౯౯

సీ ॥ హరినీలమణులకు నాయువు వచ్చె నాఁ గనునీయు మగుతనుకాంతు లెసఁగ
మెఱుఁగుఁదీఁగలు గండుమీలపై నెలసె నా దృగ్భాసురద్యుతుల్ తేజరిల్లఁ
జమరీనుకేశపాశములఁ దుష్మోదపిండు దగిలె నాఁ గుటిలకుంతలము లమరఁ
గాంచనకుంభముల్ కరికుంభకర్కశ మెనసె నాఁ బాలిండ్లు వొనరి తనరఁ
బాపవశమున శాపంబు పడి విహీన। జనులసంగతి కిగ్గమై పొనరఁగన్న
యమరసతులలో దర్శనీయాంగ లైనయెఱుకులేమలఁ గాంచె శైలేంద్రతనయ. ()

చ ॥ వరతరుకోటరాహిఫణిపగ్గము దేన్తులు స్రావి తద్వనే
చరులాగి రాఁపఁబోవుచు భుజంగఫణావలిగా నెఱింగి చె
చ్చెరఁ బెడఁబాసి పోవునెడఁ జెల్వుగఁ జూచినకాఁదపూపు ల
య్యెరగమి డాయనోడుదు రహీంద్రవజశంక విభీతచిత్తులై. ౨౦౦

ఉ. జీవికకల్లుద్రావి మదసింధురగామిను లన్ని కేతియల్
నాఱుచు గొడుగీతములు వాడుచుఁ బొల్పుగఁ గ్రాలియాడుచున్
గోలడ మాడుచుం బతులకున్ వశవర్తులుగాక మేరనున్
మీఱుచు వన్నెకాంతలు రమింతురు తద్విపినాంతరంబునన్. ౨౦౧

వ ॥ మఱియు నొక్కయెడ. ౨౦౨

చ ॥ పటికపుఁగ్గోలముల్ వెదురుబా రొగిఁ బోయుచు గొనుర్రొమ్ము రోఁ
కటఁ గొని దంచుచున్ శబరకామిని వెక్కులు రాగముల్ మదో
త్కటముగఁ బాడెఁ జుట్టినమృగంబులు సోదు మనుష్యగొపసూ
గ్గటిమునిముఖ్యలోకగురు జంగమలింగము పుట్టకొగ్గునన్. ౨౦౩

క ॥ వేణుజమౌక్తికములు దోడి। గాణల కింపెసఁగ నెఱుకుఁగన్నెలు ప్రీతిన్
వాణీధరుఁ బాడిరి గీ। ర్వాణాధిపభోగిభువనవంద్యు ననింద్యున్. ౨౦౪

వ ॥ ఇ ట్లతిపవిత్రంబు లగుశబరాలయంబులు గడచి చనిచని. ౨౦౫

౨౦౨. అన్ని = మనంచి. వన్నెకాంతలు = Coloured tribes (అటవిక
స్త్రీలు.)

చ॥ ఎలమిన పూరిమేసి సెలయేఱుల నీరులు ద్రాగి నేలివెం
చల నెలమావిజొంపములఁ జల్లనినీడల నిల్చి పొల్చి మం
దలుగొని వందిపోతులనుఁ దారునుఁ బేయలు సమ్మదంబునన్
గలసి రమించుధేనువులఁ గాంచిరి తద్విపినాంతరంబునన్. ౨౦౭

వ॥ తదనంతరంబ పత్రఫలపుష్పమూలనీవారాకారవల్కలేధ్మకుశాహరణార్థంబు వి
హరించు చున్నమునికుమారులం జూచుచు వచ్చి వచ్చి ముందటం బుష్పవాటి
కాంబుపరిషేచనైకలాలసలై విహరించు చున్నఋషికుమారీసమూహంబుం గని
వారిసహజసౌందర్యరూపాతిశయంబునకు మెచ్చి శిరఃకంపంబు సేయుచు. ౨౦౮

సీ॥ అనులేపనములు మండనములు లేకయు భాసురాంగము లింతదేసియగునె
లలితాంబరములు మేఖలలు లేకయు హారిజఘనంబు లింతమాసరము లగునె
వరహారములుఁ బత్రవల్లికల్ లేకయు వలిసన్నుగవ లింతచెలువమగునె
భ్రూలతానటనంబు పొలపంబు లేకయు విచలేక్షణము లింతరుచిరమగునె
కమ్మనూనియు మెఱుఁగొక్కఁ గలయదుప్పి। కురులు దీర్ఘకయునుఁగచభరములింత
పొలుచునే యని చూచె నాభూసురాధి। రాజకన్యలఁ బర్వతరాజకన్య. ()

వ॥ తవనంతరంబ. ౨౧౦

మ॥ వృతయూపాటవియాగసావకశిఖావిర్భూతధూమోద్గరో
శితసంప్రాప్తమహీరుహప్రకర ముక్షిప్తప్రవర్యాగ్నిరం
జిత మభ్యర్చితదేవతానికర మాశ్లిష్టాగమాచార మూ
ర్జితపుణ్యంబు మునీశ్వరాశ్రమముఁ గాంచెన్ గౌరి సంప్రీతితోన్. ౨౧౧

వ॥ కని తదీయతత్త్వమహత్త్వంబులకు మెచ్చి వర్తించుచు. ౨౧౨

సీ॥ భారతినడపాడుపదగతు లన మెల్పు దలకొని క్రాలుపదక్రమములు
వాణిచేపడిమ్రోయువీణారవంబునాఁ గమనీయ మగుసామగానములును
భాషాకటాక్షవిభ్రమమునా మెఱుఁగారుసదమలశబ్దార్థశాస్త్రములును

---

౨౦౯. దేసి = సహజమనోహరమైనది (దేశ శబ్దతద్భవము) “దోసమనె గుణదవోలు। ద్యాసిసి కన్నడదవళొల్గుపూర్వాచార్యర్। దేసియనె నితిసినిధాండ। ప్రాసమ నతిశయమదెందు యతియంమిక్కుర్.” అనికవిరాజమార్గ.

వాగ్దేవిమంజులవాక్యంబు లనఁగ నిం పొదవినసాహిత్యపదవిపాలుపు
రాజితంబుగా సరస్వతీపీఠకసదన మనఁగఁ దనరుసకలకళలు
సంతతంబు మూర్తిమంతంబులై విహరించుచుండు దివ్యబ్రుషుఖపల్లి. ౨౧౩

క॥ ఎలుకలుఁ బిల్లులు లేళ్ళుం। బులులు మదేభములు సింహములుఁ గప్పలుఁ బా
ములు గువ్వలుఁ డేగలుఁ బిక। ములుఁ గాకులుఁ గూడియాడు మునిపల్లి వడిన్.

వ॥ ఇట్టి మునిపల్లి సొత్తెంచునవసరంబున. ౨౧౫

క॥ దూషితకుతర్కవాదులు। భూషితషట్తర్కు లఖిలబుధవినుతులు వి
ద్వేషితదోషులు సతతా। న్వేషితసన్మార్గు లఖిలవిద్యానిపుణుల్. ౨౧౬

క॥ శిష్టాచారులు బోధా। క్లిష్టాత్మకు లనఘు లఖిలసేవ్యులు సకలా
భీష్టపిరక్తులు మానులు। స్రష్టాన్వయకర్తులు సద్విచారులు ధీరుల్. ౨౧౭

క॥ నిష్ఠాపరు లురువేదా। నుష్ఠానసమాచరులు మనోహరులు మహా
శ్రేష్ఠాత్మకు లమలులు పర। మేష్ఠిసములు సర్వసత్వమిత్రులు పాత్రుల్. ()

క॥ దుష్కర్మచరణకుజనబ। హిష్కారపరుల్ సదామహేశ్వరతత్వా
విష్కృతబుద్ధులు సిద్ధులు। నిష్కళచారిత్రపరు లనింద్యులు వంద్యుల్. ౨౧౯

క॥ కృష్ణాజినోత్తరీయులు। గృష్ణాచారాపహరులు కృతకృత్యులు సం
కృష్ణోదితార్చకులు గత। తృష్ణాంతఃకరణపరులు దివ్యులు భవ్యుల్. ౨౨౦

వ॥ అనం బరఁగుదివ్యర్షిగణంబులందు. ౨౨౧

సీ॥ వడిమోక్షమార్గంబు విడువక నడతు నన్నతఁ డేల లోకులగతిఁ జరించు
ననిశంబుఁ బరమాత్మ నాత్మఁ గూరెదునాతఁ డోగులసంగతి నేల బొరసియుండు
ననుపమముక్త్యంగనాధీశుఁడుగఁ గోరునతఁ డేల కుజనులసతుల కొలఁగుఁ
బరమయోగామృతవరరససేవనఁ దనిలినవాఁ డేలసవుల కెలఁగ
నోటువడు శరీర మొల్ల నన్వాఁడు దేహేంద్రియంబులిచ్చ లేల చలుపుఁ
గర్మవిహితయోగనిర్మలచరితుండొ పురుషుఁ డేల క్రియలఁబొందు నెందు. ()

---

౨౨౨. షష్ఠ్యగమున సంధియైనందునకు : “ అన్నపూర్ణావిశాలాక్షులంట హరిశ్చంద్రోపాఖ్యానము. “ నీరసధరాధిపలోకములిండ్లువాకిళులన్ దూఱుట త్రిపురాంతకోదాహరణము.

చ॥ అనయము రక్తపూరములు సన్నుబు మేదము మూత్రవిష్ఠలుం
దనరుజరారుజాళియునుఁ దాఁపసవృత్తి భయాతురాదులుం
జెనఁగినదుఃఖపుంజ మగుప్రేతము సొచ్చి మునింగి మర్త్యుఁ డీ
తనువునఁ బొంద రోయఁడొటె తా నరకస్థితి కేమిరోసెడిన్. ౭౨

క॥ విని చెవుల ముట్టి తోల్లం। గని కన్నుల సమున్ నాలుకను.మూర్కొని ము
క్కునఁ బురుమఁ దెలుఁగు మన మా। రను శబ్దస్పర్శరూపరసగంధంబుల్. (

క॥ చక్షుమదనేంద్రియములు ము। ముక్షులుమది గెలుతు రెఱిఁగి మును శ్రోత్రత్వ
క్చక్షుర్జిహ్వాఘ్రాణస। పక్షగవాక్పాణిపాదపాయూపస్థల్. ౭౪

గీ॥ అనుభవింప తనికె యట మఱి విషయములన్ విడుతు నని తలంచు వెడఁగుఁదలఁపు
లఖిలశిఖిశిఖాళియందింద నాజ్యములన్ గమియ వైచి యార్పఁ గడఁగునట్లు. (

చ॥ తలఁకఱ నిల్చి శాంతి నొదఁదాల్చి మమత్వము మాల్చి ధైర్య మి
ట్టలముగఁ బెంచి మోహము లడంచి యథావస్థిఁ గాంచి యాత్మలో
పల ననురక్తి నిశ్చలలి భక్తిఁ దలంచిన ముక్తి చేకుఱున్. ౭౭

తరువద॥ హృదయాంబుజములోన నెప్పుడుఁ బాయ కేర్పడి వెలుఁగుమాహేశ్వరరూ
మదిపరజ్యోతి సదాభ్యాసవృత్తియందు చిత్తంబు లయంబు గాపించు
నది భావభావ్యంబు లడఁగిన మఱి నిజాకారుఁ డగుపరమాత్ముఁడు దాన
పదిల మైనిలుచు నిర్బంధమై నిష్ప్రపంచమై నిర్వాణపదవిదా నదియు. (

సీ॥ భావించి మెచ్చింపఁగా వచ్చు నందమే వగవ భావంబు భావ్యంబు దాన
ప్రణుతించి మెప్పింపఁబడయుద మందమే తనర శబ్దంబు నర్థంబు దాన
పూజించి మెచ్చింపఁ బోలుఁబో మందిమే తగినకర్మంబుఁ గర్తయునుఁ దాన
కాన మనోవాక్కాయకర్మంబులు శివునియందు నిలిపి చిత్తవృత్తిఁ
దన్ను శివునికంటె నన్యంబు గాకుండ నెఱిఁగి తలరకుండు డిదియె ముక్తి
గాన మోక్ష మొందుగర్మమార్గంబునఁ బడయఁగడఁగు టెల్ల భ్రాంతిగాదె. (

క॥ తాన సమస్తములోఁ దన। లోనన సకలంబు గనుట లోనును వెలియుం
దానయయి తనకు వేఱనఁ। గా నేమియు లేక తాన కలిగి వెలుంగున్. ।

క॥ కలిగియుఁ జెప్పను జూపను। దలఁపను రా దెల్లచోటఁ దానై యెందుళ్
గలయఁడు సర్వగుఁడై ని। శ్చలుఁ డగు నేకాంతుఁ డయ్యు సర్వాత్ముఁ డగుళ్.

క॥ తలఁప నని తలఁచి యించుకఁ। దలఁచుఁడుఁ దలఁపంగ లేక తానును లే క
ప్పలుకులును లేక యెప్పుడుఁ। గలిమిఁ జూడ వైనవాఁడు గదిరి వెలుంగుళ్.

క॥ తలఁపఁబడుదానితోడన। తలఁపులు ముసు సెంతీచి మఱచి తాఁ బరమాత్మం
దలఁచుట మఱవక నిజ మని। నిలిచినపురుషుండు దాన నిర్వాణి యగుళ్. ()

చ॥ దొరకొనునింద్రజాలమునఁ దోఁచినరూపము లింద్రజాలమం
చరయఁగ లేక చూపఱకు నన్నియు నిక్కమువోలె నైనయ
ట్లిరవుగఁ బారమార్థికుల కెప్పుడు ద్రవ్యము లెల్ల మిథ్యలై
నిరతము చూడ లోకులకు నిక్కములై చను భ్రాంతిపెంపునళ్. ౨౩౪

వ॥ అని యనేకప్రకారంబుల వేదశాస్త్రపురాణాగమసారవృత్త్యాధ్యాత్మశాస్త్రవిధి
హేయోపాదేయపదార్థంబులు నిజశిష్యగణంబులకు విస్పష్టంబుగా వ్యాఖ్యా
నంబు సేయు చున్నమునిముఖ్యుల దర్శింపుచుం జనిచని ముందట. ౨౩౫

ఉ॥ వాసనగా శివాగమము వర్ణన కెక్కఁ ద్రయీసదర్థముల్
దేసిగ నాత్మశిష్యులకుఁ దెల్పుచు సద్విధి నున్ననిష్కళా
భ్యాసము నందు లీన మగుభావము నిల్పి వెలుంగు చున్నస
ద్భ్యాసురముఖ్య విప్రమునిపుంగవు జంగమమల్లికార్జునుళ్. ౨౩౬

మత్త॥ వృక్షమూలనివాసు నాతతవేదవేది ననూనరు
ద్రాక్షధారి నఘారి నత్యమలాంగు నున్నతమోక్షసా
పేక్షితుళ్ నిరపేక్షితుళ్ బుధవృద్ధవంద్యు ననింద్యు ను
గ్రాక్షపాదసరోరుహార్చకు నాత్మవిత్తము సత్తముళ్. ౨౩౭

వ॥ కని భూరిప్రీతిం బ్రణమిల్లి గురుస్థానంబుగా స్వీకరించి పార్వతి పరమభక్తియుక్తి
నారాధించి తత్ప్రసాదంబున పడయునిజాభిమతం బెఱింగించి శైవాగమవిధిదీక్ష
గొని పరమేశ్వరుండు రయంబునం బ్రసన్నుం డగునట్టిమంత్రధ్యానవ్రతాచా
రంబు లుపదేశంబు గొని తన్నియోగంబున. ౨౩౮

చ॥ ఉదుట(డెమల్చి క్రుంగుసరసోదకబిందులతో క్షితంబు లం
గదర గబళించుచు( బీల్చు పడగంధ్రులకుం దను వోసరించుచు( దో
యదము లవల్చిదూరు సచిరాంశులతాగ్రము లెక్కు మెల్పునం
జదలకు నుప్పరం బెగయు( జాతకపోతకముల్ సెలర్చుచు౯. ౨౫౬

క॥ చలిగాడ్పులముసరులమె యి। వలిగొని ధాత్రీపురంధ్రి వలి( బచ్చనికం
బలి( గవిచికొన్నవిధము( గ। లలుపుగ( జిప్పరుదు గవిసె భూతలమెల్ల౯. ౨౫౭

క॥ కారనువీరు(డు మెఱు(గను। దోరసి( బాంధు లనురిపుల( దునిమిన( దద్దే
హోరుణబిందులు బారిగెనొ। ధారుణి నన నింద్రగోపతతి విలసిల్లె౯. ౨౫౮

గీ॥ సురపగోపచాపశోభితంబై యుండు నవపయోద వేళ దివియు భువియు
దెసలు దీటుకొన(గ( దృణఘననివహంబు ఘన్న నుయ్యె మఱియు మన్నుమిన్ను.

శా॥ ఆక్రోశాకరనురాజుగ్రమొల నిజరావానంత గేయాభ్రనా
దైకాతోద్యము( గూర్చి మ్రోయు సురగోపాంభోద రాగల్వినా
నీకోద్యద్ధరదక్ష్మకస్థలలసన్నృత్యోర్వరురంగస్థలిం
గేకిపాత్రము లాడె భావముగ నక్షీణ్యాగ్రపింఛంబులై. ౨౬౦

గీ॥ డిందమై పూచి పర్విననకుందలతల। తోన కడమలు( బూచె( దొల్యానకాల
మెస(గె విరహులు విరహాగ్ని నెరసి నీటు। పొరపు గొని యున్న నిప్పులప్రోవు

క॥ సురనదిఝుషములు డిగ్గ(గ। శరనిధి కాశరధిలోనిఝుషకము లెక్క౯ [లన(గ
సురనది కెక్కెడపడకయు। కురిసె మహావృష్టి గుండుగూల్చినభంగి౯. ౨౬౨

౨౬౨. అఖండవర్షాపాతనమున( గొన్ని యెడల మిద్దెలపై నుండి నీరేక ధారగా గ్రిందికిజాఱునపుడు క్రిందిపల్లమున మత్స్యములుండెదటన్నించునేని యవి తద్ధారామార్గమున( బైకి నెదురీది పోవుట యనుభవసిద్ధము. పోల్చిచూడు(డు;—"వీనులకురగా( గడలవెల్వడు బాష్పపయస్సమృద్ధిలో( గాన(గనత్యొగంధగజగామినికిం గనుదోయి కెగ్గపా। ఠోనిధులందునుండి తిలతోదుత వెల్వడి బాష్పనిమ్నగా। సూనతరంగరాజి కెదురెక్కిన వాసచరంబులో యన౯" సూరనగారి యావయపోదయము. ఆ.వా.

చ ॥ దర్గములు ముంపుచుం దరులతాతతి వేళ్ళులతోన కూలఁగా
నురువడిఁ ద్రోచుచుం మడువు లోలిఁ గలంచుచు నంబుజాలిసం
హరణము సేయుచు స్వదజలౌఘము గ్రమ్మ మదాంధగంధసిం
ధురములుబోలెఁ బెల్లున నదుల్ సనుదెంచె భయంకరాకృతిన్ ౧౬౩

వ ॥ అట్టివర్షాసమయంబునం దంభోవాసినియై గౌరి ఘోరతపంబు సేయునవసరం
బున. ౧౬౪

క ॥ అమరె నెఱిజడలపై ను । త్తమరుచి నవజలకణములు దిగిలి పెడంగా
యుమ తపమున కెదమెచ్చి త । దమరులు ముత్యముల సేస లలిక్రినభంగిన్.

వ ॥ మఱియును. ౧౬౬

చ ॥ అడరునవాంబుధారలు జటాటవిలోఁ బడి విభ్రమించి వె
ల్వడి చనుదెంచి రాల్పుగొని పక్ష్మముల న్వడ నిల్చి మోపిపైఁ
బడి కుచఘట్టనం జెదరి పాఱి రయంబున ముత్తరంగలన్
మడుగులు వాఱి నాభి కెడమానక చొచ్చె నను్క్రమంబునన్ ౧౬౭

వ ॥ తదనంతరంబ. ౧౬౮

మ ॥ దళితాంభోరుహసప్తపత్రసుమహోత్కాశసనౌఘంబు ని
ర్గళితాంబుప్రదకేతకీకుటజకుందవ్రాత ముద్భాసితేం
దుజసన్మత్తమరాళకంబు దతవిద్యుత్కేకి స్తాస్య మ
గ్గలమై పర్వె జగంబులం దురుశరత్కాలంబు రమ్యాకృతిన్ ౧౬౯

క ॥ జలశాయులైన హరిల । ప్పులువర్షనిశావసానమున మేల్కని క
న్నులు విచ్చి చూచినట్టులు । జలజోత్పలరుచులు వెలసె శారదవేళన్. ౧౭౦

తే ॥ తేటం గొలఁకులు వే తడి । యాటైె మహీతలము పిరిస నజ్జము లేమిన్
బాటైె మరాళము లోలిం । దీటైెం బులినములు వెలిఁగె దిక్కులు గలయన్.

సీ ॥ కాంతల హారప్రకాశంబుఁ బోడస కాశప్రకాశవికాస మెసఁగె
ముడిఁదలలిన్నెి నడపులతోడ నయమున రాయింపఁగదుపు లడరె.

బాలఁతులకనుఁగవపొలుపంబుతోడన నళిఁ జకోరంబులు పొలుప మెలసె
వెలఁదులముఖకాంతి వెలుఁగుటతోడన విమలమై శశికాంతి వెలుఁగు డమరెఁ
దెలివలైదలకలఁక దేఱుటతోడన యేఱులందుఁ గలఁక దేఱుఁదొడఁగె
మదనవతుల మదసముదయంబుతోడన పంచి శారదోదయంబు దనరెఁ. ౨౨౨

ఉ॥ చారునిశీథినీవిమలసాంద్రసుధాకరభాతి రోదసీ
పూరితమై దినంబుల నభోమణిదీప్తి దలంక క్రిమ్ముగాఁ
బేరఘనీభవించె నసఁబెల్లె సఁగెన్ సితమేఘహంసపం
క్తేరుహకాశసంహతులు గ్రిక్కిఱిసెన్ శరదాగమంబునన్. ౨౨౩

శా॥ శ్వేతద్వీపము చంద్రబింబము మహాక్షీరాబ్ధి దత్ జ్యోత్స్న ద
ద్భాతిం గృష్ణుఁడు దన్మృగాంకము లసత్పద్మాలయాక్షిద్యుతుల్
బ్రీతిం జారుచకోరదంపతులు నాఁ బృథ్వీధరుం బోలి వి
ఖ్యాతిం బొల్పగు శారదాభినుతగాఁ కారాత్రు లత్యున్నతిన్. ౨౨౪

క॥ నారీసంగమసుఖములఁ। జేరని గాంభీర్య వృత్తిఁ జేకొనక సరి
త్తీరజలంబుల మధ్యమ। వారి న్నగునట్లు గాశవనరుచి వెలిఁగెన్. ౨౨౫

క॥ శరదాగమమున శోభా।కరముగఁ శైవాలఁబండి కలమవనంబుల్
గరుసున నెలమిగ తామర। విరిపువ్వులతావి కెఱఁగువిధమునఁ బొలిచెన్.

ఉత్సా॥ అరుణశాలి కణపములు శుకాలి గఱచుకొనుచు నం
బరతలమున నోలి నెగసి పాఱు దిగ్వధూచయం
బరయఁ జెలువ నొసఁగు శారదాగమమున నుత్సవో
త్కరవిభాతిఁ దోరణములు గట్టినట్టు లందమై. ౨౨౭

౨౨౩. తెఱఁకు = వ్యాపించు. "వెఱఁగుపడి హర్షరాగముదఱికిన వదనములు" నృసింహపురాణము.

౨౨౪. పోల్చిచూడుఁడు. "వెన్నెల వెల్లిపాల్కడలి వేఁకదనంబునఁ జేర్చి దిమ్మున ముంచి యందు రజనీకరబింబము కుండలీభవ [త్కున్కలన్
త్పన్నగతల్పకల్పనము భంగిఁ దనర్చెఁ దదంతరంబునన్
వెన్నునిభంగిఁ జూడ్కులకు వేడ్కొనర్చెఁ గలంక మత్తఱిన్" నృసిం=ఆ-౩.

వ ॥ ఇట్లఖిలమనోరంజకంబై యతిరమణీయంబైనశరత్సమయంబునం బార్వతి తత్కాలోచితంబు లనుష్ఠించుచుండునంత. ౭౭౭

ఉ ॥ శాంతఘనాధిపప్రకరచండతరత్వము మందితాబ్జవి
క్రాంతము వీతసప్తదలగర్వము ధూతమరాళికాలివి
భ్రాంతము నిగ్గతేందుకరభాసము దేశములందుఁ బర్వె హే
మంతము సంతతోపచితమారవికార మనంగ్రమంబునన్. ౭౭౮

క ॥ శరదాగమంబు దననుత । కురుపరితాపంబు సేయు చుండుట హిమభూ
ధరపతి గని వానిపయిం । బరిగొనినొను నాఁగఁ దుహినపటలము పర్వెన్.

శా ॥ శీతాత్యంతనిపీడనంబు బడి జగజ్జీవాదు లత్యార్తులై
పాతాళంబులు సొచ్చున ట్లిరవు లొప్పెన్ భూగృహావాసులై
భీతిన్ వెల్వడకుండ వహ్నినెయిఁ గంపింపం బ్రచండార్చికిం
జేతుల్ గ్రొవ్వెరవొప్పుచుండ శిశిరోచ్ఛేదంబు వర్వెన్ మహిన్. ౭౮౧

వ ॥ తదవసరంబున. ౭౮౨

గీ ॥ తనరి హేమంత మగుడుఁ బద్మంబులడఁగి । పోయెఁబోయినఁగొల నొక్కపుష్పతనవు
విత్తుగా దాఁచికొనియున్నవిధముపోలె । శైలసుతముఖ మదకవాసముననొప్పె.

వ ॥ మఱియును. ౭౮౪

చ ॥ వనజము లెల్ల మంచుగొని వాడినచో నొకపువ్వు నిల్చినన్
గని యలు లన్నియు న్నెలపు గైకొని దీనికి మ్రుచ్చు వచ్చునో
యనువగ మీఁదఁ బిండుకొని యగ్గము నిల్చెను నాఁగ నంబుజా
ననముపయిం జటావలి పెనంగి నగాత్మజ కొప్పు నత్తఱిన్. ౭౮౫

వ ॥ ఇట్లతిదుస్సహనీయశీతోపేతంబు లగు హేమశిశిరంబులందు నిరంతరోదకవాసని రాహారాదిఘోరతపోవృత్తిం బ్రవర్తించుచుండునంత. ౭౮౬

చ ॥ జలజల డుల్లుపర్ణములచప్పుడు లక్కడఁ జూడఁజూడఁ బై
నైలనుదువచ్చు నూనులను నేర్పడు కెందలిరాకుఁజొంపముం

ళ్లాలు పగుమొగ్గలుం విరియుపూవులుఁ బూఁపలు ప్రూనిప్రూని క
గ్గలముగఁ దాల్చెఁ బేర్చివినఁగా నదియొట్టి వసంతవేగమో. ౭౮౭

వ ॥ అన నిఖిలభువనమనోరంజకం బగుచు. ౭౮౮

చ ॥ పొలుపుగ నేచి చెల్వడరఁ బూచి బెడంగుగఁ గాచి పండుమ్రా
కులు మరుఁ జేయఁ గోయిలలు గూయ మదాళులు మ్రోయ రాగుఁడా
వలరసమందఁ బ్రోషితులు వంద వగల్ మిడ మంద వచ్చె న
త్యలఘువసంత మూర్వర ననంత విభూతి నిరంతరంబుగాఁ. ౭౮౯

వ ॥ అంతం బార్వతి వసంతానంతలతాంతసంతతి నంతకాంతకాక్రాంతపూజాత్యం
తహెూమాదిక్రియలం బ్రవర్తించుచుండునంత. ౭౯౦

చ ॥ స్ఫురదురుదావపావకము శోషితసింధుచయోదకంబు సం
హరితపతంగసంఘ మసమర్ధితమార్గగణంబు దప్తభూ
మిరుహకులంబు వర్ధితసమీరవిదాహ మశేషదగ్ధభూ
ధరనికరంబు నాఁ బటునిదాఘము వర్చె భయంకరాకృతిఁ. ౭౯౧

క ॥ తలఁచిన డెందము గందును । బలికిన నో రెల్లఁ బొక్కుఁ బ్రభ నూచిన క
ప్పులు గమరు ననఁగఁ బటుతర । విలయానలభాతి నెండ వేసవి గాంచెఁ. ౭౯౨

మ ॥ స్ఫురదారణ్యమహీంధరాపరసముద్భూతోగ్రజీవానలో
త్కరవిస్ఫారశిఖాలిఁ గూడి రవికాంతవ్రాతసంజాతదు
స్తరతీవ్రాగ్నిఁ బెనంగి వీచె వడ యాసంక్రుద్ధకాలాగ్నిరు
ద్రరయోచ్ఛ్వాససమేతమో యనుచు లోకుల్ భీతిఁ గంపింపఁగఁ. ౭౯౩

చ ॥ అవియనిగండశైల మన నంఘ్రులతోడన యొండకున్న భూ
భవ మన నింకి భిండిగిలఁ గాలనియే అన మస్తకం బాగిం
పవులనిమార్గసంఘ మనఁ బట్టుదు లోకములోన నిట్టివే
సఁగల నెన్న నా నఖిలసాధ్వస మయ్యె నిదాఘ ముగ్రమై. ౭౯౪

గీ॥ ఉరునిదాఘవాతాహతిఁ గరులతలలు । వ్రస్సి లోపలిముత్యముల్ వరుసవిరిసి
మంగళములలోని వ్రేలలభంగిఁ దూలి। వ్రేలిపడఁగాసెఁ గట్టెండ పిడుగువరించి.

క॥ హరి శరధి గ్రుంకె నభవుఁడు। సురనది దలఁదాల్చె నబ్జజుఁడు గ్రమ్మఱి నం
బురుహంబు సొచ్చె నతిదుస్తరదుస్సహతీవ్రతరనిదాఘభయమునన్. ౨౯౬

వ॥ ఇట్లతిదారుణం బైనఘర్మదివసంబునం బార్వతి పంచాగ్నిమధ్యాగ్నిముఖా
ధోముఖోర్ధ్వముఖాదిఘోరతపంబు సేయుచు. ౨౯౭

ఉ॥ ఆతపభీతి నీడలు రయంబున వ్రాఁకులక్రిందు దూఱెనో
యాతరులుం దృషాభిహతులై తమనీడలు దారఁ ద్రాఁగెనో
భాతి ననంగ నీడ లురుపాదపమూలములం దడంగె గ్రీ
ష్మాతతమధ్యవాసరములందుఁ జలింపక యుండు నెండలన్. ౨౯౮

మ॥ పరితాపోగ్రనిదాఘవేళ శిలపైఁ బంచాగ్నిమధ్యంబునన్
బరమధ్యానసమేతయై నిలిచి విభ్రాజిల్లె నుద్యత్తప
శ్చరణాలంకృత శైలనందన గనత్సంధ్యారుణాంభోధరో
త్కరమధ్యస్థిరకాంతకాంతియుతశీతజ్యోతిలేఖాకృతిన్. ౨౯౯

క॥ ఘటఘటఁ జేలుచు నలుగడఁ। బటుతరశిఖిశిఖలు నెగయఁ బదిలముగా నుం
గుటము ధర నూఁది నుస్థితిఁ। గుటిలాలకవదన మెత్తికొని రవిఁ జూచున్

క॥ ఖరకరకరహతి ముఖసరసిరుహము కడు వంధి కాంతిసెడ నయనేందీ
వరము లలరె గిరిజతప। స్స్థిరశక్తిని బగలు రేయి చేసెనొ యనఁగాన్. ౩౦౧

వ॥ అట్టితపంబునందునుం బరమేశ్వరుండు ప్రసన్నుఁడుగామికి నగజతపః క్లేశంబు
పరమేశున కైయిద నేరమికి నుద్వేగించుచు. ౩౦౨

చ॥ ఇనుము రసంబులో నుడుగ కెప్పుడు నూనినఁగాని కాదె కాం
చన మమరాద్రి నాయసము సంతతమున్ వసియించికాని దైవ
కనకము గాదు గాదు చిరకాలసుసేవనఁగాని కాదె స
న్మనమున [illegible] [illegible] [illegible] [illegible] కీర్తనా. ౩౦౩

చ॥ కరము విచారి తద్దయు వికారి మనంబది సాత్రి వోలె నే
గిరిగొనఁ గాని నిల్వ దెడ దీనిచలత్వము మాని నీ పదాం
బురుహములందు సంస్మరణఁ బొందు దయన్ సురబృందవంద్య సు
స్థిరముగ నిల్పు తత్త్వవిధిఁ దెల్పు సమస్థితి సల్పు శంకరా. ౭౦౪

వ॥ అనుచుం బరమేశ్వరధ్యానలీనమానమానసయై దేహంబు నిరంతరతపఃక్లేశం
బునం జర్మాస్థిమయంబై కాష్ఠప్రాయంబై నెయ్యిబెయుం దపోనిష్ఠ విడువ కనుష్ఠించుచు. ౭౦౫

క॥ అద్రిగొనక శైలకన్యక । హరు మనమున గౌరి చేయునత్తపమున క
చ్చెరు వందిభువనముల నిద్రయరు దని ముత్తెంపుసేస లలికిరి విబుధుల్.

వ॥ తదవసరంబున. ౭౦౬

మ॥ చిరసద్బ్రహ్మతపోధనావలితపస్తేజంబులుం బేర్మితోఁ
దిరమై పొల్పగు దేవతాపసతపస్తేజంబులుం గౌరిసు
స్థిరభావోగ్రతపోగ్రతేజమున నిస్తేజంబులై యుండె న
త్యురుచండాంశుకరప్రభాప్రతిహతద్యోతిప్రభాభాసమై. ౭౦౮

వ॥ మఱియును. ౭౦౯

క॥ ధర గంపించె నిశాకర। ఖరకరగతు లెడలెఁ దారకంబులు డుల్లెన్
గిరు లుర్రిలె శరధు లింకెం। బరమేష్ఠి చలించె నమరపతి మది నులికెన్. ౭౧౦

క॥ ఉరగపతి విషము గ్రక్కెను। హరి చిత్తమునందు వందె నగతనయ తపో
భరమున ధారుణి దాల్పఁగ। భరమై కమఠంబు డిందువడి కడు నడఁగెన్. ౭౧౧

క॥ వనరాసు లేడు సుప్పరి। పెనమున నీరులునుబోలెఁ బెల్లున నుడిగెన్
గనకాద్రి క్రోవిలోఁ బల్లి। కనకంబునుబోలె నీరుగాఁ గరఁగె వడిన్. ౭౧౨

క॥ తారకము లెల్ల రుచిరాం। గారంబులకరణి వెలిఁగెఁ గమ్రాంశిత మో
హారులు గ్రాఁగినరజతమ। హారజతాదర్శనంబు లనఁ దనరె రేడ్కెన్. ౭౧౩

---

౭౦౩ తెలంచుడు = తలంచుట :—

క॥ పొందిక నగజాతపఙ్క్తిపతి । మూఁడుజగంబులను దీవ్రముగఁ బర్విన బ్ర
హ్మాండము గాఁచిన కాంచన । భాండమ్ము క్రియఁ దాల్చెఁ దత్ప్రభాజాలమ్మై.

క॥ గిరిసుతశశాంకప్రభాళికిఁ । దరతరమ బలించి రజతధరణీధర ము
చ్చెరువుగఁ జిల్కినఁ దిరిగెం । బురహరుతోఁ గూడ వెండిబొమ్మరము క్రియన్.

వ॥ అంత నటచని కృతాంతాంతకుండు కంతులతాంతాస్త్రవిహతాంతరంగుండై కాంతావియోగంబునం జరుపిల్లుచు. ౮౧౮

సీ॥ హిమవంతుఁ డింతి నా కిచ్చెఁ దెలిసియు నామాట లేనేల యాడనైతి
నతఁ డొండు వానోడి యతివ నాకడ నుంచి యేఁగినక న్నేల యెఱుఁగనైతి
నాబాల ననుఁ గూడ వాసించుచున్నచో మిన్నక తప మేల పన్నికొంటి
నెలనాగ నామీఁద నెలయింప వచ్చిన భావజుతో నేల పగయుఁగొంటిఁ
దరుణివలరసంబు దఱిమి పైఁబడ నున్న నెల్లి సెలింగి కూడనేర కేల
వేలనైతి ననుచు బాలేందుధరుఁ డాత్మచింత విడిచి విరహచింతఁ దగిలె. ()

---

౮౧౬. మూఁడుశబ్దమున నర్ధబిందువు రామాయణమునందుఁ దక్క భారతాదులయందు లేదనియు బహువచనరూపము 'మూళ్ళు' అగుటచే నర్ధబిందువు పొసఁగదనియు శబ్దరత్నాకరమునఁ జెప్పఁబడినది. భారతమున మూఁడుశబ్దమున నర్ధబిందువు లేని ప్రయోగము గలదా? మూళ్ళనుటకుం బ్రామాణికప్రయోగములు గలవా? మాఁడుఁడు :—"మూఁడక్షౌహిణు... । పోఁడిమి... । వేఁడిమి... । వాఁడిమను... అధిపా." భార. కర్ణ-ఆ-౨. "వాఁడిమయూ... । వేఁడిమి... । మూఁడ స్త్రంబు ...బోఁడిమి..." ఆంధ్రభాషాభూషణము. "వాఁడిశరములు నకులుమై మూఁడు నాటి భార-శల్య-ఆ. ౧. "వాఁడిమి ... । మూఁడు... । వాఁడు... । పోఁడిమి..." జై-ఆ-౫-౧౯. "మూఁడులోకములును వాఁడిమఁగంటిమి" భార-అను-౧. "వాఁడి నారసములు మూఁడుకర్ణునిరొమ్ము" భార-ద్రోణ-ఆ-౪. "వాండిమి నల్ల సిద్ధజనవల్లభుఁ డోర్చిన రాజు భీరుఁడై । యాంధ్రను గానకుండ వృషభాంకముఁ బెట్టి కొనంగఁ జూచితో । వేండికొ యేమి నీవనుచు నెచ్చెలు లెల్ల హసింపనంతలో । మూండవకంటితో నిదొరమూర్తి వహించిన ప్రొక్కి రంగనల్" భీమకవిప్రణీతనృసింహపురాణము. ఆ-౨. మఱియు ద్రవిడమున "మూంద్రు" అనుశబ్దములోని పూర్ణబిందు వాంధ్రమున నరసున్నగా వాడఁబడును. సబిందుకనిర్బిందుకప్రాస మంగీకరించిన ముద్దరాజురామన కవిలోకసంజీవనిలో, "అర్ధబిందువునిర్బిందు వగుపదములఁ బ్రాసముగ దీర్ఘములమీఁదఁ బలుకజెల్లు । మూఁడుమార్తాండమూర్తులు కూడెనపుడ । సోఁకు మూకలనడఁచు నైత్యాకుఁడనఁగ." "మూఁడుభువనములం గూడిరగణము ముట్టకొనఁ గరిబృంహితం బాఁడుఁదనమునిజార్థమునఁగల యద్రిశయయలిదిక్కులన్" అథర్వణ ంద ము-ఆ-౨.

మ॥ బోమ లల్లార్చుచు లోచనద్యుతులఁ బైఁ బూరించుచున్ మందహా
సమరీచుల్ దళుకొత్తఁ బల్కనొలపుల్ సంధించుచున్ లోలభా
వము సూచించుచు నీశ్రమోల నెలమిన్ వర్తింపఁజొచ్చెన్ మనో
రమణం బార్వతిరూపవిభ్రమ ఘమహోరాత్రంబు సాన్నిధ్యమై. ౮౨౦

చ॥ హరునకుఁ జూడఁగా మహిఁ జరాచరరూపము లెల్ల సమ్మతిన్
గిరిసుతరూపమై విరతఖేదముఁ జెప్పఁ దొడంగె నట్లకా
కరయఁగ నాదిశక్తి సచరాచరరూపమ కావునన్ మహా
పురుషులకన్న కాన్కి యనపోహమ కావు డిదేమి చోద్యమో. ౮౨౧

వ॥ తదవసరంబున. ౮౨౨

సీ॥ ఉరుకపద్మారుణతరదీప్త లనుమృదునవసహకారపల్లవవిభాతి
నీలకంఠప్రభాజాలంబు లనుసమదాలోలరోలంబమాలికలును
బాండురాంగారులజహాళదీధితు లనుపూర్ణచంద్రాతపాకీర్ణరుచులు
గంగాంబుశీకరోత్కరతాహినిశ్వాసములమందపవనంబుఁ బొందుచేసి
కాముఁ జంపినపగదీర్పఁ గడఁగి నూత్న । భావమునఁ జొచ్చిచిత్తతాపావహంబు
లయ్యెనుర్వీ నాఁగ శిపుఁడంగజాపహారి । యయ్యె విరహాగ్నిఁబడి వేఁగునలసిపాలసి.

మ॥ అలిధమ్మిల్ల మృణాళహస్తఁ గమనీయావర్తనాభిన్ మహో
త్పలగంధిం గలహంసయాన విలసద్బంధూకరక్తోష్ఠ ను
త్పలనేత్రిం గమలాస్య నంగజరసాంభఃపూరఁ దత్పార్వతీ
జలజావాసముఁ జొచ్చి యాడక మనోజాతానలం బాయునే. ౮౨౪

ఉ॥ అత్తనుమధ్యరూపు గడునందముగాఁ గుసుమాయుధుండు న
చిత్తమునందు రేఖగొని చిత్రమువ్రాసెను పోలుపొంద న
చ్చొత్తెనొ నేర్పునం గలయనూన్చెను గా కిది తన్మనోభవో
న్మత్తవికారమో మదనుమాయయొ నిక్కవమో తలంపఁగాన్. ౮౨౫

వ॥ అని యనేకప్రకారంబులం ద్రిలోచనుండు రణరణకవ్యథాకులితహృదయుం
డగుచు నుండె నంత నగజతపఃప్రభావం బీశాను బలాత్కారంబున నాకర్షింపం
దొడంగిన, ౮౨౬.

చ॥ గుణగణరత్నభూషణుఁ డకుత్సితచిత్తుఁడు పూర్ణచంద్రభూ
షణపదపంకజాతమదషట్పదుఁ డాశ్రితసజ్జనార్యపా

షణ్ముఁ డమితాభవాగమవిశారదుఁ డీడితసన్మునీశ్వరా
గ్రణి శుభమూర్తి సజ్జనశిఖామణి ధీమణి విశ్వసంస్తుతిన్. ౮-౨౭

క॥ సంయమనుచరిత్రుఁడు వా। క్సంయమసువ్రతరతుండు చౌషష్టికళా
సంయుతుఁ డనఘుఁడు గాంతా। సంయోగవియోగభోగసంత్యక్తుఁ డిలన్.

చ॥ గతమదమత్సరుండు జితకామలతాంతశిలీముఖవ్రజా
హతపరితాపచేతసుఁ డసూమితకంటకబంధుభూరుహా
యుతనిబిడాజవంజవమహావిపినానలుఁ డింద్రియేభసం
హతిమదవర్ధనోగ్రనఖరాయుధుఁ డాత్మవిదుండు సద్విధిన్. ౮-౨౯

క॥ సూరిజనస్తుతకీర్తి। శ్రీరమణీరమణుఁ డమలచేతస్కుఁడు వా
ణీరుచిరాననతిలకుఁ డ। పారగుణార్ణవుఁడు సుజనబాంధవుఁ డెలమిన్. ()

లలితగతి॥ కమలదళనేత్రుఁ డవికారుఁడు సుధీసం
డమితశివతత్త్వవిదుఁడార్యుఁ డతివర్యుం
డమలినచరిత్రుఁ డమలాత్ముఁడు మహాత్ముం
డమరగురుభాతిమతి యార్యనుతుఁ డెందున్. ౮-౩౧

గద్యము॥ ఇది శ్రీమజ్జంగమమల్లికార్జునదేవదివ్యశ్రీపాదపంకజభ్రమరాయమాణకవిరాజశిఖామణి నన్నెచోడదేవప్రణీతం బైన కుమారసంభవం బను కథయందు షష్ఠాశ్వాసము.

౮-౨౮. ఉపమానోపమేయ విపర్యయమును విశేషణవిశేష్యలింగభేదమును దోషములుగా గ్రహించి వానిం దొలంగింపననిక్కాంబోలును తెన్నాలిరామలింగ కవి ...సకందర్పకేతువిలాసములో నిట్లుమార్చి పద్యమును గూర్చుకొనెను :— "లలితా। స్యాంబురుహంబు నీలకచరోలంబంబు నేత్రాసితో। త్పలముచ్చైః స్తనకోకమోస్తవి ...సప్పంభూక ముష్యత్కుటీ। పులినం బుద్గతచిత్తజాతరసవాఃపూరంబు ప్రాణేశ్వరీ। జలజావాసము సొచ్చియాడక మనోజాతానలం బాఱునే."



శ్రీ

# కుమారసంభవము.

## సప్తమాశ్వాసము.

---

శ్రీశ్రితవక్షుఁడు ముక్తి। శ్రీశ్రితసహజావదాతిచిత్తుఁడు వాణీ
శ్రీశ్రితసుముఖుఁడు గీర్త్తి। శ్రీశ్రితదిఙ్ముఖుఁడు శేముషీనిధి పేర్మిన్. ౧౩౨

వ॥ పరమేశ్వరుండు నిజమనోరథంబు సిద్ధిఁబొందం బార్వతికిం బ్రత్యక్షంబు గాఁ దలంచి తదీయాంతర్గతం శారయ వేఁడి నిజరూపంబు చూపనొల్లక యాక్షణంబ.

సీ॥ మెఱుఁగుఁ దీఁగెలతోడిమేఘంబు నా జన్నిదములతోఁ గృష్ణాజినము ధరించి
మకరధ్వజముతోడిమరుపచ్చవిల్లు నా గోచితో మొదుగుఁగోల వట్టి
చంద్రికతోడితుషారపుంజంబు నాఁ దనుకాంతితో భూతిధామ మెసఁగ
వీణారవముతోడివేదనాదంబు నా రాగమ్ముతోడ శివాగమములు
సదువుచును బ్రహ్మవర్చస్సపదవితోడి దివ్యతేజంబు మొగమునఁ దేజరిల్ల
సుందరాకార మమర బాలేందుధరుఁడు। దాల్చిచనుదెంచె గిరిరాజతనయకడకు.

వ॥ ఇట్లినబింబంబు మహీతలంబున కవతరించినభంగిం దేజోమూర్తియై చనుదెంచు నభినవమునికుమారుం గని నగజ ససంభ్రమంబున నతిథి మాహేశ్వరస్వరూపంబ యని తాత్పర్యభక్తియుక్తి నభ్యుత్థానాభిగమనపూర్వకంబుగా. ౧౩౫

స్వా॥ ఆగిరీంద్రసుత హర్షముతో నై। వాగమోదితవిధాయితితో సు
స్వాగతాభిమతవాక్యములంద। భ్యాగతోచితసపర్యలఁ దన్పెన్. ౧౩౬

వ॥ ఇట్లు కృతకమునికుమారుండు సద్విధి నభ్యర్చితుండై గిరిజరూపసౌందర్యవిభ్రమవిలాసంబులు గనుంగొని మెచ్చి నిజాంతర్గతంబున. ౧౩౭

సీ॥ భూతి పూసిన నింత వొడమెడుఁ దనుకాంతితొడుప నెంతటిమెఱుంగడరియున్నొ
వంది కందిన నింత వఱలెడు ముఖరోచు లెలమ్మిన యెంత సల్లలిత మగునొ
పాలయింపకయు నింత వెలిఁగెడుఁ జూడ్కు లర్మార్చిన నెంతరమ్యంబు లగునొ
జడలు గట్టియు నింత సక్కనై నది వేణి దీర్చిన నెఱు లెంతద్రేణి యగునొ

యీడ విడిచినమీఁదీగె యింతనయము। గల్గిదియున్నది వార్ధికగలిగెనేని
నెంతనవకమై యుండునో యింతి కనుచు। శివుఁడు గిరిరాజసుత విశేషించె నర్థి

కసమ॥ ఈరమణి బాలగడు నేచినమహాకాం। తారములలోన నతిదారుణముగా నీ
ఘోరతపమిప్పటనుగో లెవిరచింపఁగ।గారణ మదేమియొకొ కౌతుకము నూఁదగ

మా॥ ఆననలీల సుధాకరబింబము నంబురుహంబులచె ల్వగుటఁగ
వేనలిఁ గృష్ణభుజంగకలాపిసవిస్తరభాసురమై చనుటం
దా నతిబాలిక యయ్యుఁ దపం బుచితస్థితిఁ జేయుచు నుండుట నీ
మానినిరూపచరిత్ర లుదారసమంబు బగుచున్నవి చిత్రగతిఁగ. ౨౪౦

వ॥ ఈసుందరాంగి యెవ్వరినందనయో యనుచు సంశయాకులితహృదయుం డగుచున్న
మునికుమారుం జతురిక గనుంగొని ౨౪౧

గీ॥ హిమనగాధీశ్వరునకు నుత్తమచరిత్ర। మేనకకుఁ బుత్రి పార్వతి మెలఁతపేరు
వెలయు మైనాకభూధరుచెలియ లమల। కమలదళనేత్ర వరకన్య కాలలామ. ౨౪౨

వ॥ అనిన నాశ్చర్యహృదయుండగుచు నగజ కభిముఖుండై. ౨౪౩

చ॥ పరమకపర్దసంగమునఁ బావన మైనసురాపగాంబువుల్
శిరమున దాల్చి మునుదల్లు ప్రసిద్ధియు సిద్ధియుఁ గన్నకంటె నీ
పరమతపఃప్రభావమునఁ బర్వతవల్లభుఁ డిప్పు డెంతయుఁగ
నిరుపమకీర్తిమైఁ దనరి నిర్మలుఁ డయ్యె జగంబులోపలఁగ. ౨౪౪

వ॥ అని వెండియు నిట్లనియె. ౨౪౫

సీ॥ స్వర్గార్థి యందమే స్వర్గంబు దమహిమగిరిచరులం దాకకెలన నుండు
నర్థార్థి యందమే నర్థేశుకంటెనుఁ దనపుట్టినింటనె ధనముగలదు
పురుషార్థి యందమే పురుషులు దనుఁ గోరి తప మ్మిఁక జేయంగఁ దగినరూపు
మోక్షార్థి యందమే ముగ్ధ దా మోక్షంబు దలపంగ నేనియుఁ దలఁపఁగాదు
ముఖవికాసంబు చూడ నీముదితవలనఁ। గామభోగాభిలాషయ కలిగినదియ
దీని తగిలించి తగులక తాన ధైర్యవంతుఁడై యున్నసాబగుఁ డెవ్వండొ జగతి.

---

౨౩౭. అల్లార్చు=పొలపములు గలుగఁజేయు. ‘‘అలరెడురెప్ప లల్లార్చిన
యందాఁక యనిమిషకన్య గాదనఁగవశమె। యమృతంబు సిలుక మాటాడినయందాఁకఁ
నకంపుఁ బ్రతిమ గాదనఁగ వశమె...ఉవిదసఖిమీఁద వెడ్రాలియున్నదాఁక నొనరు
పొలుకారుమెఱపు గాదనఁగ వశమె.’’ ఎఱ్ఱాప్రెగ్గడ కుమారనైషధము.

వ ॥ అనిన మునికుమారుపరేంగితజ్ఞతకు మెచ్చి వీఁడు సామాన్యపురుషుండు గాఁడు
నిజప్రకారం బెఱింగింపవలయు నని చతురిక కృతకబ్రహ్మచారిం గనుంగొని.

మ ॥ హరినేత్రాంబుజ మంఘ్రిపీఠ మజుమస్తాబ్జంబు సత్కేళిపం
కరుహం బాసితరోచి జూటలతికాకల్పంబు విశ్వంభరా
ధరవంశేశులు కర్ణకుండలము లుద్యద్దేవతానీకముల్
పరివారంబుగ నున్నశంభుఁ దనకుం బ్రాణేశుగాఁ బ్రీతితోన్. ౮౪౮

వ ॥ సన్నసంబునం గౌరి ఘోరతపంబు సేయుచు. ౮౪౯

సీ ॥ ఈనీరజానన దాన కుదురుచేసి వలనుబీజము లెల్ల మొలవఁబెట్టె
నిచ్చలు నిష్ఠతో నీరులువోయంగ నెలమితో నన్నియుఁ గలయమొలచి
పెరిగి నానావిధతరులతాగుల్మదు లైచె నయంబునఁ బూచికాచి
ఫల మందె నేనియు మొలకయు మొలవ దీచెలువతపఃఫలసిద్ధివలన
నింక నెన్నండు దయఁబరమేశ్వరుండు। గన్నదెఱచునో యని తన కున్నరూపు
నెఱియఁ జెప్పినవిని కేలుచఱచికొనుచు। నల్లిమపాఱుండుప్రక్కలువిఱుగనగుచు.

శా. ఎట్టెట్టా శివుఁ గట్టె నంటి నీఁక మాయిూతన్వి దన్ గల్వఁగా
నట్టుల్ మెచ్చకయున్న వేతపము సేయుంజూచ్చె నన్నాతఁడే
ముట్టుం బోలినవానిగాఁ దలఁచియే మోహించి దేశంబులోఁ
బుట్టం బట్టులు మాలెనే నగజ యాభూతేశ్వరుం గల్వఁగాన్. ౮౫౧

చ ॥ పగవఁగ నద్రిరాజు హిమవంతుఁడు దండ్రి సురాంగనాలికిన్
మిగిలినపేర్మిమైఁ దనరుమేనక దల్లి సురూపసంపదన్
జగములలోన మే లనఁగఁ జాలినపార్వతి నీవు భిక్షుకుం
దగిలి తపంబు సేసెదఁటె దైన్యము సేసెదమీననింతకున్. ౮౫౨

---

౮౪౮. "కమలజుతోరపుంబునుక కంచము పాదసరోరుహార్చనా। కమలము వారిజోదరునికన్ను కరంబు నకాదిభోగిభో। గము రవణంబు చంద్రుఁడు శిఖాకుసుమంబఁటె యెవ్వరీ డుమా। రమణునకుం గుమారగిరిరాజనివాసున కన్యదైవముల్." రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణము.

౮౫౧. పగవఁగ = ఆలోచింపఁగా. "తగునిది తగదని యెదలో వగవక," భార. ఆది "వగవ మనుష్యమాత్రమునవానికి." దశకు. ఆ-౩.

సీ॥ వారిరుహానన నీరూపు గనుగొన్న నలకూబరుండైనఁ గల్గిచివచ్చుఁ
బాలంతి నీభోగోపభోగముల్ చూచి జంభారాతియైననుఁ గోరివచ్చుఁ
. గోమలి నీకళాకుశలత విని శతదళసంభవుండైనఁ దగిలివచ్చు
లలితాంగి నీశుభలక్షణోన్నతి చూచి పురుషోత్తముండైన మరిగివచ్చు
నిన్నుఁ గోరి తపంబులు నిష్ఠ నొరులు సేయఁగోరుచోఁ దప మీవు సేసె దమల
రత్నములఁ గోరి విని జనుల్ రాక జనుల రత్నములు గోరి వైవడిరాకఁబోలు.

చ॥ జనులు విరుద్ధవేషి యగుశంకరు నేలకొ యందురొండెఁ బా
వనతరుఁ డంచుఁ జిత్తముల వందఁగ దానిపయిం ద్రిలోకశో
భన వగునీవు నాతపసిపాల్పడి మిక్కిలి వంతచేసెదో
యని యనిశంబుఁ దద్దయు భయంపడుచున్నది లోక మింతయున్. ౨౫౪

సీ॥ పుడమియై కదలక పడియుండు నెల్లచో నెఱిలేక నీరయై నెఱసియుండు
ననలుఁడై డాసినఁ గొనికాలుచుండు వాతూలుఁడై కనుకనిఁ దూలుచుండు
నాకాశమై చూడలేకుండు బ్రాలేయధాముఁడై పెరుగుచుఁ దఱుగుచుండు
భానుఁడై మిన్నులపైఁ బాఱుచుండు మహాత్ముఁ డయ్యును బాడవడఁగి యుండు
నిన్నిరూపులందు నేరూపు నిజముగా నెఱుఁగవచ్చు వీనికెల్ల నొక్క
రూపు నేయనెవ్వరోపుదు రట్టిమాయావి నీకుఁ దగుల నగునె చెలి. ౨౫౫

చ॥ సకలకళాధరుండు జలజప్రభవుండు విరించి యుండఁ బా
యక సిరిఁదక్క నేలినమురాంతకుఁ డుండ సమస్తదేవతా
ప్రకరము గొల్వ నున్నసురపాలకుఁ డుండఁగ నిట్టిమూర్ఖు భి
క్షుకు నపదార్థు నేమిగతిఁ గోరితి శంకరుఁ బంకజాననా. ౨౫౬

వ॥ అని యనేకప్రకారంబులం బరమేశ్వరు నిరాకరించుచు నితరసురవరుల విశే
షించు చున్నకృతకవిప్రు నగజ కటాక్షించుచు. ౨౫౭

సీ॥ బ్రహ్మాండనికరంబు పరమేశుజలమూర్తి నుదయించునల్పబుద్బుదము లనఁగ
భాసురస్థూలరూపమునందుఁ బరమాణుసమితి నా రోమకూపముల నుండుఁ
గాలాగ్నితనుమహాజ్వాలాభిహతిఁ దూలుఁ గలగొనివిస్ఫులింగమ్ములనఁగ
నట్టిబ్రహ్మాండంబునం దొక్కబ్రహ్మాండకుహరైకవాసులై కుత్సితాత్ము
లనఁగ వర్తించుహరికమలాసనామ రేశ్వరాదులఁ దెచ్చి సర్వేశుతోడ
నెన్నిసాటుల పెట్టఁగా నెన్నెదీవు జడుండ వై తెట్లు బ్రాహ్మణజాతిఁ బుట్టి.

ఉ॥ గంధగజాసురాదిఁ బురకాయజకాలబలప్రహారి ను
గ్రాంధకహారిఁ దీవ్రగరళాయతవహ్నివిహారి దేవతా
సింధుజలౌఘధారి సురసిద్ధమునీంద్రగణోపకారి ను
ద్బంధవిచారి నోఁబలుక బ్రాహ్మణ నీ వధికారివే మహిన్. ౮౫౯

చ॥ హరుఁ జెడనాడి ముందల్లు కృతాంతకుకన్నది యేమి నీలకం
ధరు నుఱు కెగ్గులాడి మఱి దక్షునికన్నది యేమి విశ్వసం
హరుపయి నెత్తిపోయి విషమాయుధుకన్నది యేమి పూర్వభా
కరగతి సూచి చూచి పురఘస్మరుఁ బల్కుట నీకు బుద్ధియే. ౮౬౦

వ॥ అదియునుం గాక. ౮౬౧

చ॥ నిటలతటప్రచండతరనేత్రసముద్గతతీవ్రపావకో
త్కటశిఖలం బురాంగభవకాలహరం బగు పేమి పెద్ద ధూ
ర్జటి నెప మగ్గి చూచిన నజప్రకరాండసహస్రకోటు లొ
క్కట కమరున్ మహాసలము గప్పినఁ దూలకణాలిపోలెనే. ౮౬౨

వ॥ నీ వెంతవాఁడ వఖిలభువనభవనాధీశ్వరుం డైనపరమేశ్వరు దూషింప నచుచున్న
గిరిజపలుకులు విని కృతకమునికుమారుం డుపహసించుచు. ౮౬౩

చ॥ తగ్గర్గము వాఁడిచేసి వెడతాపసి నాకడ బీరగాఁడుగాఁ
బొగడెదు నీవు మా కలుగఁబోయెదు లోకమువారు భిక్షుకున్
నగసుత గల్చిపోయె నని నవ్వుదు రాతఁడు నీకుఁ గల్గఁగాఁ
దగదని బుద్ధిసెప్పు డిది దప్పె వరానన నీకుఁ జూడఁగాన్. ౮౬౪

ఉ॥ నేరక కల్చి భిక్షుకుని నీ వొకపెద్దగఁ జేసె దింత జం
భారియె భోగసంపదఁ గృతాంతకుఁడే పటువిక్రమంబునన్
వారిధివల్లభుండె విభవంబున నాధనదుండె భూరివి
త్తోరుసమృద్ధి నీచెనఁటి యూపఁర లేఁటికి నాడె దెన్నియున్. ౮౬౫

వ॥ మఱి యట్లుంగాక.

సీ॥ మగ లాఁడువారికి మరిగి ప్రుచ్చిలి బందివట్టి కన్నంబులు వెట్టి తెరువు
ద్రెకొట్టని చని పరదేశంబు లుడుగక ద్రిమ్మరి వ్రేళ్ళను రొమ్ముఁ బోయి
యాచకులై వేఁడి నీచుల సేవించి కలమెక్కి చని యాలఁ గయ్యమాడి

యేనుంగునకుఁ బాడి యిక్షైన్నియేనియుఁ గష్టముల్ పడి రాకగలదు గాక
మగలఁ గోరి తొల్లి మగువలు తపములు సేసి సవని రనిన చెట్టలెందుఁ
గలవె దీని కచ్చు నిలిపితి నీవనివలన సతులఁ బురుల్లు వాలిసెఁగాక ౮౬౭

క ॥ వసుధాధరేంద్రసుత నీ। వసదృశముగ శివునిఁగూడి యాడుట యాడుం
బనిమియు సమానశీల। వ్యసనేషు సుసఖ్య మనినవచనము వినవే. ౮౬౮

సీ ॥ ఎమ్ములు దొడవు లన్నింటియు కా దండుఁ బెనుబాము లెడనెడఁ బెనఁగియుండు.
వా దేమి మెయిపూఁత బూది యన్నింటియు కా దది యెలుకలబూది నెఱయు
నశనంబు భిక్షాన్న మనుటయు కా దందుఁ గూడఁబోసినపులికూడు మఱియు
నేకాకియై యుండు నింతియు కాదు ప్రేతావాసముల నుండు ననుదినంబు
చూడ విరసమై నగ్నంబుతోడ నుండు।నదియుఁగా కిరుసంజల నాడుమరులు
గొలిగఁ గల్లుపుగా కాతనిఁ గోరి తపముఁ సేసె దట గౌరి నీవెంతచెల్లుపురులా.

క ॥ తొడవులు చివికినయెమ్ములు। గుడిచుట్టు గపాల మిల్లు గుడిముడి యె ద్దె
క్కుడు గట్టువలువ దో లగు।బడరునకై నవయ నేమిప్రళయము వచ్చెఁ. ౮౭౦

సీ ॥ మణిభూషణప్రభామంజరు లెలమించి తనువల్లికకు వసంతంబుసేయు
సమదాంచితాంగవిభ్రమములు వెలయించి శృంగారలక్ష్మికిఁ జెన్నుసేయు
గాముకజనుల వీక్షణమాత్ర నెఱిఁగించి సౌభాగ్యవాము కుత్సవము సేయు
గోరిక రతికళాకుశలత ప్రకటించి దర్పకు రాజ్యపదస్థుఁ జేయు
సారసంసార మెల్ల నిస్సార మేల।చేయనెత్తెదు వలదు నాచెప్పు సేయు
తరుణి నిను వేఁడికొని కాంతఁ దపము సేయు। నగ్ని సేయుదు మొండేమియైనఁజేయు.
౮౭౧

౮౬౭. బలుకులు = స్మశానములో శవమునకుఁ బేర్చినచితులు "పొయిదల
నిదిం డొలికిబూడిదె కుండులబంతి" దశ. ఆ. ౫. దశకుమారచరిత్ర ముద్రితప్రతు
లోఁ బొరపాటునఁ పొయిదలనీలిదిటొ్కలిపి" యని పడియున్నది. దానిని సవరిం
సు కొందురుగాక.

౮౭౦ ఎలఁబోఱ లేక లేఁబోఱ = పల్లవము. "పూపుసెజ్జలను లేఁబోఱల
చోపులు వెరవుపాటించి గావించువారు." దశకు. ఆ-౩-౧౨౮. మఱియు
లేఁబోఱలసోయగంబును। వేఁబోకలవిచ్చుతమ్మివిరిచెలువంబుఁ।లోఁబడఁ గొని
సేసినక్రియ। బూఁగోడికెఁబోలుఁజరణములు మృదులములై." సూరనయుదయ నో
యము. ఆ-౪-౬౫౭.

వ ॥ ఎలఁబ్రాయమావోనిమీన వవరుంచియు రాగరసంబునిండుఁగుం
డలా యనువీఁగుఁజన్నులబెడం గెడలించియు మారుపువ్వుఁదూ
పుల నగులోలదృగ్రుచులపోహము ఫుచ్చియు భోగవృద్ధి ని
ష్ఫలముగఁ జేసియుం దుదిఁ దపంబున నయ్యెడి దేమి సెప్పుమా. ౮౨౨

వ ॥ అని యనేకప్రకారంబుల భేదించుచున్నతన్నుఁ దృణీకరించి యదత్తప్రతి
వచనయైయున్న గౌరి నాక్షేపించుచు. ౮౨౩

క ॥ పులిగూడు దిండి గొఱ్ఱెగం। గలిచియు నోచెల్ల యింతె గల్పిలచెదు శ్రీ
గలవానిఁ దగినపురుషుం।గల్గిచిన నీకన్నదోయిఁ గను డరు దనుమా ౮౨౪

వ ॥ అని వాయోడక నెల్ల నంటం బలికి పెక్కుదెఱంగుల నీశు దూషించుచుఁ దన్ను
వికారదృష్టిం గనుంగొని సాభిలాషోక్తులు ప్రకటించు చున్నకృతకవిప్రు నగజ
కటాక్షించి. ౮౨౫

క ॥ ఏలాగుచ్చేగి మెచ్చక।తూలముగాఁ బలికి కడవ దూషించెదు నీ
ప్రేలరితన మంగజహరు।ఫాలాంబకవహ్నిపాలుపడ కుడుగ దెడక. ౮౨౬

వ ॥ అని కోపించి నెచ్చెలియుందలంచి తపోభంగభీతిం దన్నుఁ దాన సంతరించుకొను
చున్న నగజం గని సఖులు కపటవటకృతానేకవిఘ్నపరంపరకు గౌరినిశ్చలతపో
భారంబునకు విస్మితు లగుచు. ౮౨౭

చ ॥ అలఁచి విపత్ప్రయోగత మహాత్ముల ధైర్య మడంపఁజూతు నీ
యలవియ ధాత్రి బేలవిధి యాఱడికాఱియ దక్కుమమ్మహా
ప్రళయము వచ్చినం దలరి పాడరి క్రాఁగఁగరాని ధైర్య మీ
కులగిరులే పయోనిధులె కుంభినియే నభమే యజాండమే. ౮౨౮

వ ॥ అనుచుం గృతకవిప్రు నందఱు నాక్షేపించి. ౮౨౯

క ॥ తఱుచ్చంటి దన్ను నెదిరిని। నెఱుఁగఁడు దనకొల్దిపుడుక లేరఁదు మొండీఁ
డఱజాలి ప్రమక్కుమన్నం।గోఱ డెక్కుడ నిట్టిప్రేలుగొండులుఁ గలరే. ౮౩౦

---

౮౨౭ సంతరించుకొను = ఊఱడఁగొను. ,,అంతరంగంబుకొంతి సంతరించుకొని
యతండు నారాయణున కిట్లనియె." ఉ-హరి. అ-౪-౯౦.
౮౩౦ అఱజాలి = మూర్ఖుఁడు, ,,సత్యనిరూఢి దొఱఁగియుండియు।జనదని
మాన్ప లేనియఱజాలికి శోకము నేఁడు పెద్దయే. భోజ-అ-౬. ”

వ॥ అనుచు గిరినందన కెడసొచ్చి ముని నందనుం గనుంగొని. ౮౮౧

సీ॥ సురవిరోధుల నోర్చి సురసేనసెల్లఁ జేకొని కావ నోపెడుకొడుకుఁ బడయ
సురరాజు మొదలుగా సురలెల్లఁ గొలువఁ జేరోలగంబునఁ గొలు వుండఁ జేర్మి
శ్రీవాక్శచీసురసిద్ధవిద్యాధరదనుజాంగనల వర్యుఁబనులు గొనఁగఁ
బద్మసంభవుశిరఃపద్మంబు సత్కేళిపద్మంబుగాఁ గేలఁ బట్టియాడఁ ౮౮౨
బుండరీకాక్షులోచనపుండరీకమంఘ్రిపీఠంబుగా మీఁద నడుగు సాఁప
నభవుదేహార్ధ మురువడి నాక్రమించికొనఁగఁజువ్వెయీ తప మెత్తికొనియె నగజ.

శా॥ నీయజ్ఞానత నీకు విశ్వజనకుం నిందించె దీ విస్మహో
మాయం జండిక నాదిమూర్తిఁ ద్రిజగన్మాతన్ మదాంధుండవై
డాయంజూచెదు పాపకర్మ నిను జూడంగూడునే కేవల
స్త్రీయే పార్వతి నన్యధామతిగఁ దాఁ జింతింప నీప్రాప్తియే. ౮౮౩

సీ॥ జ్ఞానస్వరూపమై సర్వాత్ముఁ డున్నఁ దాఁ జ్ఞేయస్వరూపమై నెఱనియుండుఁ
బురుషస్వరూపమై పరమేశుఁ డున్నఁ దాఁ బ్రకృతిస్వరూపమై పరఁగుచుండు
సూక్ష్మస్వరూపమై శుద్ధాత్ముఁ డున్నఁ దా స్థూలస్వరూపమై తోఁచియుండు
నర్థస్వరూపమై యమలాత్ముఁ డున్నఁ దా శబ్దస్వరూపమై జరుగుచుండు.
హరుఁడు రుద్రరూపమై యున్నఁ దానుమామూర్తి దాల్చి లోకములకుహితము
సేయుచుండుఁ గాన శివశక్తిభేదంబు లెఱుఁగ నీకు జదున కెంతలావు. ౮౮౪

వ॥ అను చున్నసఖులం గని గిరిజ మది నాక్షేపించుచు. ౮౮౫

ఉ॥ జలజభవాచ్యుతాదిసురసంఘము లెల్లను భక్తియుక్తులై
కొలుచుమహేశు నీచపలకుత్సితవిప్రుఁడు వచ్చి నోరఁగ్రొ
వ్వులు వలుకంగ మీరును జెవుల్ సొర వించు సహించి మాఱుమా
టలు నొడికట్టి పల్కోద రొడంబడినట్టులు బ్రహ్మబంధుతోన్ ౮౮౬

వ॥ వీనిం బలికి పరమేశ్వరుం బలికించి విను టేమి యని కోపావేశంబునంబరాఙ్ముఖియై
చన నున్నకన్నెలింగి వరదుండు గౌరి నిశ్చలభక్తియుక్తికి నను రక్తుండై యా
క్షణంబ ప్రత్యక్షుండై నిజస్వరూపంబు చూపిన. ౮౮౭

సీ॥ శిరమున సురసింధుశీకరావళికంటె నటమున్న మొగసె శీతాంశురుచులు
ఫాలతటాంబకోద్భాసంబునకు మున్న ముడివడి తనరెఁ గెంజడలచాయ ౮౮౮

గళమున విలసిల్లు గరళంబునకు మున్న కాలాహిభూషణకాంతి మిగిలెఁ
బాండురాంగోన్నతప్రభకంటె ముందఱ పర్వె లిప్తామలభస్మదీప్తి
కటివృతవ్యాఘ్రచర్మంబుకంటె మున్న । మేఖలోరగఘణములు మిగిలి వెలిఁగెఁ
బాదపీఠోరువజ్రప్రభాళికంటె । మున్న పదనఖసంకాశ మున్నతిలై. ౨౮౯

వ ॥ తదవసరంబున. ౨౯౦

క ॥ తరుణతరతరణికిరణ । స్ఫురణ విడంబించు నభవుజూటాటవిలోఁ
సురనది వాలిచె లతాంతః స్ఫురకింశుకవనమునడిమి సింహికవోలెన్ ౨౯౧

క ॥ స్ఫురితప్రవాళలతికా । త్యరుణద్యుతిఁ వెగడువృషుజటాటవిలోనం
గర మొప్పెఁ జంద్రఖండం । బరుణాంబుజవనమునడిమి హంసియపోలెన్. ౨౯౨

గీ ॥ పాండురాంగవిశుద్ధాంగభాతినడుమ । నురుకపర్దారుణద్యుతు లొప్పెఁ జూడ
నమృతమథనార్థ మర్థిదుగ్ధాబ్ధినడుమ । సురలు నిలిపినకనకభూధరముపోలె. ౨౯౩

చ ॥ పరముశరీర మాదిరుచిఁ బర్విసఁ దద్వనసర్వజీవదు
ర్భరతరచిత్తతామసము వాసిన శుద్ధమయాత్మవేదులై
యరిగిరి ముక్తి కర్థిమది నైనఁ దలంచినఁ గల్గు మోక్ష మీ
శ్వరుఁగనుఁ గంటఁజూచి రట వా రమృతత్త్వము గావు డొప్పదే. ౨౯౪

వ ॥ ఇట్లు మునికుమారుం డాక్షణంబ పరమేశ్వరుం డైనం బార్వతి ఓట్టులికి యెదురు
కొని తన్నోసరించుచు. ౨౯౫

క ॥ తనమనమున సంభ్రమమును । దన్నువున ఘర్మోదకములుఁ దనరఁగ శంభుం
గని సతి నివ్వెఱనై ని । ల్చెను వడఁకుచు నీరమునఁగి లేచిన భంగిన్. ౨౯౬

సీ ॥ పగలింటికట్టెండ నొగిలినకుముదిని సితరోచిఁ గని వికసిల్లునట్లు
వేసవి వడగాలి సోఁకినలేఁదీగ క్రొక్కారుఁ గని మవ్వ మొలచునట్లు
ఫణివిషవహ్నిఁ జేడ్పడియున్న శశిరేఖ సైఁ బవిడుపునఁ గాంతి వఱలునట్లు
శాపాగ్నిఁ బడి దివ్యసతి వంది శాపమోక్షము గని నిజకాంతి నమరునట్లు
విరహతాపతప్తాపనిశిఖచయము । దఱుకి కందినమేఁదీగ తత్క్షణంబ. ౨౯౭
గౌరి కామారుఁ దగునీశుఁగనుడు శ్రీతి । నెలమిఁ దొల్లింటికంటెను జెలువమెసగె.

వ ॥ తత్ప్రస్తావంబున. ౨౯౮

మ॥ అనుశీతాచ్ఛజలంబులోఁ బొలయుమత్స్యాశంకఁ బుట్టింప లో
చనయుగ్మంబు సుధారసప్రచలితాబ్జభ్రాంతి సంధిల్ల నా
ననపద్మం బగజాత నిల్చె గళితానందాశ్రుముక్తాక్షతల్
దనరారం బతిఁ బ్రీతిఁ జూచె నెఱుఁగుల్ దళ్కొత్తఁ గ్రేఁగన్నులన్. ౮౯౯

వ॥ మఱియును. ౯౦౦

చ॥ పతిఁ గని లజ్జ నాననము వాయఁగ నల్లన వాంచి నమ్మదా
మృతరసపూరితార్ధవినిమీలితలోలకటాక్షవీక్షణా
యతసితదీధితుల్ గలయ నద్రిజ విచ్చె మహేశుమీఁద రా
జతగిరిమీఁద నున్నతి నిశాకరదీప్తులు గప్పునొప్పునన్. ౯౦౧

వ॥ అంత నంతకాంతకుం డచలసుతచంచలాపాంగావలోకనసుధారసప్రవాహ
నిర్మగ్నుండై సొగియుచు. ౯౦౨

సీ॥ నెల్లరారుక్రేఁగంటి మెఱుఁగుఁదీఁగల దుల్లుకారాకులాక్కొ క్రొక్కారుమెఱుఁగు
లాననకాంతి సుధాంశోధికల్లడిడిండీరమౌ చంద్రమండలంబు
లసితోచితాలాపరసపూరమునఁ గ్రమ్ముజాలు గాకేమిరసాయనంబు
నీలధమ్మిల్లతమాలప్రతాళినిచిపుళులో నర్తించుశిఖికలాప ౯౦౩
మనుచు రమణీయ మగునపాంగావలోక। నాతిభాతియు వదనాంబుజాతరుచియు
వచనమాధుర్యతయు నురుకచభరంబు।దేవదేవుండు దగిలి కీర్తింపఁదొడఁగె ౯౦౪

వ॥ ఇట్లు హరగిరిజ లధికప్రణయరసాపూర్ణసాగరంబులను నభిమానశీలంబులను
నతిక్రమింప నున్నకన్నెఱింగి పరమేశ్వరునకుం జతురిక కృతాంజలియై. ౯౦౫

---

౯౦౧. చూడ్కులఁ దెల్లగా వర్ణించినందునకు, "నీకనుదోయివెన్నెలలు
ండక కోగ్కలు నాకునిండునే" ఉ. హరి. ఆ. ౧. "నెలఁతుకచూడ్కి వెన్నెల
గాసినకుమారువీక్షణాంభోనిధివెల్లివిరియుఁ । బతిచూడ్కితామరల్ పరువంబునొందఁ
గొయ్యాలిచూపు టలులు చిట్టాడుచుండు। సుదతిచూ పమృతంపుసోనయై గురిసిన వరు
దృష్టి యనిమిషత్వమువహించు। నధిపుదృష్టిప్రవాహంబు పెల్లడరిన నింతిదృష్టీనంబు
ంతలాడు । వరుఁసఁ గౌతుకకల్లోలవలన మొలయు। రాగమకరందమత్తత బ్రజ్వరిల్ల।
పంచితధ్యాన మనుప్రకాశము దలిర్పఁ జిఱుతసిగ్గనువలలోనఁ జిక్కువడక." పెద్ది
రాజుప్రద్యుమ్నచరిత్ర. ఒకానొకపండితవర్యుఁడు చూడ్కులఁ దెల్లగా వర్ణించుట
దోషవిశేషమని యాక్షేపించినందునకై యుదాహరింపవలసె.

క || గిరిసుతకన్యాగుణ మా।దరమున మును సప్తపతిష్ఠితము సేసి లస
త్పరిణయపూర్వకమున నీశ్వర సుదతిఁ బరిగ్రహింపు సన్మార్గమునన్. ౯౦౬

వ || హిమవంతు నఖిలజగద్వినుతుం జేసి కృతార్థుం జేయవలయు ననిన వరదుండు
దానికోరిక వరంబు దయసేసి. ౯౦౭

క || తమకంబున నరుగుమరా।లము లంబుదరవము విని చలాచలమతి సం
గము వాసినట్లు నవసం।గము మిరుపుర వడలి చతురికావచనగతిన్. ౯౦౮

వ || హరగిరిజ లొండొరుల చిత్తంబులు విడుజట్లుగొని తారసీహారాచలంబుల కరిగి
రంత నంతవృత్తాంతంబును హిమవంతుం దెలిపింగి నిజరాజమందిరోత్సవంబు
సేయించి సమస్తరాజ్యవిభవాన్వితుండై. ౯౦౯

క || చనుదెంచి పేర్మితో నిజ।తనయం దోడ్కొని ముదమునఁ దనపురమునకుం
జని సతులఁ దపోవేషం।బునయమున సుతిరుఁ బాపుఁడని నియమించెన్. ౯౧౦

వ || అంత నంతఃపురాభ్యంతరప్రౌఢకాంత లత్యంతసంతోషంబున సుగంధతైలా
భ్యంగనామలకోద్వర్తనపూర్వం బపరిమితపరిమళితహంసోదకంబుల.

గీ || ఒడలి భస్మరజంబు వోఁగడిగిపుచ్చి।జడలు విచ్చినఁ గరమొప్పె శైలతనయ ౯౧౧
జలద పరిగత నిర్ముక్త గళితపర్ణ మధుకరాకీర్ణ తరులతామహిమ వోలె

గీ || కసటువోవఁ ద్రోడని కడిగినకనకంపుఁ బ్రతిమవోలె నొప్పె నలిన్నమేను
కచభరంబు వొల్చె గవిసెన వుచ్చినకుసుమబాణునీలకుంచివోలె. ౯౧౨

వ || అంత నట గిరీశుండు రజతగిరి కరిగి పరిణయోద్యుక్తుండై సప్తర్షులం దలంచుడుఁ
దదీయస్మరణప్రేరితంబై మునిగణం బాక్షణంబ చనుదెంచి. ౯౧౩

క || కనుచూడ్కిం గోలెను దం।డనమస్కారములు సేసి డాయం జని స
న్మునితతి గరముకుళితులై వినుతించుచు నిలిచి రఖిలవేదస్తుతులన్ ౯౧౪

వ || అమ్మహర్షులు పరమేశ్వరానుమతంబున నిజార్హస్థానాసీనులై కరకమలంబులు
మొగుపు డించి ౯౧౫

క || త్రినయన నీ వెవ్వని మన।మునఁ దగ వర్తించి తతఁడు ముక్తుండగు నీ
మనమున వర్తించితి మ।ఱి ధనద సఖా యేమె కామె ధన్యుల మెందున్. ౯౧౬

వ || మమ్ము రావించినకార్యం బానతి యిమ్మనిన నమ్మునీశ్వరులకు నీశ్వరుండు గరుణావ
లోకనసనుచితాలాపసుధాప్రవాహంబునం దేల్చుచు. ౯౧౭

చ ॥ గిరిజతపఃప్రభూతికి నకృత్రిమభక్తికి మెచ్చి దానికిన్
వర మనురక్తి నిచ్చితి వివాహమునం దదభీష్టసిద్ధి చె
చ్చెర ఘటియింపఁ గావలయు శీతగిరీశ్వరుపాలి కేఁగి మ
త్పరిణయకార్య మోజఁగొనఁ బల్కు రయంబున రండు గ్రమ్మఱన్ ౯౧౮

వ ॥ అని తమ్ము నాప్తులం జేసి నిజాప్తకార్యం బెఱిఁగించి నియమించుటకు నమ్మునులు ప్రముదితహృదయులై మహాప్రసాదం బని వీడుకొని శుభవచనంబులు వినుచు శుభద్రవ్యంబులు చూచుచు శుభశకునంబులు గైకొనుచుం దుహినాచలంబునకుం జనిచని ముందట ౯౧౯

చ ॥ పరమకపర్దరాగరుచి పర్వెనొ కాంచనశైలభూతి మైఁ
బొరసెనొ కల్పవృక్షఫలభూరిరసం బొడఁగూడెనో నదీ
శ్వరవరసంగమాగమనసమ్మదరాగిము నాఁగ హేమపం
కరుహరజఃపిశంగరుచి గ్రాలుసురాపగఁ గాంచి రమ్మునుల్ ౯౨౦

మ ॥ కరమొప్పన్ వియదంగనాతరలముక్తాహారమో శంభున
త్యురుజూటాశ్రితసర్పకంచుకమొ హేమోర్వీధరగ్లానుధా
కరకాంతంబొ హిమాచలోపరిశరత్కుందంబొ భూస్త్రీసితాం
బరమో వారిధి దృష్టిఁ ద్రాగెడు సుధాపానంబొ నాఁగా మునుల్. ౯౨౧

వ ॥ అని వర్ణించుచుం దదీయామలజలస్నానపవిత్రీకృతగాత్రులై తుహినాచలంబునకుం జని తదుపకంఠంబున. ౯౨౨

సీ ॥ వేదాదు లగుమహావిద్యల కెల్లను వనజాసనుఁడుఁ దాను నునికిపట్టు
శృంగారవతు లగునంగనావలి కెల్ల నమరావతియుఁ దాను నాలయంబు
లనుపమానర్ఘ్యరత్నానీకముల కెల్ల నంభోనిధియుఁ దాను నాకరంబు
లక్షయం బగునసంఖ్యార్థరాసుల కెల్ల నలకయుఁ దానును నిలయము లన
వఱలు పేర్మితో భారతవర్షమునకు। భూషణం బన నధికవిభూతిఁ దనరి
పరఁగుహిమనగాధీశ్వరుపురవరంబు।ప్రస్తుతం బగునోషధీప్రస్థపురము. ౯౨౩

---

౯౨౧. పోల్చిచూడుఁడు.“ స్థిరపృథ్వోదయమేది నీఁదువదనా సీమంతవీథీలస
గ్గురుముక్తాఫలసూత్రమో సురుచిరక్షోణీపురంధ్రీసమా।దరధమ్మిల్లలతాంతమాలి
కయొ భూత్స్వకుచశ్రీమనో।హరసంవ్యానమొ నాఁగ సీదగుప్రవాహాంబు యొప్పు
గోదావరీ.” ప్రెగ్గడపల్లిపోతయ్యగారిగోదావరీ శతకము. కందము = మేఘము.
“కందస్తు సూరణే సస్యమూలే జలధరే పిచ,, అనివిశ్వము.

వ॥ తత్పురవరంబునందు. ౯౨౪

క॥ జల మిశ్రఫలరసంబులు|గలు పంబరుహోత్పలములు గరుసులు ముత్యం ౯౨౫
బులు మీలు మణులు శంఖులు| నలి సస్యము చెఱకు రాజనపుఁ బాల వెల్లన్

చ॥ హాలికనితంబినీతతి ప్రసుత్త్వమునం దమకాచియున్నయ
క్కలమవనాళిఁ జక్రవిహంగంబులు సొచ్చినఁ జోఁపిపుచ్చఁ జే
తులు చఱువంగ నెత్తుటయుఁ దుంగకుచంబులు వాని నాఁగు న ౯౨౬
ప్పలుకులయొప్పిదమ్ము లెడ బోలినపక్షము సేయునట్టివై. ౯౨౭

చ॥ నలిఁ గమలాననల్ మృదునినాదములన్ వెడదొక్కుఁబల్కులన్
సొలవక చిల్కలన్ వెడలఁజోఁపు నెలుంగులుఁదమ్ము డాయ రాఁ
బిలుచుటగాఁగ నా చిలుకపిం డనిశంబునుఁ జేలలోన మం
దలుగొని పాయకుండు మదిఁ దద్వచనశ్రవణాభిలాషులై. ౯౨౮

సీ॥ నిమ్మలు మాదీఫలమ్ములు నతిరమ్యముగఁ బండి నేలపై మోచియుండుఁ ౯౨౯
బనసలు నీడలుఁ బండుగుత్తులుగట్టి హారక వానిపై వ్రాలియుండుఁ
దేరుమామిండ్లును నేరేళ్ళుఁ గడుఁ జెల్వమై పండి వానిపై నదికియుండుఁ
గ్రముకంబులును వరఖర్జూరనికరంబు నొగిఁ బండి వానిపై నొఱఁగియుండు
నాలికేరములును దాలసమూహంబుఁ బండి వానిఁ గప్పియుండు నొప్పి
తరుసఁ దరతరంబ వనములు సత్ఫలరాసులై నభమ్ము రాయుచుండు. ౯౩౦

మ॥ రసముల్ గ్రమ్ముచు వృక్షపక్వఫలముల్ రమ్యోక్షుసంఘంబుపై
వెసఁ బండ న్వడి వ్రస్సి వానిరస మువ్వి న్వెల్లిగొంచున్ వనం
బోసంగం దత్తరురాజిపైఁ బఱచుఁ దా రొండొంటి కాత్మీయస
ద్రసమాధుర్యత నూపునట్లుతరురారామంబు లం దందమై. ౯౩౧

---

పోల్చిచూడుఁడు. "సీ. కమలాకరస్ఫూర్తి కాసారములయందుఁ దమయందుఁ గలుగంగఁదనరుచుండు| గంభీరజవక్రమ మగస్తలయందుఁ దమయందుఁ గలుగంగఁదనరుచుండు| ధారావిహారముత్తమతురంగములందుఁ దమయందు గలుగంగఁదనరుచుండు| సుమనోవికాసంబు ప్రమదవనములందుఁదమయందుఁ గలుగంగఁదనరుచుండు| దానమహిమ సముత్తుంగదంతులందుఁదమకరమ్ములఁ గలుగంగఁదనరుచుండు| సిరులసంతోషమున ముఖ్యశీలవృత్తిరణజయోద్దారతలఁ బురిరాజులలము" పేరయగారిపద్మినీవల్లభము.

గీ॥ ఓలిఁ దాంబూలవల్లి తమాలనీల। భూతి దఱఁకంగఁ బరిపక్వపనసపూగ
భాసురారుణద్యుతులు పైఁబర్వి పొగడఁ। జాలు వనలక్ష్మి ప్రత్యూషవేళ నోలె. ౯౩౨

మ॥ తమవక్త్రాధరకేశయానసయనోద్దామప్రభావంబులన్
రమణిం బోలుదు మన్నఁ దత్పురసతుల్ రాజీవ బంధూకభృం
గమరాళోత్పలరాజి నూరివెలి నల్కన్ స్నరఁ ద్రోపించిన
ట్లమరెం దోయజషండముల్ పురవరోద్యానంబులం దందమై. ౯౩౩

మ॥ వరకార్తస్వరవస్తునిర్మితములై వస్త్రాంగరాగస్రగా
భరణానోకహనందనాన్వితములై పానాశనాద్యంబులై
స్మరకేళీనిరతాంగనాస్పదములై సంగీతరంగంబులై
పురబాహ్యంబులఁ గృత్రిమాచలము లొప్పుం జూడ రమ్యంబులై. ౯౩౪

మ॥ ఫలభారానమ్రమమాత్రప్రకరవిహరదుత్పన్నకీరాళిపుంస్కో
కిలగానంబుల్ నెలంగున్ గృతకనగతటాకీర్ణకేకీరవంబున్
గలయుం దద్ఘోష మోలిం గమల వనసురక్ష్మాపగానంతకాంతా
కులమంజుధ్వానముల్ సంకులముగ వయసం గూడి చెల్వొంది ప్రోయన్. ౯౩౫

గీ॥ దానసంపదఁ గడస్నతమకు నోరులఁగడవ సర్వస్వదానులఁ గని పురమున
నుండ లజ్జించి వెడలినట్లుండుఁ దనరి। బాహ్యతద్దేశముల మదభద్రకరులు. ౯౩౬

చ॥ వరవనితాననేందురుచివర్గములన్ మణిహేమహర్మ్యవి
స్ఫురదురుదీప్తులన్ వెడలఁజోఁపినఁ జీకటి వాసి నిల్చెనో
పురకమనీనితంబతటభూషితమై పలసిల్లుమేచకాం
బరమొకొ నాఁగ నొప్పుఁ బురబాహ్యవృతాసితనందనావళుల్. ౯౩౭

క॥ మరకతమయవజ్రమహా। స్ఫురణమెయిం దొంగలించి పొదలినభంగిన్
దరుగుల్మలతాహరిద। త్స్వరరుచిఁ గర మొప్పు బాహ్యకోద్యానంబుల్ ౯౩౮

---

౯౩౭. గండరించు = పడియచ్చుకట్టి పోఁతపోయు. "మదనవశీకారమంత్ర దేవత దృష్టిగోచరమూర్తిఁ గైకొనియెనో కాక। సితకరబింబనిస్సృతసుధాధార నితంబినీ రూపంబు దాల్చెనో కాక। విధకామినీశ్రేష్ఠః జ్ఞానపరసీమ విధిగండరింపంగ వెలసెనో కాక। శృంగారనవరసశ్రీవిలాసోన్నతి సుందరాకారంబు నొందెనో కాక। కాక యొకవధూటి కడుపునఁబుట్టిన భామ కేల యిట్టి రామణీయకంబు గలుగు ననుచుఁ గన్నియపై మహీపాలసుతుఁడు దృష్టి పఱపె నర్థి." తిక్కనసోమయాజివిజయసేనము ఆ-౨.

క॥ సరసిరుహరాగహృష్టో|త్కరరుచి వెలిఁ బర్వునట్లు క్రముకామ్రఫలో
త్కరుణాబ్జజాలివనవి|స్ఫురణం గరమొప్పఁ జూడఁ బురబాహ్యంబుల్ ౯౩౯

చ॥ శరధిసమస్తవస్తువులు శౌర్యమునం బురి నూఱుగొన్నయ
ట్లురుతరరత్నబద్ధనికరోన్నతి నప్పురికోట యొప్పునా
శరధి నిజార్థలోభమున సాహసుఁడై పురిమీఁద నెత్తి భీ
కరముగఁ జుట్టుముట్టె ననఁగాఁ బరిఖాజలవృద్ధి పొల్పగున్ ౯౪౦

క॥ పరిఖామలజలములలో|నురగఫణామణులదీప్తు లొగి నెగసియుఁ గై
నరసి సితాసితరక్తాం|బురుహంబులపోలె నిలిచి పొలిచి వెలుంగున్ ౯౪౧

చ॥ కొలఁదికి మీఱఁ బెద్ద యగుకోటతనర్పున వప్రసంతతో
జ్జ్వలతరసత్ప్రభాతి రవిచంద్రరుచుల్ సొరనేరకున్న సం
ధ్యలు దివసత్రియామలునుఁ దత్పురిపౌరజనం బెఱుంగుఁద
ష్ములము చవిన్ విహంగగతిఁ బుష్పలతావి రతిప్రసంగతిన్. ౯౪౨

క॥ పరువడిఁ గులగిరు లిడి వా|రిరుహాసనుఁ డొనరి గండరించె నొకో నాఁ
గర మమరి తత్పురంబున|నురుతరమణిహర్మ్యనికర మోలి వెలుంగున్. ౯౪౩

చ॥ తనవెలుఁ గొక్కప్రోద్ద నిజధామము లెన్నఁగ వేయు మావెలుం
గనిశముఁ బర్వు ధామము లనంతము మా కని హర్మ్యసంచయం
బునమణు లప్పురంబున నభోమణి ధామము దాల్చి పోవనీ
మని రవిఁ జూఁద నెత్తె నన నంబర మంది వెలుంగు సద్రుచిన్. ౯౪౪

క॥ ఆమూడుటంగ్లతుదిఁ గల|శామలమణు లభ్రమార్గ మజరి లసత్తే
జోమహిమఁ దనరి తారు న|భోమణు లనఁ జాలి కాంతిఁ బొదలి వెలుంగున్. ౯౪౫

క॥ కనకమయహర్మ్యపంక్తులు|ఘనమార్గం బడరియున్నఁ గల్పకుజంబుల్
గని యాఁడలు దిగ్గనో యనఁ|దనరుచుఁ దత్కేతుదండలతతి విలసిల్లున్. ౯౪౬

మ॥ కమనీయాత్మకసర్వలోహమణిసత్కాలేష్టికానిర్మి తో
త్తమహర్మ్యంబుల గండరించినకపోతవ్రాతపంక్తుల్ బిడా
లము లోలిం గని వానిమీఁది కలుకన్ లంఘించెఁ గా కున్నఁ ద
ద్భ్రమఁ బైనూఁగినఁ బల్క వొండొరుఁ గడీ పారావతానీకముల్. ౯౪౭

చ ॥ గగనము దాఁకి చిత్రగతకాంచన సంహతిఁ బొల్చు హర్మ్యముల్
నగములు సాఁచి యూఁగినమనంబులఁ బూర్ణసరోవరంబు ల
న్నగ జలకేళిసల్ప నని వచ్చి యెఱింగి వియచ్చరాంగనల్
మగుడుట సూచి నవ్వుదురు మాడ్కులందు రమించుదంపతుల్. ౯౪౮

గీ ॥ పరమమాహేశ్వరవ్రజవిరచితోరుకనకమణిగణమయము లంకాశ మడరి
మానితంబులై స్వర్ణసోపానపంక్తు లనఁగఁ బ్రపురినొప్పె దేవాలయములు. ౯౪౯

క ॥ పురివీధులు గనుగొన సుందరమగు ఘుటయొప్పి సమయఁ ద్రాగినరత్నా
కరము లొకొ వివిధరత్నాకరములు నా వరమణిప్రకరభరితములై. ౯౫౦

క ॥ వేదాచార్యులు సంతత వేదాధ్యయనులు సమస్తవిద్యానిపుణుల్
వేదాఖిలార్థవిదులు మహాదేవధ్యాననిరతు లప్పురివిప్రుల్. ౯౫౧

చ ॥ అవిరళనిత్యకర్మవివిధాధ్వరవహ్నిముఖంబులన్ సదా
దివిజగణాళి నాహుతులం దృప్తులఁ జేయుచు హోమధూమసం
భవఘనవృష్టి భూజనులఁ బాయక తృప్తులఁ జేయుచున్ మహో
త్సవకరులై రమింతు రనిశంబు ధరామరు లప్పురంబునన్. ౯౫౨

క ॥ ధనదుధనసంఖ్య నవనిధులన వినియాదేశనామ మతనికి నీమే
మొనర ననసంఖ్యార్ధేశులు మని ధనపతి నుఱరు పేర్మి నప్పురివైశ్యుల్ ౯౫౩

క ॥ నలిఁ గోటికోటిపడగలు గలగొనఁ గట్టినను వానిఁ గావని మదిలోఁ
దలఁప రసంఖ్యార్థధ్వజములు గట్టినవారు వైశ్యముఖ్యు లనేకుల్ ౯౫౪

చ ॥ అనిశము గోసహస్రవిధి నందుల్లకోమటు లిచ్చుధేనువుల్
గొని చను భూసురోత్తములగోవులపాదహతిన్ మహీతలం
బనయము గ్రుంగి మట్టివిసి యప్పురిచుట్టున నూంట రేఁగి బో
రన నట జాలువాఱి నదులై చను నంబుధిఁ గూడఁ బెల్లునన్ ౯౫౫

క ॥ ఎత్తినపుష్పలు ముడుచుచుఁ బొత్తిచ్చినపన్నిదము బొడుచుచు నత్యు
దాత్తిగలి వీధిలో సుభటోత్తము లంగళ్ల మెఱయుచుండుదు రెలమిన్ ౯౫౬

చ ॥ సురసతు లర్థిఁ దత్పురము సూడ మనంబునఁ గోరి కోటపై
వరుస విమానముల్ నిలిపి వచ్చిరొ నా మణిహేమభాతి న

౯౫౨ ఉఱరు=లక్ష్యము సేయరు. "ఉఱఁడుసురేంద్రుసైన" భా. ర. ఆ. ౬. అ-౬.

ట్టిరవులు వొల్చు నిం(దుపురి కిప్పురి మే లని యాసురాంగనల్
మఱిగి రమించు చున్నటులు మానిను లొప్పుదు రప్పురంబునన్ ౯౪౭

సీ॥ తా నింతియై యుండగా నోరు నర్థించి హరి వేఁడె లక్ష్మీమాహాత్మ్య మెంత
తా నార్యయై యుండఁగా నజుం డాత్మజఁ గవసె భారతినేర్పు కలిమి యెంత
తాఁ బత్నియై యుండఁగాఁ బరాంగన వ్రజి కామించె శచిసుభగత్వ మెంత
తాఁ గాంతయై యుండఁగాఁ గాముఁ డీగ్గె మున్ రతిశుభలక్షణోన్నతి యదెంత
తమ్ము వంచించి మును లుగ్రతపము చేసిరప్పరస్సీలసోయగ మనఁగ నెంత ౯౪౮
యంచు నెన్నెయిఁ (త్రిజగంబులందు సురులఁ(గామినులమెచ్చ రప్పురాంగనలు పేర్మి.

చ॥ కనుఁగొన సుందరాకృతులు గన్నులపండువు మంజుభాషణల్
విన నమృతాంబుపూరములు వీనులకుం దలఁపన్ విలాసముల్
మనసునకున్ సుఖాస్పదము మారుపు లందినమేని కందుర
జ్జనులకుఁ గామభోగములు జన్మఫలం బనఁ బొల్తురంగనల్. ౯౪౯

చ॥ అనుపమకాంతియై సుచిర స్థైనమెఱుంగులో సోలివీఁగకో
య్యన నడపాడులేఁబొఱలో యాయువు వచ్చినచిత్రరూపులో
ఘనపదమూర్తి నేకొనినకామసుఖంబులో యంచుభావకుల్
గనుఁగొన లగ్గ నోటువడఁగాఁ గర మొప్పుదు రప్పురాంగనల్. ౯౫౦

క॥ పాయక సర్వర్తుకపు(ష్పాయతగంధములు గొంచు నప్పురిఁ బగలున్
రేయును నింటింటికి మృదు(వాయువు సనుచుండుఁ గట్టివాలునఁ బోలెన్ ౯౫౧

మ॥ సముదానేకపబృంహితంబు హయహేషాఘోషమున్ గీతవా
ద్యమృదుధ్వానము వేదరావము భటోద్దండోక్తులుం భూపపం
చమహాశబ్దరవంబుఁ గూడి సుమహాత్సంక్షోభితాంభోధి నా
దమొ నా దిగ్బధిరీకృతం బగుచు నిత్యంబుం జెలంగుం బురిన్ ౯౫౨

---

౯౪౮. పోల్చిచూడుఁడు:—"గుడిననోర్వ యూర్వశిగె గంగగె గోపిగె కొట్టరెంబొ హా(పెండిరరూపుమం సొగుబమంభవమం పెసగ్గొళ్వుదే మనం(గొండ శసం గనంరతిమొనల్ చదురెత్తిణ దాకె గెందు క(గ్గొండవిలాసదిం నగువ దల్లియవారపిలంనిసిజనం" మల్లినాథపురాణం.

౯౫౧. గట్టివాలు = చందనపుష్పము లమ్మెడి(స్త్రీ లేకపురుషుఁడు. "కలపం బెవ్వరు గూర్చితెచ్చినను నికృఁబొల్లఁ డెల్లప్పుడున్ (జలకంబాడి మదాగమంబ మనెలోనన్ వార్చుఁ గంసుండు రా(జెలమిన్ మెచ్చినగట్టివా లిదియునన్" హరి. ౭-౯.

సీ॥ రాజకదంబవిరాజితం బగుఁ గాని కంటకప్రోత్కరము గాదు
పద్మాలయాలిశోభన మనం జనుఁ గాని కుముదోదయాదిసంకులము గాదు
శుద్ధసువర్ణప్రసిద్ధాస్త మగుఁగాని వరచిత్రవర్ణ సంకరము గాదు
పరమౌషధిప్రభాభాసురం బగుఁగాని దుస్తృణద్యోతివిద్యుతము గాదు
వనకులంబునుఁ దత్సరోవరకులంబుఁ జెలువ మగుహర్మ్యకులము సత్క్షేత్రకులముఁ
బోలఁగ నిన్నింటిలోఁ దాను బోలియున్న ప్రస్తుతం బగు నోషధీప్రస్థపురము.

క॥ ఉరుతరమణిగణరుచివి స్ఫురితంబై వివిధవిపులభోగాన్వితమై
పరమశ్రీసహితంబై యురగాధిపుఁ బోలి తత్పురోన్నతి వొలుచున్. ౯౬౪

సీ॥ మును మహీధేనువు చనువత్సమై కుడ్చి వస్తుసంపూర్ణమై వఱలువాఁడు
కమఠోరగేంద్రదిగ్గజరాజి దాల్చుభూభార మెక్కటిఁ దాల్చి పరఁగువాఁడు
త్రైలోక్యజనని యై తనరుశర్వాణికి జనకుండు నా సడి సన్నవాఁడు
విశ్వైకగురుఁ డగు నీశ్వరునకు నర్థి మామగా నెగడినమహిమవాఁడు
తుహినకరతీవ్రకరహుతవహులు వరుసఁ బాచుతమమోషధీప్రభాభాతిఁ దాన
పాచివిలసిల్లు పాండుదిస్ఫురితకీర్తి యంతఁ డచలుండు పతి హిమవంతుఁ డతఁడు.

వ॥ అని యనేకప్రకారంబుల వర్ణింపందగినవర్ణనల కెక్కి మహిమోజ్జ్వలకామంబునుం బోలెనతిరమణీయం బై నయోషధిప్రస్థపురవరప్రభావంబు గనుంగొని మెచ్చి పిచ్చలించుచు వచ్చుమునీంద్రుల కచలేంద్రుం డెదురువచ్చి వినయవినమితోత్తమాంగుండై నిజరాజమందిరంబునకుం దోడ్కొని చని సముచితాసనపాద్యార్ఘ్యశేషార్చనాభ్యర్చితులఁ

౯౬౩ పోల్చిచూడుఁడు; ఎఱ్ఱాప్రెగ్గడ—మల్హణ చరిత్రములో. "సీ. కువలయకమలాభినవమనోజ్ఞం బయ్యుఁ బంకజీవనపరిప్లవము గాక। ఘనసారపున్నాగకమనీయమయ్యును గితవదుష్కలితసంయుతము గాక। సాధుదానప్రౌఢియూధపం బయ్యును విశ్రుతఖురసమన్వితము గాక। రాజితోత్తమజాతిరత్నాంకితం బయ్యు శృంగారవిటపిదూషితము గాక। వరసరోవరచయమును వనచయంబు। నృపచయంబును దివ్యమంటపచయంబు। నెలమిఁ దనుఁబోలునన భోగడ్త్తలు వహించె। భువనసారంబు గల్యాణపురవరంబు" ఆ-౧.

౯౬౫ తనమును బాచునోషధులు:—జ్యోతిష్మతి, సోమలత, జ్యోతిర్లత, నీలజ్యోతి. ఇందు జ్యోతిష్మతి కాంచన సన్నిభము, రెండవది చంద్రప్రభాసన్నిభయు, మూడవది విద్యుల్లతాసన్నిభయు నాల్గవది, హరినీలసన్నిభ యనగును. ఇందు సోమలతయు, జ్యోతిర్లతయు "త్రిధా ప్రోక్తావ్రతుకందలతాత్మికా। నిశానుజ్జ్వలతే సాతు సాహ్నిజ్వలతి పార్వతి". అనిరసాయనఖండమునఁ జెప్పినట్లు దేహలోహసద్యోవేధాకరము లగు నీదివ్యౌషధులు మూఁడు తెఱంగులఁ గనఁబడును.

జేసి కర్పూరపాళీవిరాజితంబు లగువిడియంబు లిచ్చి ముకుళితకరకమలుండై భవదీయాగమనప్రయోజనం బెఱింగించి దయసేయుం డనిన గిరిపతి సమ్మునిపతులు యథోచితవచనంబులం గల్పికొని. ౯౬౬

మ॥ రజతాద్రిస్థుఁ డనాదిదేవుఁ డఖిలారాధ్యుం డసాధ్యుండు త
త్త్రిజగన్నాథుఁడు మమ్ము నీకడకుఁ బుత్తేరంగ నాస్వామి క ౯౬౭
ద్రిజ నిన్నేమడుగంగ వచ్చితి ముమాదేవిన్ లసత్కన్యకా
వ్రజచూడామణి నిమ్ము శంభునకు భాస్వత్పర్వతాధీశ్వరా

వ॥ అనిన సమ్మునిపతులదివ్యవచనంబులు ప్రియంబున నాదరించి ౯౬౮

క॥ విని ముత్పులకితదేహము|వినుతానందాశ్రుగళితవిమలాక్షుఁడునుం
దనరఁగ మహాప్రసాదం|బని పరమేశ్వరుని కెఱఁగి యగపతి భక్తిన్. ౯౬౯

చ॥ పరమున కేను దాసుఁ డని పల్కఁగ బ్రాపుఁడఁ గాను మత్సుతన్
హరునకు నిత్తు నా వెఱవనయ్యె సపుత్రకళత్ర మేను మీ
వరువుఁడ మిమ్ముఁ గొల్వఁగలవాఁడ నవశ్యము దీని మీరుచె
చ్చెర నొడఁగూర్చి నాకు దయసేసి కృతార్థునిఁ జేయుఁ డిత్తఱిన్ ౯౭౦

చ॥ కులములరాజు గోత్రమునకుం బతి వేల్పుల వేల్పు సంపదల్
కలిమి కధీశుఁ డీవి కధికారి త్రిమూర్తుల కాదిమూర్తి దా
నెలమి సమస్తలోకముల కీశ్వరుఁ డిమ్మెయి నన్ను నేలఁగాఁ
దలఁచిన దీన నేను కడు ధన్యుఁడఁ బుణ్యుఁడ లోకమాన్యుఁడన్ ౯౭౧

క॥ ఇది నాకు నుంకు విచ్చుట|యిది మొదలుగ నన్ను నరణ మిచ్చితిఁ ద్రిజగ
ద్విదితముగ నీశ్వరున కని|ముద మొదవ శిలోచ్చయోత్తముఁడు నిశ్చితుఁడై.

వ॥ ఈమునివరులకుం జూడ గౌరిం దోడ్కొని రం డని విదగ్ధాంగనల నియమించినఁ దగ్గణికానియోగంబున మణిలోకంబుల వెలద్రు మదను ఖడ్గలతికయుంబోలె నగజ నైపథ్యాగారంబు వెడలి లజ్జావనతానన యగుచు ౯౭౨

---

౯౭౧. కలిమి = కలిగియుండుట. “కుసుమకోదండుండు గుణవంతుఁ డగు బెల్లయలులార మీప్రాపుకలిమిగాదె|మరునియెక్కుడుపెంపు మహిమీఁదఁ జెప్పుట కీరంబులార మీపేరఁగాదె|మీనకేతనుకీర్తి మిన్నందుకొను టెల్ల శీతమయూఖునిచెలిమి గాదె”. పెమ్మనయనిరుద్ధచరిత్రము.

చ॥ తనతనుకాంతి దళ్కు ననుధారసపూరము గాఁగ దానిలోఁ
గనుఁగవదీధితుల్ ఝషనికాయములై పొలుపొంగ భ్రూలతల్
సనులహరీప్రవాహములుగ శైలజ వచ్చి సభానికేతనం
బను మహిఁ గప్పురాగభరితాంబుధి నా మదలీలఁ గ్రాలుచున్ ౯౭౩

వ॥ ఇట్లు చనుదెంచి నిజజనకునూరుపీఠం బలంకరించుచున్న గౌరి నమ్మునివరులు గని తదుత్తమస్త్రీలక్షణలక్షితం బగు సర్వాంగోపాంగప్రత్యేకసముదాయశోభ లుపలక్షించి చూచి ప్రముదితహృదయు లగుచు నిప్పరమేశ్వరి పరమేశ్వరునగ్రమహిషి యగు నేమి యపూర్వం బని నిశ్చయించి పార్వతీముద్రారోహణంబు సేసి నగపతిచేత సత్కృతులై వీడ్కొని చనుదెంచి రంత నంతకుమున్న తద్వృత్తాంతం బెల్ల నెఱింగి హరిపరమేష్ఠిపురందరప్రముఖ సురాసురోరగ సిద్ధవిద్యాధరాద్యఖిలభువనభవనాధీశ్వరు లీశ్వరాచలంబున కరిగి తదున్నతిఁ గని విస్మితు లగుచు. ౯౭౪

క.॥ రాజాలంకృతమర్కవి! రాజితమురుకటకసింహరమ్యము ఘనవి
భ్రాజిత మనుపురుడునన నో! రాజతగిరి మింటితోడ రాయుచు నుండున్. ౯౭౫

వ॥ అనుచుం దదారోహణోద్యుక్తు లగుచుండి రంత. ౯౭౬

చ॥ హరి గరుడుండు బ్రహ్మ గలహంసము నాఖచరేంద్రులుం గరం
బురవడి నద్రిపై కెగర నోపక తత్పృథుపాదపఙ్క్తిపై
నిరవుగ నిల్చి నిల్చి తుది కెక్కిరి ప్రోన్నతులైనవారి వి
స్తరవరపాదసేవ దగు సద్గతి హేతువు కాదె యెమ్మెయిన్ ౯౭౭

వ॥ ఇట్లెట్టకేనియుం జని తదుపరితలంబున. ౯౭౮

సీ॥ రసరసాయనసుధారసనిర్ఝరంబులై క్రమ్మంగ నెలరారుకల్పతరులఁ
బరుసవేదులఁ బొంది హరికాంత శిఖిఁ గ్రాఁగి కనకంబు లగునయస్కాంతశిలల
సురుచిరోషధితృణజ్యోతిప్రభాలీల మాయించి వెలిఁగెడుమణిగణముల
బహులచింతామణిప్రాసాదవృతభూషణాంబరబానపానాంగరాగ
మాలికాంగలతానందమందిరముల! బ్రామఁ బండులు సతులకు మఱిగియాడు
సిద్ధవిద్యాధరామరస్త్రీవిలాసభాసితం బగు కైలాసపర్వతంబు. ౯౭౯

---

౯౭౯. ఎలరారు = సన్నగాలికిఁ గదలుచున్న. "కర్పూరసారామోదం బెలరార" నృసిం. ఆ-౧. ఎలరు = సన్నగాలి. వనజమనోకల్లికిక్కు, మఱి దుంబియ నాళ్లు, తరంగ సొంబత! క్కనపరికారరం తుళిదు, శీకరమం తళి దొట్టికొండు మా! విన ఘడియుం హృగేంద్రభయదిందె తిరోహిత నాగ జర్పకా! ననకరియుంతె, బందు దెల

వ ॥ కని దానిరమణీయవిభూతివిశేషంబునకు మెచ్చి. ౯౮౦

క ॥ శిరమున సర్వాత్ముం డగుపరమేశ్వరుఁ దాల్చి నిల్చి పాదములఁ జరా
చరధాత్రి దాల్చి పరఁగిన। హరగిరి పెం పేరికైన నలవియె పొగడన్. ౯౮౧

వ ॥ అని మెచ్చిమెచ్చి పిచ్చలించుచు. ౯౮౨

సీ ॥ కనకహర్మ్యములతోఁ బెనఁగినపవడంపుభద్రంబులది వీరభద్రపురము
ముల్లోకముల స్తోత్రములు ముట్టడినవపుష్పదామంబులది పుష్పదంతపురము
చారుముక్తాఫలహారోపశోభితకూటంబులది భృంగిరీటిపురము
పద్మరాగోన్నతప్రాసాదదీధితు లెసఁగినయదియు చండేశపురము
వప్రులు జాంబూనదాధికవస్తుఖచిత। సురభివనములయది గణేశ్వరుపురంబు
విమలరుచిఁ బొల్చుగోమేధికములఁ దనరు। గోపురంబులయదినందగోపురంబు. ౯౮౩

వ ॥ అనుచు నెడనెడ ననేకగణాధీశపురవరాతివిభూతివిశేషరమణీయంబులఁగని
విస్మితు లగుచు. ౯౮౪

మం ॥ ఫాలాంభోజాంబకునురుజటాబంధనాపీడ్యమాన
వ్యాళాధీశాననవిగళితోచ్ఛ్వాసనిర్ధూతగంగా
స్థూలోర్మిశీకరసమితిపై దూలిశోభిల్లుఁ జూడం
గైలాసోర్వీధరపతికి ముక్తాఫలచ్ఛత్రలీలన్ ౯౮౫

వ ॥ అని వర్ణించుచుం జనిచని ముందట ననతిదూరంబున. ౯౮౬

సీ ॥ మెఱుఁగులఁ గన్నులు మిఱుమిట్లు వోయెడునమలచింతామణిహర్మ్యములను
దలతలవెలిఁగెడుతరళప్రభాస్పర్శ వేదికట్టిమతలవీధికలను
దేదీప్యమానమై తేజరిల్లెడుసిద్ధఘుటికాదినవవప్రగోపురముల
భాభాసితానూనపరమౌషధీలతాచారుతరానేకతోరణములఁ
జిత్రవర్ణాతిశయరత్నచిత్రితాంగ। రంగవల్లీబహుసురంగాంగణములఁ [౯౮౭
గలిగి విశ్వంబునకుఁ దనవెలుఁగు వెలుఁగు। సేయుఁ దేజోమయంబగుశివపురంబు.

---

రొయ్యనె రయ్యనె వారదేశదిం." నేమిచంద్రునియర్ధనేమిపురాణం. తృణజ్యోతి = ౩౨ సిద్ధౌషధులలోనొకటి. "స్థలజ్యోతి స్తృణజ్యోతి రుచ్ఛటా హేమవల్లరీ" అని సిద్ధరసార్ణవము, మఱియు "కానెంద్రఅపుల్ జోది పెరియజోది కఱుత్తునింద్రకొడువేలి చాయావిరుక్షం "అని సర్వగురునిగసవాదశాస్త్రము." తృణజ్యోతి రితి ప్రోక్తా శ్శృణు దివ్యౌషధీం ప్రియే నిశాసు ప్రజ్వలే న్నిత్యం నాహ్ని జ్వలతి పార్వతి। తస్యమూలేతు నిక్షిప్తం క్షీరం రక్తం భవేత్ క్షణాత్" అనిమంథానభైరవతంత్రము.

క ॥ కని యప్పుడు సనహరిసురపనిలింపాసురనరాహిపతులు ముదం
బున వచ్చి చొచ్చి తత్పురి వినుతించుచుఁ జనిరి పురమువీధిం దఱియన్ ౬౮౮

వ ॥ ఇట్లు రమణీయం బగు రాజమార్గంబు గడచి సదాశివద్వారంబు దూఱి మహాద్వారం బునకుం జని తద్ద్వారపాలకనివారితులై నిలిచి తదనంతరంబ పరమేశ్వరునవసరంబు వడసి నందిమహాకాళానుజ్ఞాతులై సభామందిరంబున కరిగి తన్మధ్యమణివేదికాతలంబున ధర్మాద్యష్టదళాంబుజైశ్వర్యపరిశోభితోత్తుంగసింహాసనాసీనుండై నిఖిలగణపరివృతుండై తమకుం బ్రత్యక్షం బైయున్నత్రిలోచనుం గని సర్వాంగీణప్రణామజయజీవస్తుతిశతంబులం గరకమలకుట్మలపుటఘటితనిటలతటవిలసితు లగుచున్నం దత్పురవరుం గని వరదుండు కరుణారసార్ద్రహృదయుండై ౬౮౯

సీ ॥ దరహాససౌదామనుల్ దనర మొగమలరించి నీరజోదరుఁ దన్నుఁ జేరఁ బిలిచె
వచనామృతౌఘప్రవాహాభిషిక్తుఁ గాఁ జేయుచుఁ బరమేష్ఠి దాయఁ బిలిచెఁ
గరతలారుణదీప్తి కరరుహద్యుతులతో సంధిల్ల నింద్రుఁ జేసన్న నునిచె
దృక్ఛరీచులు వర్వ దిగధీశ్వరుల నోలి మన్నించి కన్నులసన్న నునిచె
నంత నంది మహాకాళు లఖిలసిద్ధసాధ్యదేవాసురేంద్రాదిజనుల నెల్ల
నరుస నునిచిరి శివుఁడు దేవతల కెల్లఁ గరుణఁ గొలువిచ్చి పేరోలగమున నుండె. ౬౯౦

మ ॥ అరిషడ్వర్గజయుండు దత్త్వవిదుఁ డాత్మారాముఁ డజ్ఞానసిం
ధురకుంభాగ్రవిదారుణోగ్రనఖవద్బోధర్వవిఖ్యాతకే
సరి దుర్వారగభీరఘోరతరసంసారోర్వికూపారసం
తరణాత్యున్నతసేతుకల్పుఁ డఖిలాంధ్యానుండు ధీరుం డెపన్ ౬౯౧

క ॥ సకలజనవినుతగుణగణనికరమణిప్రచురరుచిరనిర్మలభూషా
ప్రకరాకల్పుఁ డనల్పుఁడు సుకవిజనప్రణుతకీర్తియశోనిధి పేర్మిన్ ౬౯౨

మ ॥ పరమానందుఁ డనిందితాచరణుఁ డభ్రాంతుండు శాంతుండు దు
ర్ధరసంసారసుఖోరుభూరితరకాంతారాంతరోద్భూతసం
కరకర్మేంద్రియదుష్టసత్త్వభవసంగత్యక్తసువ్యక్తభా
సురబోధాత్మకుఁ డాత్మతత్త్వగతిసంశుద్ధుండు సిద్ధుం డిలన్ ౬౯౩

క ॥ అబ్ధిగభీరుఁడు సద్గుణలుబ్ధుఁడు భూలోకపాలలోచనుఁడఖిలా
రబ్ధవిముక్తుఁడు బోధాలబ్ధుఁడు మునిముఖ్యముఖులలాముఁడు ధాత్రిన్ ౯౯౪

వ ॥ భూసురకులాగ్రణిప్రబుద్ధుఁడు ప్రసిద్ధుం
డాసకలలోకవినుతాత్ముఁడుమహాత్ముం
డాసురభవోత్తరణుఁ డాద్యుఁ డవిభేద్యుం
డాసురగురుండు మఱియుందు నుతుఁడెందున్ ౯౯౫

గద్యము ॥ ఇది శ్రీమజ్జంగమమల్లికార్జునదేవదివ్య శ్రీపాదపంకజ భ్రమరాయమాణ కవిరాజశిఖామణినన్నెచోడదేవప్రణీతం బైనకుమారసంభవం బనుకథయందు సప్తమాశ్వాసము. ౯౯౬



# ఏతద్వ్యాఖ్యానోదాహృత గ్రంథ నామసంకేతవివరణము.

భార=కవిత్రయము వారి భారతము.

విజ=తిక్కన విజయసేనము.

హరి=ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము.

నృసిం=నృసింహపురాణము.

భేతా=కవిభల్లటుని విక్రమార్కచరిత.

కళా=నన్నెచోడుని కళావిలాసము.

ప్రద్యు=పిన్నకోటపెద్దనప్రద్యుమ్నచరిత.

కావ్య=కావ్యాలంకారచూడామణి.

కుమా=ఎఱ్ఱాప్రెగ్గడ కుమార నైషధము.

మల్హ=ఎఱ్ఱాప్రెగ్గడ మల్హణకథ.

నైష=శ్రీనాథుని నైషధము.

కాశీ=కాశీఖండము.

ఉ. హరి=నాచనసోమునిహరివంశము.

సప్త=శ్రీనాథుని సప్తశతి.

వల్ల=వల్లభాభ్యుదయము.

అని=పెమ్మనయనిరుద్ధచరిత.

విక్రి=జక్కనవిక్రమార్కచరిత.

నీతి=భద్రభూపాలునిరాజనీతి.

హరిలీ=తెనాలిరామలింగని హరిలీలావిలాసము.

కంద=రామలింగనికందర్పకేతువిలాసము

పద్మి=పేరయపద్మినీవిజయము.

నిర్వ=తిక్కనయుత్తరరామాయణము.

విక్రమ=అమరేశ్వరునివిక్రమసేనము.

శివ=కపిలోకబ్రహ్మ శివజ్ఞాన దీపిక.

సావి=తులసిబసవనసావిత్రికథ.

దశ=కేతనదశకుమారచరిత.

కాదం=కేతనకాదంబరి.

వీధి=వల్లభరాయనివీధినాటకము.

ప్ర. ప్ర=సూరనప్రభావతీప్రద్యుమ్నము.

ఉద=సూరనయుదయనోదయము.

శాకుం=పినవీరుని శాకుంతలము.

కువ=ఏర్చూరిసింగనకువలయాశ్వచరిత.

ప్రద్యుమ్న=మాధవునిప్రద్యుమ్నవిజయము.

## కన్నడమున

కవిరా=అమోఘవర్షునికవిరాజమార్గ.

విక్రమా=పంపకవిభారతము.

గదా=రన్నకవిగదాయుద్ధము.

జగ=జగన్నాథవిజయము

అర్ధ=నేమిచంద్రునియర్ధనేమిపురాణము.

మల్లి=అభినవపంపనిమల్లినాథపురాణము.

## ద్రవిడభాషలో

జీవ=జీవకచింతామణి.

మణి=మణిమేఖలై.

కలిం=కలింగత్తుబరణి.

## సంస్కృత ప్రాకృతముల

గౌడ=వాక్పతిరాజగౌడవధ.

సేతు=ప్రవరసేనుని సేతుబంధ.

నవ=పద్మగుప్తుని నవసాహసాంకచరిత.

కుమా=ఉద్భటునికుమారసంభవము.

కలా=క్షేమేంద్రునికలావిలాసము.

శ్రీకం=మంఖుకిశ్రీకంఠచరిత్రము.

మంథా=మంథానభైరవకల్పము.

ఖండ=ఖండకాపాలికతంత్రము.

రసా=సిద్ధరసార్ణవము.

రసర=నిత్యనాథునిరసరత్నాకరము.

ఔచి=క్షేమేంద్రుని యౌచిత్యవిచారచర్చ మఱియును.

ఆథర్వణఛందము, కవివాగ్బంధనము కవిలోకసంజీవని, లక్షణసారసంగ్రహము. (పెద్దన), లక్షణశిరోమణి (వేంకటకవి) అప్పకవీయము, కవిజనాశ్రయము (గోపర్ణుడు) మొదలగునవి.

# అనుబంధము.

ఇందులో సంఖ్య పద్యసంఖ్యను దెలుపును.

9. ఇందుఁ బ్రాసమున దీర్ఘముమీఁది యరసున్న నెఱసున్నగా వాడఁబడినది. ఈవిషయమై పీఠికలోఁ జూడుఁడు. విష్ణువు మహేశ్వరుని వామాంగమునందు జనించె నని చోళుఁడన్నను మఱియొక కవి దక్షిణాంగమని చెప్పుచున్నాఁడు. "బంట్లున్న పాలెంబ బలువిల్లుగాఁ జేసి నవమణివలయంబు నారిఁ జేసి। నుదుటి నెన్నడిమి కన్నునుములికిగాఁ జేసి దక్షిణాంగంబ యస్త్రమ్ముఁ జేసి" అని పేరయ మల్లికార్జునశతకము. బొడ్డుపాటి కొండయ తన కాళహస్తి శతకములో వామాంగమనియే చెప్పెను. "ఊర్వ్వులశ్వంబులై యుప్పారుచుండంగ దొరయుపల్లెరము నూతుండుగాఁగ। సవ్యాంగమతిఘోర సాయకంబదిగాఁగ సారిదిఁ గుంతలము మైజోడుగాఁగ" 6. అనయము = మిక్కిలి. 8. స్థాణువు = మొఱడు, అపర్ణా = ఆకులులేనిది. విశాఖ = కొమ్మలులేని. 11. ఎలయు = ప్రసన్నమగు. 12. సద్యము = అప్పుడు. "సద్యంబ బ్రహ్మహత్యావద్యము" భార-స్వ. 17. వాల్మీకుఁడు — "వాల్మీకిశ్చాపి వాల్మీకో వలటానరటాతథా" ద్విరూపకోశము. 22. మహాకవిబాణుని కరములు తునుమంబడి శివప్రసాదముచేఁ గ్రమ్మఱలభించినట్లు కవిస్తోత్రముల వలనఁ దెలియుచున్నదిగాని యెంతవఱకు నిజమో తెలియదు. బాణాసురుని విషయముగా న ప్రస్తుతశ్లేషమున గ్రహించినచో సరసముగానుండును. "గద్యంబు చెప్పి శంకరునిచేఁ గరములు ప్రతిభతోఁ బడసిన బాణుఁ దలఁచి। హరునివినుతులచే బాసటఁ జేసినట్టి భట్టుని నన్నయభట్టుఁ బొగడి" అమరేశ్వరుని విక్రమసేనము.

21. ఉద్భటుఁడు కుమారసంభవము, కావ్యాలంకార సారసంగ్రహము, హరలీలయుఁ జెప్పినవాఁడు. కాశ్మీరజయాపీడుని సంస్థానమున నుండినవాఁడు. 35. ప్రాణములు = దశప్రాణములు. 36. మేలిల్లు = శ్రేష్ఠమగుచున్న (ధాతుపదము) 38. గ్రుడ్డివాఁడు లావుకపక్షినిఁ ద్రొక్కినట్లు = ఘుణాక్షరన్యాయముగ. పోల్చిచూడుఁడు "జీయమెనె బల్లవర్ నెఱయె సత్కృతివేళదె పేళ్ ఘుణాక్షర। ప్రాయదెశబ్దమొందెరడుమత్తెవిచారిసినోడె కాకతాళీయదె వాక్యమొందెరడుకూడె నిఘుర్నివో డంధలావుక। న్యాయడె భావ మొందెరడులేసెనె పేళ్దుఱదిర్పుదొప్పమే" చంద్రప్రభపురాణం-ఆ-౧-౪౮. 40. పోల్చిచూడుఁడు. "పదలాలిత్యము వర్గశుద్ధియును శబ్దస్థైర్యముం జంగిళా। స్పదభావంబును రాజయోగ్యతయు దోషస్ఫూర్తి రాహిత్యముం। సదలంకారవిశేషముం గలిగి నిశ్వప్రాణసౌభాగ్యసం। పదమైఁ దేజియఁబోలిక్రాల వలదా పద్యంబు హృద్యస్థితిన్" అని కవిలోకబ్రహ్మ.

72 మైకొన్న = ఇష్టపడినయెడల. 74 జీవితేశ్వరుఁడు = యముఁడు. 79 అహోవక = తనివిలేక. 82 ఉలివి = మ్రోఁత. ఆలించి విని = ఆదరించి విని. ("అక్కొమ్మమధురోక్తు లాలించి యెన్నఁడు వీనుల విన సంభవించునొక్కొ" ఉద - ఆ-౧-౧౭౧:) = 89 వెల్వెన్ = తెల్లనగునట్లు. 90 సోలంబునన్ = మత్తుతో. 92

పులువులు = పక్షులు. 94 మునుమిడి = వరుసగా. 95 సావి = యని. 98 కడివోవ = చెడ్డవాసన పోవునట్లు. కాతరిల్లి=ఉత్సహించి. "బగె సంభోగసుఖక్కెకాతరిసి కణ్గళ్ కిడి సర్వాంగమం లెగ వాలింగిసె" పంప రామా-౯-౭౭. 102 కన్నెఱింగి=జాడ దెలిసి. 105 ఒకమెయి=కామరూపశక్తి లేని యొకదేహముతో. 126 గో=కిరణముల. 160 కసగోల=కశ. కోల=బాణము, గరి=ఈక. (విష్ణువు బాణమై యగ్ని బాణాగ్రముగాఁ ద్రిపురవిజయమునఁ బరిణమించినందునకు, "వింటిక్రిందటికొమ్ము వెకలించి పెఱికిన భూకాంతకును నాభి పొలుపు మిగిలె।నమ్ము పుచ్చుకొనిన నమితతరంగముల్ పాలసంద్రంబునఁ బ్రజ్వరిల్లె। బండుకండులు రెండు పండ్లగిలించినఁ గలువలుఁ దామరల్ సెలిమిసేసె।వాజులుఁ గొని వచ్చి వరరథంబునఁ బూన్పఁ జిచ్చుకు నాకలిచిచ్చు పుట్టె। నారి సంధింపఁ గశ్యపనారి వడఁకెఁ। గోల సంధింప లచ్చికి గోలపుట్టె। పిల్లుదెగఁబాపెఁ బురములు ద్రెళ్ళ నేసి।తరిదివిలుకాఁడ వాడువ శరభలింగ" అని పాలపగ్గిసోమేశ్వరుఁడు "నుదుటి నెన్నడిమికన్నును నుల్కిగాఁ జేసి దక్షిణాంగంబ యస్త్రముగఁ జేసి." "గరితోడఁ గూడ నాకసపుసూటికి లాగు నెమ్మేనఁ బద నిచ్చునమ్ము దొడిగి" పేరయమల్లికార్జునశతకములోని భిన్నపద్యపాదములు.

163 అన్నిన = మదించిన. 164 పరవిడి = నాచాటుఁడు. తొఱకి = దిగి. తుత్తుఱుగొని = గొంతు కట్టుకొని. 188 ఎత్తు = దండెత్తు. 189 విగుర్వించి= భయము మూపి. "వారిధిమేరెదప్పి కవివంతు విగుర్వినిదఱ దశాననం" పంపరామా-౯-౧౯౩. 194 తలము =ఆవశ్యకము. 198 చీకటి—అరనున్న లేకుండుటకు "నీకరంబులు ద్రోవక చీకటియును" భార - ఆను శా - ౮ - ౪. "నా కూఁతుబోజుఁగు వినుము నృపా కటపిట...నాతం। జేకతము.— । చీకటి నొకనాఁడు దెచ్చి చెచ్చెర నిచ్చెఁ" దశ - ౮ - ౬ - ౯౯. 207 తేవాఁగు = ఉదుము.

210 కవి=ఆక్రమణము. 212 పందల=పుట్టై "పందలెమోళి దొరణవనీయుదరం పొసమూమ ధూపతూగుందలె" అర్ధనేమిపురాణము. "సత్తి గెగ్గరంకరుళబక్కళె మంటవ కణ్గళె సరం। సుత్తివ బాళదుళ్కి వియసూంటగె పందలెనొండు" గుణవర్మని శూద్రకము. యెత్తి= వేఱుపఱచి. 219 కావడించి = క్రొవ్వియునట్టు 221 కడిసన్న = వాసనపోయిన. 229 కానుపు = కానుగు.

234. చరులు = చప్పటలు, గెత్తుచు = ఊఁగుచు. 235. అపూర్వపదములకుఁ బ్రయోగంబులు మృగ్యంబులు. 247 శివహిమవంతులకుశ్లేష. 251 కీడు = తప్పువ. 253 పట్ట్రోడి = ప్రవాహము. 259 పుఱు = లక్ష్యము సేయుట. "సు ఱాసు సురేంద్రుఁడైన" భార. ఆది. రేయెండ=బాలాతపము. "కటి పచ్చపట్టు దిగ్గంలి

కుంభస్థలి మూపట్టు రేయెండ జాడుజాడు” ఉ - హరి - ఆ - ౪. 268 తార=వెండి. 281 అంకమాలిక = నామాంకితస్తుతులు. “ఇనియనమేల మెల్లనమలఁగి మనంగోళీ భంగియుండె సం। జనితవికారము విప్పె నిజసౌష్ఠవమొందిర బీగి పీవర। స్తనయుగమధ్య దోళ్ కరము డంబడె జీవెయనుణ్ణు భంగిమే। లెని సెవధూటి పాడిమెఱదళ్ నయదిం ప్రియ నంకమాలెయం” కవికాముని శృంగారరత్నాకరం. ఆ. ౧ - ౪౭. పత్రచ్ఛేదము=కళా విశేషము. 283 మలఁపగ=పుష్పింప. 297 రాజశేఖరుని పూర్ణచాటువు=“కర్ణాటీ దశనాంకిత: స్మితమహారాష్ట్రీకటాక్షాహతః ప్రౌఢాంధ్రీ స్తనపీడితః ప్రణయినీభ్రూభంగవి త్రాసితః లాటీ బాహువివేష్టితశ్చ మలయస్త్రీతర్జనీతర్జితః సోయం సంప్రతి రాజశేఖరకవి ర్వారాణసీంవాంఛతి” 305. తొప్ప=ఎఱ్ఱనైన. “తొప్పవాతెఱ” వీధి. ౨౦౩, 315 తిరులు=వెఱ్ఱి. 319. సురంగము=ఒప్పిదము. 320 ముంచితెచ్చి=అంతయుఁదెచ్చి. “ఇందుకరావళి ముంచితెచ్చి” కేయూ - ఆ - ౪. ౩౪. 345 వరుపు=దాస్యపు. 351 పసిగొని = ఆఁకలిగొని. ఏఁగిలింపకుండ = ఆకలు విప్పకుండ. ఎరలి = ఆలింగనో ష్ఠభావమును బొంది. 359 అనయము = మిక్కిలి. 361 అబ్బగించు = ఓర్చు. 371 పలుపట్టు=నిరంకుశుఁడగు. అబ్జుఁడు = చంద్రుఁడు. మొగపెట్టు=ఎదిరించు. 372 ఓఁగులవాఁడు—యుద్ధమునఁ బాణువానికి శత్రుయిచ్చి తక్కినవారినెదుటఁ గొంపోయి భంగము చూపుట. 373 అర్క = జిల్లెడు. వెలిలోఁపు = అంతర్బహి స్సులు = న్యాయాన్యాయములు. 375 ఈడవిడుచు = కాపాడక విడుచు. 379 బండఁగి = దీమము. త్రోచి=అవ్వలఁదఱిమి. 381 ఒరయుగడ =competition. 382 దీర్ఘనిద్ర = చావు. 383 ఆర = అంగారకుఁడు. మంద = శని. 384 అని మిష = చేఁపలు. భీమ ఆరుతము. కనక = ఉమ్మెత. శివ = నక్క, 386 శుక్లశోణి తముల రెంటికిని వీర్య మనఁజను. 392. విరలి = విరాళి. 394 అప్సరస = అకా రాంతము గూడఁ గలదు. 396 ఎచ్చి = పొగడి. 398 తిరులు = వెఱ్ఱి. 399 వేల = దాస్యము. కలుచు = ప్రేమించు. 400 అగ్గలము = మించినవారు. 401 తన్ను = నన్ను. ఇట్టిప్రయోగములు ప్రాచీనకవులలోఁ గలవు. “ఒలసి మాముందఱ నొక పైఁడిమృగము। వోలయుటయును జూచి భూనాథుఁజూచి దాని నేగతినైనఁ దనకుఁ దెమ్మనినఁ బూని రాముఁడువోయె... నార్తరవంబు శూలమై నాచెవిఁ జొచ్చి నాటు టయు” రంగ - ఆరణ్య. “చెప్పకున్న నీవు జీవంబు విడుతువు చెప్పినపుడు తనకు జీవ హాని। చెప్పి మున్న నీకు జీవంబు విడిచెద। నీవు చన్నపిదప నిలువలేను” “అక్కన్యఁ దెచ్చి। పెండ్లిసేయుము తన్ను నభీష్టమిదియ। యనిన నగుఁగాక యనుచు ధరాధిపుండు” కవిభల్లటుని భేతాళపంచవింశతి.

411 వాఁచ్చుచు=ఎదురు సూచుచు. 414. కనుకుకొను = అస్ఫుటవాక్యాలాడుచు. 415 కండవడము=తెలి. "కండవడం బెరసీరెనీర్గలం" కబ్బిగరక్కైపిడి. "తళిగ్గళకండవడంగళ|తళిగ్గళపాసుగళ తళిగ్గళోవరిగళకెం|దళిగ్గళళనిపెళవిఱిగ్గళే|విలాంగనుంమెకెఱద రన్నికెలరబలెయరొళ్" ఆదిపురాణం. ఆ-౧౧. ౭౯. కరువటిల్లు=వడఁకు. 416 ఉదరిపడి =ఉలికిపడి. తెంకె = సందేహము. నోటికండ=భయము. 418 పూనికాఁడు=ఉద్యోగి. పోఁటుమాఁట=పొడుచుటలో నేర్పరి. ఎల్లిదుండు=హేళితుండు. 426 బూటగొంగ=విటుఁడు, 432 అంతి=మితి=శక్తి. 436 కొసరు=మఱిమఱిఁ బ్రార్థించు.

443. అరము = ఆరామము. "ఏపునఁ జెలరేఁగి యేయుమనోజన్ము చెఱకువిల్ రెండుగా విఱిచినైతు|పలువర్ర పలుకుచిల్కలనాలుకలముల్లు విఱిచి యారములలో వెడలనడుతు|మదమున ప్రోయుతుమ్మెదలఁ జంపకలతాంతములలో మునుఁగంగఁ దఱిమినైతుఁదగులమ్మై వీతెంచుదక్షిణాశాగంధవహు మహహీంద్రునివాతఁ ద్రోతు|నేటి కుఱికెదు నాయట్టిపోటి కలుగ|వెలఁది సీమదిలోపల వెఱవకుండు|మమ్మ ధైర్యంబు వదలకమమ్మ యెందుఁ|గత్తులము గర్గమేనికిఁ గలదె బాధ" విక్రమసేనము, ఆ-౨. 445 తీగ శబ్దమున నరసున్న లేదు. "తీగయుయ్యెలలెక్కి... దాగు... పు|న్నాగ... భోగ" భార. ఆది. (ఇంకుడాగు = ఎగురు) ఓయలపాటలు = పుష్పాపచయగీతములు. 453 గొనపరి = శిల్పి.

455 పోల్చి చూడుఁడు:— "అలితతి నీలముల్ కుదురుటాకులు పచ్చలు లేఁజిగుళ్ళు కెంపులు దళరాజి వజ్రమయముల్ కళికావళు లాఁడిముత్తియం|బులుగఁ బొసంగు చంగజునిబొక్కసమెల్లను నాత్మలోననిం|పులు పొదలించె రాజునకుఁ బూఁబెడం గగుపొన్నలున్నతిన్." సూరనయుదయనోదయము - ఆ-౧ - ౧౨౪. 457 పలుఁకు = తెల్లబాఱు. 465 సర్వత: ప్రాసనీసము. 469 నంచు = సగము కొఱికి చప్పరించెడు. 471 అలికి = చల్లి. 492 తరమైన = అనుకూలమగు. ఈఁగరులాడు = కొట్టుకొను. 493 గడికి = మఱుఁగునకు. 502 కాపువచ్చు = ఏలుటకు వచ్చునట్లు. "భీషణరుచుల్ జాజ్వల్యమానంబుగా|జ్యోతిర్లోకము గాఁపువచ్చెనొకొ నాశోభిల్లు" కుమా. ఆ-౧౦. "వారిధిశయనుఁ జేయూరఁబూజింపని ఖలుఁగట్టి పెడకేలు గట్టి తెండు|హరిమందిరమున కధీశుఁడై నడవని హీనాత్ముఁ గాల్పట్టి యీడ్చి తెండు వలవదు భయంబు వారెంత వారలైన|నట్టివారలు మన కగ్గమైనవారు|వారు నిరయంబునకుఁ గాఁపువచ్చువార|లనుచు బుద్ధిగఁ జెప్పె మార్తాండసుతుఁడు" మలయమారుతముసింగన్న కవుల షష్ఠము. 508 పక్కగొన=పూరేకులు మొనలు ముడుచుకొనునట్లు. "పక్కవాసినపూవు పదువతోఁ జెరలాండి యిలనుఁ బూఁబానుపు లలవరించు" ప్రద్యుచ.

ఆ-౧. 509 తలకఁ = నీరుచెదరిపడు. 513 నానావిధదృష్టులకు లక్షణము:-చూడుండు భారతీయము. అష్టమాధ్యాయము. దృష్టివిశేషములకును 'పర్వి' మొదలగుక్రియాపదములకును క్రమాలంకారము. 515 పోల్చి చూడుఁడు. "బొమలెక్కించిన విల్లువంచు నునుఁజూపుల్ చంచలాంచలక్రమరేఖ న్నిగిడింప శాతవిశిఖౌఘంబుల్ సోయిన్నించు నెయ్యమునఁ బల్కఁగ నల్కమీఱి చేటులజ్యాఘోషముం జేయు నయ్యమ ప్రాప్తోంది రతీశ్వరుండు హరు బిట్టోడింప నుఱ్ఱాడుచుఁ", పాండు. ఆ-౧. 517 చేర్బిందులు = చెమటబిందువులు. 520 ఒత్తలించు = సమీపింపఁ జూచు, "గజయాన మెలఁగిన గతిరైనఁ బైఁబడ గద్దించి తర్కించి కలఁకనొందు। మానిని యగ్గిన మాడ్కిఁ దోఁచిన దేర్ప నూకించి భావించి యొత్తలించుఁ। జపలాక్షి నెమ్మోవి చవిగొన్నయట్లైనఁ జెమరించి చర్చించి చిన్నఁబోవు। మదవతికౌఁగిలి గదిసినయట్లైనఁ బులకించి తేలి సంచలతనొందుఁ। దన్ను మెఱసినకోర్కులు తగులుగొలుపు। నోలిఁ దనలోన నలినరపాలసుతుఁడు। మానమూటాడ గంభీరమహిమ సడల।లజ్జ గడివోవ ధైర్యంబు లావు దిగఁగ" ప్రద్యుమ్నచరిత్ర-ఆ-౪. "విరుల నూఁకించు చన్గవవిరులయందు। వలులు రేకుల కాంతికి వన్నెవెట్టె। రమణరమణీజనానురాగములతోడ నిగిడి యెలసంజ వడమట నివ్వటిల్లె" పెమ్మన-అనిరుద్ధచరిత్రము-ఆ-౨-సీసము నెత్తుగీతి. 524 శాయ్యు = స్థాయిభావరసాతిరేకము. 526 ఇంద్రుఁడును మన్మథుఁడును నల్లనివారు. "రామచంద్రుఁడు నల్పు సామజం బదినల్పు రతివల్లభుఁడు నల్పు రాత్రినల్పు" చాటువు. 540 ఎడ=అవకాశము. 542 ఒరయ = పరీక్షింప. 544 కాడుపఱచి = అడవిపాలు చేసి. 549 వడవడు = ఎండిపోవు. పెరిగిన = తెగిన. 550 అడలడి = వ్యసనము. 552 విడుమర = వియోగము. 553. వినుకలిచేటంబు = శ్రవణానురాగము. 556 తప్పఁజూచుడో = దయమాలి చూచుటయో. 561 మేలిల్లు = శ్రేష్ఠ మగుచున్న (క్రియాపదము). 562 సంబెరము = పరులభావవికృతులకుమనస్సునఁ గారుణ్యము కలిగి తుల్యానుభావము నెందుట. 565 వావిరి = పనవి. బిందము = భేదశబ్దతద్భవము. 568 ఊర్మడించు = నిట్టూర్పు విడుచు. 569 నలపలేదు = నలపఁజాలని యంత సౌకుమార్యము గలది. 571 అగ్గడి = సిగ్గులేని. 572 చిక్కనిడెందము = గట్టిమనసు. అరుగడ=పోవుట. 576 పోలదు=ఒప్పదు 580 పొరమాల=రూపు నశించునట్లు. 583 ఎచ్చిలి=తెప్పిలి. 584 దృష్టిమరణము లను నవస్థలు దక్కఁ దక్కినదశావస్థ లిందులోఁ క్రమముగా వర్ణింపఁబడినది. 588 ఉచ్చకించు=ఎత్తివేసెడు. పరవాళులు=ధారాగృహములో యంత్రముఖమున జాఱుచున్నధారలు. 589 భావజహరుల పరస్పరవిరోధమునకు దగినసాత్త్వికవికారములు వర్ణింపఁబడియె. 581 అబ్బగింపక=ఓర్వలేక. 594

కొమరు = శిరోభూషణము. 597 ఋజ్వాగతము = చిత్రశాస్త్రమున రేఖలు వ్రాయు పంచమార్గములలో నొకటి - తక్కినవి :— అర్ధ ఋజుపు, సాచి, ద్వ్యర్ధాక్షి, పార్శ్వాగతము. చిత్రపటరూపములు మనలఁ జూచుదృష్టిభేదములఁ జూపురేఖలే యైదును. పోల్చి చూడుఁడు „కిళి ఋజ్వాగతదింద మర్ధఋజు విందం కోకిలం సాచియిం। కలహంసీకలభం రథాంగమిథునం ద్వ్యర్ధాక్షియిం బర్హిమం। డలి పార్శ్వాగతదిం దదేం పడెదవో పంచాండకవ్యక్తి క।గ్రో ళె కందర్పనబాణపంచకదవోల్ చిత్త క్కాతిక్షోభమం” అని మల్లినాథపురాణములోని చిత్రపటవర్ణనము. పత్రక, బిందుక, నిమ్నోన్నత, మాన, నీలక, ధూమ్రావర్తక, ఉద్వర్తన, చిత్రప్రవర్తనము లను నెనిమిదియు క్రమముగా సకల, స్వస్తిక, సర్వతోభద్ర, కళిక, కంటక, త్రిభంగ, శిశునిరీక్షణ, వర్ధమానము లను నెనిమిది విధములగు చిత్రరూపములకు లేఖనమార్గములు. వన్నెవ = వర్ణము. కందెఱ = గవిసెన, కప్పుపావడ. 600. మెయి = రీతి. చలిమిరి = శైత్యము. గిల్కుడు = అపహరించు. 601 అగుడు = అగుట. కలపికొని = చేర్చికొని. „బాలచంద్రికం గలపికొని తక్కటిచెలుల వంచింది” దశ. ఆ౩. 605 కప్పిపల్కు = మఱుఁగుసేయు. బయల్పడ = స్పష్టమగునట్లు. 606 వలరసము = అనురాగము. కుక్కిదము = తొలకునట్లునిండుట. 611 లగ్గెగ్గి = „లగ్గ బెగ్గలించు నగ్గలముగ” భార - విరా-ఆ- ౨. 613 అరుణ = కెంపు; సూర్యుఁడు: చేతరింప = పునరుజ్జీవనము గలుగ నమృతమున కిట్టిగుణము గలదుకదా. వలను = యుక్తిమార్గము. 616 తోవకామలు = కలువకాఁడలు. 618 గంటులు = వేళ్ళు. మురుపు = గిల్లుటు, కొలవేళులు = వట్టివేళ్ళు. „తెరుణియ రావిలాసకుసుమాస్త్రన నీక్షిసె కామతాపదిం। తరుణమృణాళమం తెగెదు పూగొళదిం పొఱగిక్కిదందదిం।కొరగిమృణాళ నాళిక్కెగెచందన దళ్కెగె తఱ్ఱుళిల్గెత।గ్గరగద సూసునీర్గె కొలవేర్ గొడలం గుఱియాగె మాడువర్” మల్లి. ఆ - ౩. ౨౧. వడివెట్టు = నీరు వఱియునట్లు పెట్టుము. 624 వాసించి వాసనలు కూర్చి. „నీహారజలముల నిండారుకుండలు శిశిరగంధముల వాసించువారు” దశ-ఆ౩-౧౨౪. వాటి = పోఁగొట్టి. ఎలమి = ఒత్తి. 627 పాటించి మృదుత్వమున కనుకూలముగాఁ గూర్చి. „పూవుసెజ్జలును లేఁబాఱలవీచోపులు వెరవు పాటించి గావించువారు” దశ-ఆ-౩. 628 కులిరు = శైత్యము. 634 వఱువట్టు = మిక్కిలి యెండి దాహము గలుగుట. కొలగొను = చంపు. వగలు = చింతలు, కోరికలు. 638 రేతల = రాత్రిప్రారంభమున. „కొలకుతలఁజేరు” కేయూ. ఆ-౩. నక్కు = వినుగు. 641 కని = తీట. విడిగొల్చి = విప్పి. తని = చల్లని. అఱమి = గొంతు రాపడి. ఎలనుగ్గు = సన్నపొడి. 662 ఇడుగడ = ఆపద. 670 దేహమును దవన

పుంబోరకుఁ బోల్చుటకు, ‘‘పరిణతఫణిలతాపత్రంబు గదిసినచివురునాఁ జెక్కునఁ జేయి చేర్చి దవనంబుపొరకలఁ గవిసినమంచునాఁ బలుచనిచెమట మైఁ గలసి మెఱయఁ గలువరేకులు మౌక్తికముల నీనెడిని నాఁ గన్నుల బాష్పాంబుకణము లురుల... యేకతం బున్నదాని రాజేంద్రతనయఁ గనిరి లతికాగృహంబులో వనజముఖులు’’ అమరేశ్వరువిక్రమసేనము. నెలకన్ను = చంద్రదర్శనము. 672 అలవు = స్త్రీవి. 674 వేల = దాస్యము. సంబళులు = కప్పములు. గోలికొలిపి = వెట్టిఁజేసి. 676 వెంచు = తమవశము నకుఁ దెచ్చుటకై భ్రమరములు మధ్యనుంచిపాడెడుపురుగు. 682 ఘోషావతి = పార్వతివీణకుఁ బేరు. 684 హార్చుగుమ్మలు = ప్రియమైన చెలిమికత్తెలు. 687 అలఁతికి = మితికి. పొదివెంచు = పురివిచ్చు. మరపించి = స్నేహముచే మఱగియుండునట్లు చేసి. అనఁగి = కలసి. అఱఁగ = పోవునట్లు, విడిచెదేని = విడిచినను విడుతువుగాక. 692 వేరువెల్లంకి = వేళ్ళగడ్డలు. ‘‘వేరువెల్లఁకి గాయగూర పండనికోర కుదరాగ్నిగాడ్పుచే నుజ్జగించి’’ పాండు. ఆ-౨-౭౯. ‘‘అడవిలో వెల్వెలసై వేరువెల్లంకి త్రవ్వితాఁ దినెడు భూదారవరుని’’ అనర్ఘ - ఆ. ౧. 694 పోల్చిచూడుఁడు:— ఉత్తరహరివంశము-ఆ-౨-౧౨౨వ పద్యము. 701 కాఁదపూవులు = వనపుష్పవిశేషము. ఇది వర్షర్తువునఁ బుష్పించును. ‘‘ముగిలిదిరేతె కాదలలరేతె’’ జగన్నాథవిజయము. 702అన్ని = మదించి, గౌఁడుగీతములు = కల్లు దింపెడివారి పాటలు. 704 గోలము = కుదురులు. గౌరుకొమ్ము = ఏనుఁగుకొమ్ముతోఁ జేసిన. 704 మల్లికార్జునుడు-కృతిపతిశివున కభేదముగాఁ జెప్పఁబడినది. 707 వెంచ = సరస్సు. ‘‘వికచసరసీరుహం కోకకులవ్యాభాసి పూగోళం తానిరెయుం బకనికరలులితకలుషోదక విడిళదొ ళంచె వెంచెయొళ్ పసియికుమే’’ గుణవర్మ శూద్రకము. 709 వలి = సుంద్రపు 741. తొప్ప = ఎట్టినగు. (తొప్పవాతెఱయనుదొట్రుపాటు. నిర్వ-ఆ-౮.) 803 ఎయిద = సమీపింపఁజేయు. 803 అగ్నిసహియగు రసమున్ లోహములను వేధించును.

రసముశుద్ధిచేసి హేమవజ్రాద్రిసత్త్వ ద్రుతులలో రసజారణము సేసి ధూమవేధశబ్దవేధియగురసముగాఁజేసి సారణనియతితప్పక యేలోహములలో వేధించినను హేమమగును. ఈయంశములకుఁ జూడుఁడు రసరత్నాకరము వాదఖండము, రసార్ణవము, మంథానభైరవకల్పము, ఖండకాపాలికతంత్రము, రససారము, స్థిరరసమంజరి, కల్యాణకారకము మొదలగురసశాస్త్రములు. 804 సారి = చక్రము. 806 అరగొను = సంచేహించు. అలికిరి = చల్లిరి. 812 ఉప్పరి = ఉప్పుగావండలివడి. 819 దెచ్చుడు = తెచ్చుట, సానోడి = చెప్పుటభయంపడి. కన్ను = జాడ. 821 కాన్కి = చూపు. కాపుడు = అగుట. 825 పోలుపొందు = కుదురియుండునట్లు. 838 తొడుప = తొడిగింప.

త్రేశి=మినమినలాడుట. ఈడవిడుచు=ఊరకవిడుచు. 844 ఈపద్యార్థము కాళిదాసు కుమారసంభవములోనుండి గ్రహింపఁబడినది 846 తగిలించి=ప్రేమింపఁజేసి. సొబగుఁడు=శుభగుఁడు. "సొబగులునీమగలేవురు" భార-ఆర. 850 కుదురు=ఆలవాలము. నఱమ = వికటపు. 855 అష్టమూర్తులు శివునకుఁగలవుగదా. 856 తక్కనేలిన = తానే పాలించిన. అపదార్థుఁడు = వస్తురూపములేనివాఁడు, అవాచ్యుఁడు. 859 నో = నొచ్చునట్లు. 862 బీరకాఁడు = తేజోవంతుని. సెప్పుడు = చెప్పుట. 865 ఊఁపరలు=పరోక్షమున నిందించుటలు. 867 పాడి=ఒద్ది. పోల్చిచూడుఁడు దశకుమారచరిత. ఆ-౬-౯౬. 868 పసిమి = సౌభాగ్యము. 869. అన్నింటియ – "అన్నిష్టసఖియూఁదియున్నదాని" భార-ఆది. పులి= పుల్లని. నగ్నము = దిగంబరత్వము. చెట్లపురులు=ఆశ్చర్యములపుట్ట. 870 కుడిముట్టు=భోజనపాత్ర. గుడిముడి=స్మశానము. వలువు=వస్త్రము. బడుగుఁడు.=దరిద్రుఁడు. 871 చెప్పు=చెప్పెడుమాట. 872 ఎడలించియు=పోఁగొట్టియు. 874 కొఱఁగాఁడు=నీచుఁడు. ఓచెల్ల=బాపురె. కనుడు=కనుట. 880 కొఱడు = స్థాణువు. "బలుగొఱడు వోలె నెండకుఁ। జలికిని వానకును నోర్చి" పంచతంత్రి. 894 కావుడు = అగుట. 897 నోఁచిన = నొచ్చిన. నెఱవిడుపు = గ్రహణమోక్షము. 901. వినిమీలితదృష్టి కినిలోలదృష్టికిని భారతీయము చూడుఁడు. 903 కల్లడి = పొంగు 946. పోల్చిచూడుఁడు:— "ఆపురి నున్నతస్ఫటిక హర్మ్య విభాపటలంబునిండిగను। ద్దీపితమైనఁజూచియిది దివ్యతరంగిణి యెత్తివచ్చెఁదా।నీపయిత్రోవనంచు బయలీఁదుచుఁ గోయఁదలంతు రగ్రసం। స్థాపితహేమకుంభములు తామరలంచు వియచ్చరాంగనల్" పిన్వీరునిశాకుంతలము - ఆ - ౧.

943. "గండరించు" అనునది, "కండరించు" అనియుండవలయు రాతిలో నాకారమేర్పఱచుట యని యర్థము. చూడుఁడు "శ్రీరాజావర్తదిం కండరసిద సతివోల్ కౌస్తుభం మేఘమాళాకారంబోల్" గుణవర్మశూద్రకము. ఆ-౧-౧.

961. గట్టివాలు = గంధపుష్పములు సేయులేకయన్నువాఁడు. గట్టివాలితి–స్త్రీలింగము. "ఎలిమిఁ మెచ్చిన గట్టివాలితియనన్" యనియే యెఱ్ఱాప్రెగ్గడ ప్రయోగించియుండును. కన్నడమున:— గట్టివాత్తి యనిసైరంధ్రికిఁబేరు. "చందనగంధక్కం వదనేందీవరపరిమళక్కె మెఱగువ భృంగీబృందమనులి సోఘుత్తుం మందైసిమగుడ్చి గట్టివాత్తి యరెసగుం" గిరిజాకల్యాణం-ఆ-౭-౯౧. "పరిమళలోభదిం........ గట్టివాత్తియర్" మల్లినాథపురాణం-ఆ-౧-౬౦. ఈశబ్దవిషయమై సీతారామాచార్యులవారి యుత్పత్తియుఁ బ్రయోగమును సరియైనవి కావు. ప్రాచీనకవి ప్రయోగసారస్యము తెలియకయే పెక్కులుగ్రంథములు ముద్రితములయినవి. ఇది శోచనీయము.

79. ఆపోవక—"రూపుగ మెయిఁ గడిగినచో | నాపోవక చాయఁ జూడనగుఁ గంపన్నపా" మంచిభట్టు: అశ్వశాస్త్రము.

164. హరి తననేత్రములతో శివపాదార్చనము సేసి శివుని మెప్పించి యతని చే సుదర్శనంబు వడసె నని కొమ్మనశివలీలావిలాసమున ౧౩- వ లీలలో నున్నది. జలంధరుఁ డను రాక్షసుఁడు హరిని దర్పానకుం జిమ్మి బ్రహ్మాదుల జయించి దేవతలకు వెఱ గొంగయై శివుం దఱిసి యుద్ధమునకుఁ బిలుచుటయు సముద్రవేలావనంబున విహరించు చున్నశివుఁడు సముద్రపునీటిని వలయాకారంబుగాఁ గాలివెన్రవేలిపుటంబున లిఖించిన నందుండి సుదర్శనంబు కలిగినట్లు పైకృతిలో ౨ వ ఆశ్వాసమున నున్నది.

202. అబ్బగింపక = ఓర్వజాలక. 252. కంపు = మంచివాసన. "నీ ఆనకే యమృతంబుఁ దా నిట్టిదని యని జనుల కేర్పఱుపఁగాఁ జాలువారు | చూడక మన్మథునుందరాకారంబు గరిమఁ జూపఁగఁ జాలుకడకవారు | వినకయు పరతత్త్వ పిపులనినాదంబు వినిపింపఁ జాలెడువెరవువారు | నంటక మెఱపులయందంబు క్రేఁగును గణుతింపఁ జాలుప్రఖ్యాతివారు | కంపుగొనకయు కల్పవృక్షములపుష్పసౌరభం బిట్టి దని చెప్పఁ జాలువారు | నెందుఁ జూచిన ధాత్రిలో హృదయదృష్టిఁ గవులు గాననిమర్మంబు గలదె జగతి." అని కేతసకాదంబరి. 269. మేఘడంబరము = ఆతపత్రము. "సుత్తివ పెండవాస దెళపెండిర లోలకటాక్షమాలెయం......మేఘడంబరద తణ్ణెళలొళ్" మల్లినాథపురాణము. ఆ-౫-౯౪.

259. నామరు = పాచిక. 313. ఉప్పయనము. "లలితసరోజసౌరభములం గలయం జని చూచి యెందు మెచ్చొలయమి నాపురాంగనలనొప్పెడువక్త్రసరోజగంధ ముప్ | పలుమఱుఁ గ్రోల సౌధములపై కలివర్గము లేఁగు దానసం | కలితగజేంద్రగండఫల కంబుల నుప్పయనంబు సేయుచున్." భట్టురాజు గౌరీకల్యాణము 432—433. శివుఁడు శరభావతార మెత్తి మిక్కిలి తామసవృత్తితోఁ బ్రవర్తించుచున్న నరసింహునిఁ జీరె ననుకథయు బలి నోడించి తనవిశ్వరూపంబు నుపసంహరింపక వీఁగుచున్న త్రివిక్రమ దేవునినోర్చి యద్దేవుకంకాళంబు శివుఁడు ధరించినకథయు నిశ్శంకకొమ్మన శివలీలావిలాసమున క్రమముగా ౩౨-౩౪ వ లీలలలో వర్ణింపఁబడినవి.

473. అబ్జసూత్రగుణమనుటకు- "గొనయమునుతమ్మినూల్ చెఱకుఁగోల ధను ర్లత" విక్రమసేనము. ఆ-౧

496. ఓజపిడి మదము పట్టిన యాడయేనుఁగు." కచభారం కొరల్గబలెయు | కచభరమనియనడు గె కచకుచజఘనో | పనయభరం తొడెగళ్గెవిచతుబిందం మెట్టి తోర్వ

లోఁజేయుపిడియం' రన్నని యజితపురాణం - ఆ - ౨ - ౪౨. 502 కాపువచ్చు ననుటకు మఱియుం బ్రయోగములు. ,,దీనిలోపలఁ గొన్నిదినము లూనిన నుష్ణకరుఁ డైన నటు శీతకరుఁడు గాఁడె। దీనిలోఁ దెలిఁగిన దా సంబురాశిలోఁ గా దని జలశాయి కాపు రాఁడె। దీనితియ్యనినీరు దివిజులు ద్రావినఁ దమయమృతంబుఁ జేఁ దనుచు ననరె'' అని కేతనకాదంబరిలో నచ్ఛోదసరోవర్ణనము. మఱియు, ,,పల్లవపుష్ప సంపదలఁ బంచి వసంతుఁడు కాపురాకకై। యెల్లవనంబు సంకటము లేదఁగఁ దా రొడికంబుమీఱ నట్ల ల్లన క్రోలి క్రోలి మలయానిలుఁ డందుఁ' బురాణపత్రముల్। దుల్లఁగఁజేసె సత్క్రియఁ బటుత్వము కాముఁడు పిచ్చలింపఁగన్.'' సోమయాజి విజయసేనము. 597 తిట్టం బు=చిత్రము వ్రాయ మొదట నేర్పఱించుసీమ. ,,బరయ లెందు బట్టిగె పలగె యంతరిసీ తిట్ట మిట్టు.'' ఆదిపురాణం - ఆ - ౪ - ౬౩. 597. వన్నువ = వర్ణము వన్నువు-అని, ,,కెమ్మోవివన్నువూన్పి'' అని మరల కవి ప్రయోగించెను. ,,కామితఫలము జక్కవలకు నొసఁగెడిసాంద్రపల్లవపారిజాత మనఁగ। రంజిల్లఁ గెందామరలకు వన్నువ వెట్ట నలువ గూర్చినకెంపుఁగులిశ మనఁగ'' వన్నువునకు, ,,ధరణీజగుల్మలతావితానము పల్లవములకుఁ గట్టెఱవన్ను వొసఁగి'' అని ప్రాచీనకవిప్రయోగములు గలవు. 670. రేయెండ = బాలాతపమే యనుటకు, ,,రేయివెన్నెల నాఁటి రేయెండ యుదయింప బెద రుచకోరంపుఁబిల్ల లనఁగ.'' పినవీరుని శాకుంతలము. ,,కొటుకకొండపైఁ గాయురే యెండకుఁ జెలు పైనపచ్చనివలువవాని.'' కవిలోకబ్రహ్మ. 704. పటికంపుఁగుదుళ్ళ వెట్టి యేనుఁగుకొమ్ముదొకండ్లతో వెదురుబియ్యము దంచుటకు ,,కుదురుగఁ జంగ సాఁచి చనుగుబ్బలు మాటుగఁ బొరుటాకుప। య్యెద పొదలంగ నెన్నరు రొకింత చెమర్పఁగ మేచెబాలి (?) నే। ర్ప దొరలఁ బాడి చందనపురోలున నేనుగుఁగొమ్ముదోఁకటన్। బ్రిది లెడుకొప్పుతో వెదురుబియ్యము గుప్పనిజప్రియాంగనన్'' అని రఘునాథరాయల వాల్మీకి చరిత్రము - ఆ - ౨ - ౧౧౬.

760. పోల్చి చూడుఁడు. ఆముక్తమాల్యద. ఆ-౪-౯౨. 790. ఈపద్య మునకుఁ బూర్వ మొక్కపద్యము నాప్రతులలో విడిచిపోయినట్లు తోఁచుచున్నది. ప్రబంధమణిభూషణములోఁ గుమారసంభవములోనుండి యేడాశ్వాసములలో ౪౦, ౨౬౭, ౨౮౩, ౪౪౭, ౭౭౪, ౭౬౧, ౭౯౨, ౭౯౬, ౯౩౩, ౯౬౩. ఈపద్యము లుదాహరింపఁబడినవి. దీనిలోని దని యీక్రిందిపద్యముకూడ నీయఁబడినది. అది నాప్రతు లలో విడిచిపోయె నేమో. ,,భూచరు లంబరంబున నె పోవుట మే లన నంబరేచరున్। భూచరవృత్తి మే లనఁగ భూచరశేనయు లాజలప్రకే। శీచరణంబు మే లన, జలేచరు

లంబరమధ్యయానధా । త్రీచరణంబు మే లనఁగఁ దీవ్రనిదాఘము పర్వె నుర్వరన్" ఇది 792 గా నుండవలయు. దీనిఁ గేతనకాదంబరిలోనిక్రిందిపద్యముతోఁ బోల్చి చూడుఁడు.

సీ॥ కడువేఁడి పెల్లెండ పుడమి పేల్చినఁ బొద్దు లాకాశగతియ మే లని తలంప
వాత్యాభిహతి లగ్గ వాడి వియచ్చరు లవనిపైఁ జనుట మే లని తలంప
వడవడగా నీళు లుడికిన జలచరుల్ వనచరవృత్తి మే లని తలంప
వనములఁ గార్చిచ్చు దనరిన వనచరు లంబుసంచరణ మే లని తలంప
వాఁడియెండ గాసి వడిగొనె సురగాడ్పు లెసఁగె వడయగాలి నెగసి వీచె
దావదహన మడరె జీవుల కధికసంతాపకారి యగు నిదాఘవేళ.

కేతనకాదంబరి.

792. పోల్చి చూడుఁడు "ఎత్తుగీతి. తలఁపఁ దడవ మనము దరికొనుఁ జూచిన కెప్పలెల్లఁ గమరి యొప్పు తెలుగు । నగులఁ బేరికొన్న నాలుక వొక్కు నిదాఘకాల తపనతాప మడరె." విజ 812. ఉప్పరిపెనము — "కలయంగ ధారుణీతల మగ్నితప్తమై యుప్పరిపెనమట్లు లుచ్చియుండఁ । గులపర్వతంబులు కొలిమిలోఁ గ్రాఁగినయినుపముద్దల క్రియ నెసఁగి యుండ" విజయసేనము 961. గట్టివాలు — మఱియొకప్రయోగము:— "సీ. ఘనసారకస్తూరికాగంధముల నన్యగంధబంధంబులు గలిపి కలిపి । కుసుమితవల్లికాలసితవీథులఁ జొచ్చి గని సరోగృహములఁ మునిఁగి మునిఁగి । సమధికాహోర్యాంగసంగీతములతోన కన్నెతీగల కాట కలిపి కలిపి కుముదకుట్మలకటీకోరకంబులు దూఱి యలిదంపతుల నిద్రఁ దెలిపి తెలిపి । యనుదినమ్ము నప్పురాంతికమ్మున గట్టి । వాలుబోలె విప్రవరుఁడు వోలెఁ । నట్టువోలెఁ దాను నచ్చినచెలివోలె । మలయుచుండు మందమారుతంబు"

పీఠికలో-౪-వ యాశ్వాసములోనిచంద్రికావర్ణనము జక్కన నైకొన్నట్లు రెండుగ్రంథములోనిపద్యములు చూపితిని. తద్వర్ణనమునే కృష్ణవిలాసమున వేంకటకవి "సీ. ఆకాశనది యని యనిమిషాంగనలెల్ల వేడుకతో జలక్రీడ సలుపఁ । బాలమున్నీరని పంకజనాభుండు ఫణిశయ్యఁ గావించి పవ్వళింపఁ । బాదరసం బని మోదించి సిద్ధులు మించి ఘటంబుల నించుకొనఁగ । నమృతంపుసో నని యఖిలామరశ్రేణి చెలఁగి పానంబులు సేయుచుండ । వెన్నెవిరియుచు నుబ్బుచు విశదకాంతిఁ బొదలుచును దివ్య మగుచును భూరిమహిమ । నఖిలజీవుల కానంద మతిశయిల్ల । నచ్చవెన్నెల విమలమై పెచ్చుపెరిగె." చోళుని ౫ భావములో జక్కన యొకనాలుగును వెంకటకవి మఱియొకనాలుగును గ్రహించుట చోద్యము. పాదములును మార్పులేకున్నవి. పైకృష్ణవిలాసముననే,

"నిజరూపరేఖల నెలఁతల వలపించుచాతురి గలభద్రజాతివిటులు। వలసినఘనము లవ్వారిగా నొసఁగుచుఁ దరుణులఁ గరఁగించుదత్తవిటులు। మణిమంత్రములచేత నణుమధ్యలఁ గరంచుమగటిమి గలకూచిమారవిటుల। పలరాజుకళ లుండునెళవులు భేదించి సతులఁ దేలించుపాంచాలవిటులు। వరుస నందఱు తమజాతినారివారి।జాతవదనలఁ గూడి సంజాతమదన। కదనకేళీవిహారసంపదలఁ బొదలి। మొదలుదురు వీట నధికసమ్మదము లొదవ." అనుపద్యము, కుమారసంభవములోని ౮-వ ఆశ్వాసమున నుండుక్రిందిపద్యములోనుండి గ్రహింపఁబడినది:—కమియని లేని శృంగారాదిచేష్టలఁ బచరించుచుండు నాభద్రు నెల్ల। మృదురేఖ ననురక్తిఁ బొదలించి రసమెల్ల గాలించికొనునొ పాంచాలు నెల్ల। ధన మొక్క నీగియ తగులుగా రతి బెట్టిదము సేయునట్టి దత్తకుని నొల్ల। మన సీక మందుల మాయల మరగించి కారించు నాకూచిమారు నొల్ల। గలిచి తాల్మి గల్గుఁ గలిపించి బేటంబు సలుపు నెదురుఁ దన్నుఁ గలిచె నేని। దానుఁ గలిచె నేని తగ నిచ్చు నయువిదుం డని మనోజ్ఞు నొక్కవనిత గలిచె." కుమా. ఆ-౮.

ఈకృష్ణవిలాసకర్త యగువేంకటకవి, కవిస్తుతిలోఁ గవిత్రయమును వేములవాడ భీముని కేతన కవిరాక్షసుని శ్రీనాధసోమభాస్కరపుత్తేటిరామనపెద్దనతిమ్మనతెన్నాలి రామలింగుల స్తుతించి యుండినందున నిటీవలివాఁ డని చెప్ప నక్కఱలేదు. నన్నెచోళుని ౨౦౦సంవత్సరముల కిటీవలివాఁ డని చెప్ప సాహసింతు రేమో. పైఁ జూపఁబడిన పోలిక లన్నియుఁ దత్తక్కవులకు వేఱువేఱ హృదయములలోఁ దోఁచె ననియు నన్నెచోళుని కావ్యము వారుచూచినవారు కా రని మనస్సిద్ధాంతవేత్తలు చెప్పినచో సంగీకరింపవలయు.



# అశుద్ధసూచిక.

| పద్య సంఖ్య. | పాద సంఖ్య. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 1 | 1 | ద్రార్పిత | ద్రార్చిత |
| 1 | 1 | రామా | కామా |
| 1 | 2 | ప్రభుం | ప్రదుం |
| 3 | 1 | దండ | కంద |
| 8 | 3 | దూలఁగ | దూఁగఁగ |
| 5 | 3 | లోక | ఖాండ |
| 7 | 2 | భర్జ | గర్జ |
| 9 | 2 | వలగతి | వశగతి |
| 12 | 2 | సద్వరిష్ఠ | సద్య మిష్ట |
| 14 | 2 | జెప్పి | జేని |
| 18 | 1 | నేయ | నేయుఁ |
| 18 | 1 | యనుచుం | యని చన |
| 18 | 2 | దెడ్డ | దెడద |
| 21 | 1 | ముసాలం | మ్ముసలం |
| 22 | 1 | దునుమం | దును ముడుఁ |
| 23 | 2 | నృపుత్ | నృపుల్ |
| 26 | 1 | దెసకు | దీప |
| 28 | 1 | వదలంగ | వగవంగ |
| 29 | 1 | గుకవి | కుకవి |
| 32 | 2 | రమ్ము...రాత. | రమ్మెుర గంట నొరసి చూచి కా కెఱుగవచ్చు నే సుద్దరాత |
| 34 | 2 | ప్రతిష్ఠించు | ప్రతిష్ఠింతు |
| 36 | 6 | రచింప...నూత్న | సముస్త వస్తుకవీశ్వరరచిత |
| 76 | 2 | డింపుగు | డింపగు |
| 78 | 4 | కంధరం | కందరం |
| 86 | 1 | సార | సౌర |
| 90 | 1 | కటి | కర |
| 90 | 1 | కటి | కట |
| 90 | 2 | చిక్క | శిక్య |
| 90 | 3 | సీదో | సీదూ |
| 93 | 1 | పులుపు | పులువు |
| 91 | 2 | దడింపం | దండింపం |
| 92 | 2 | సద్విజ | సద్ద్విజ |
| 98 | 1 | కడిదోవ | కడివోవ |
| 105 | 2 | నేర్తు | నేర్తు |
| 106 | 1 | లాలలను | లాలను |
| 107 | 1 | బటుషుద | బటుమద |
| 110 | 4 | భాది | భాధి |
| 111 | 1 | జలజాత్యం | జలజార్యం |
| 114 | 3 | కశ్య | కశ్యప |
| 118 | 1 | కరిగెను | కరిగెనో |
| 118 | 2 | తెల్చిన | తేల్చిన |
| 120 | 2 | యన్న | యున్న |
| 122 | 1 | ననువా | సనువా |
| 120 | 2 | మొగళు | మొగుళు |
| 123 | 2 | ధర్మాకర్మ | ధర్మకర్మ |
| 124 | 2 | చేత | ప్రేత |
| 128 | 2 | లోకుఁ | లోకుఁ |
| 129 | 1 | దగ్గిరి | దద్గిరి |
| 141 | 3 | నెద్ద | పెద్ద |

| పద్య సంఖ్య. | పాద సంఖ్య. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 163 | 3 | సహింతురి | సహింతురే |
| 172 | 1 | మంపర | మంథర |
| 172 | 1 | ధే | దే |
| 173 | 4 | కలువాని | కలువుప్వాని |
| 176 | 5 | వడన | మొదలి |
| 183 | 3 | గ్దపిత | ద్దీపిత |
| 189 | 3 | నసేక | ననేక |
| 190 | 3 | గలిపి | గలపి |
| 191 | 1 | ద్యమల | ద్యమరుల |
| 202 | 1 | కప్పగింప | కబ్బగింపక |
| 207 | 1 | దేవాంగు | దేవాఁగు |
| 207 | 2 | దగు | దగ |
| 213 | 2 | వాసక్తు | వాశక్తు |
| 233 | 2 | యదు | యమ |
| 234 | 4 | వాడు | నాడు |
| 237 | 1 | పానభోం | పానలాం |
| 248 | 3 | కలశుఁ | కలశుజుఁ |
| 252 | 1 | రేని | లేని |
| 252 | 2 | వట్ట్రాడి | వట్ట్రోడి |
| 255 | 2 | పొంప్టు | పొంబట్టు |
| 259 | 4 | కాంతరు | కాంతల్ |
| 261 | 1 | నిర్లు | నిరుల్ |
| 261 | 4 | క్రొకొ్క్ర | క్రొకాక్ర |
| 261 | 4 | మెఱుఁగల | మెఱుఁగుల |
| 276 | 1 | దీప్తులంగణ | దీప్తులంగణ |
| 282 | 1 | గవ్వం | మవ్వం |

| పద్య సంఖ్య. | పాద సంఖ్య. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 285 | 1 | కేఁపు | కెంపు |
| 287 | 1 | త్రిష | త్రివ్రిష |
| 294 | 1 | మఘ | మఖ |
| 294 | 2 | నుధ్యమునో | మధ్యమువో |
| 298 | 2 | బహు | బాహు |
| 300 | 1 | మేఖ | మేఘ |
| 307 | 1 | ఖిత్తి | భిత్తి |
| 310 | 2 | శ్రీర్ణావు | శ్రీవర్ణా |
| 319 | 3 | న్నైరసిమొం | న్నైరసెనొం |
| 347 | 1 | క్షీత | క్షితి |
| 361 | 1 | లప్ప | లబ్బ |
| 382 | 2 | ద్బాబప్ప | ద్బాహు |
| 384 | 4 | కోద | కోర్గ |
| 398 | 2 | తుర | కుర |
| 399 | 1 | మహ | మహీ |
| 399 | 3 | నీవు | నీఫు |
| 403 | 4 | నేయు | నేయు |
| 401 | 6 | నెఱి | నెఱఁ |
| 409 | 2 | కింకిరె | కింకరు |
| 409 | 2 | సెరప | నెరప |
| 417 | 5 | లగ్న | లగ్గ |
| 418 | 1 | విడపక | ఎడపక |
| 418 | 4 | నింద్రదు | నింద్రుడు |
| 425 | 2 | వెండియు | వెండియుం |
| క్రింద | 3 | ద్రాక్రియు | ద్రాఫుక్రియ |
| 432 | 2 | ఔద్దవె | ఔద్దవే |

| పద్య సంఖ్య. | పాద సంఖ్య. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 442 | 1 | ధనధ | ధనద |
| 451 | 1 | ఝుంఝరి | ఝరి |
| 452 | 2 | జెలువుగ | జెల్వుగ |
| 459 | 2 | నుతిప | నుతివ |
| 463 | 3 | కొనున్నెల | రసంబల |
| 469 | 4 | కుంపముదిల | ముదకుడెంక |
| 474 | 2 | వూరిత | పూరిత |
| 480 | 1 | భాభసి | భాభాసి |
| 492 | 2 | గుగకో | గిమిలో |
| 499 | 1 | మేఘు | మేఖు |
| 504 | 1 | జాగ్రిమ | జాగ్రత |
| 513 | 4 | నెత్తెంబుగ్గ్ర | నెత్తిపట్టి |
| 516 | 1 | తాంగివ్యు | తాంగికవ్యు |
| 538 | 1 | పొడపు | పొండపు |
| 540 | 4 | లతి | లడి |
| 543 | 1 | నుంతు | నుండు |
| 553 | 4 | మనపు | మనువు |
| 558 | 1 | సత్తి | సంత |
| 558 | 3 | డిల్కు | డిల్కుం |
| 570 | 3 | డిదు | డిందు |
| 571 | 1 | నెరసి | నెరిసి |
| 587 | 2 | నెగసిన | నెగచిన |
| 588 | 1 | నుచ్చు | నుచ్చె |
| 588 | 4 | వొల్ప్పి | వొల్ప్పరు |
| 589 | 4 | బెడ | పొడ |
| 590 | 1 | పరహాసు | పురహాసు |
| 591 | 1 | కప్పగిం | కబ్బగిం |
| 593 | | పిళ్యా | నువ్విళ్యా |
| 594 | 1 | జూదుల | జాదుల |
| 594 | 2 | నుయ | మయ |
| 594 | 3 | భంగబు | భంగంబు |
| 597 | 4 | గజ్వా | బుజ్వా |
| 605 | 2 | యైన | మైన |
| 614 | 1 | మొలఃలయు | మొలయు |
| 617 | 1 | ఆని | అని |
| 618 | 3 | కొలందివేళ్ళ | కొలవేళులి |
| 624 | 6 | యులమి | యెలమి |
| 630 | 2 | బ్రియుం | బ్రియుం |
| 635 | 1 | ఆనుచు | అనుచు |
| 634 | 5 | పగల | వగల |
| 642 | 2 | కల్కు | కిల్కు |
| 644 | 6 | నీద్రెస | నీదెస |
| 651 | 5 | దింతిత | దింత |
| 647 | 2 | యనయు | యునయు |
| 667 | 1 | సేదిరి | వెదిరి |
| 667 | 2 | కని | యిన |
| 670 | 1 | నలి | తలి |
| 670 | 1 | మెల | మెలు |
| 671 | 1 | అవి | అని |
| 671 | 2 | వృన్ఘ | వృద్ధ |
| 674 | 5 | పచ్చు | వచ్చు |
| 681 | 1 | తపోపన | తపోవన |
| 681 | 1,2 | దార్వతి | బార్వతి |

| పద్య సంఖ్య. | పాద సంఖ్య. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 686 | 2 | కల్లిన | కగ్గిన |
| 687 | 1 | సెుడయెుకొని | సెుడ యెత్తి కొని |
| 693 | 1 | చూచిదవ | చూచి త్రదవ |
| 698 | 2 | జంఘుండు | జంఘుండు |
| 704 | 1 | బారాగి | (బ్రాలాగి |
| 704 | 1 | గౌరరొమ్ము | గౌరుణొమ్ము |
| 726 | 2 | యూర్వ | యూర్వ |
| 727 | 2 | యఘూవళిగాంచి | యఘూవళిఁద్రుంచి కోర్కి యగ్గలముగ మాన్చి యిూగ ణలఁ గ్రాంచి [illegible] గా[illegible] |
| 744 | 2 | వెర | [illegible] |
| 747 | 2 | శౌక[illegible] | [illegible] |
| 823 | 3 | క్ఱీధి | ధి[illegible] |

పీఠికలో - 7వ ప[illegible]

| అశుద్ధము | శుద్ధము |
|---|---|
| గ్రుతికర్త | గ్రుతిపతి |

